శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

# అద్వైత విజయః

బెల్లంకొండ రామరాయకవి విరచితః

ఆంధ్రానువాదము

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రకాశకులు :

**రావి కృష్ణకుమారి**

4-103 ఐ.ఎల్.టి.డి. కాలని ఎక్స్‌టెన్షన్,

కొత్తపేట-చీరాల-523 157

శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

# అద్వైత విజయః

బెల్లంకొండ రామరాయకవి విరచితః

ఆంధ్రానువాదము

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రకాశకులు :

**రావి కృష్ణకుమారి**

4-103 ఐ.ఎల్.టి.డి. కాలని ఎక్స్‌టెన్షన్,

కొత్తపేట-చీరాల-523 157

||

# అద్వైత విజయః

బెల్లంకొండ రామరాయకవి విరచిత:

ఆంధ్రానువాదము :

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రథమ ముద్రణ:- అక్టోబరు 31, 2002
ప్రతులు : 500
పేజీలు : 130
వెల రూ.: 20-00


4-103, ILTD Colony Extn., Kothapet,
CHIRALA - 523 157.
Phone : 08594-34054.



DTP by
VIKRAM GRAPHICS
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 37658

Printed at :
SRI VIJAYALAKSHMI OFFSET
Naaz Complex
CHIRALA - 523 155
Ph.: 33057, 30357

## శ్రీః

# శ్రీహయగ్రీవాయనమః



సర్వవిద్యాస్వరూపాయ లక్ష్మీసంశ్లిష్టవక్షసే।
మదుపాసన లక్ష్యాయ హయగ్రీవాయ మంగళమ్॥

శంఖచక్ర మహాముద్రా పుస్తకాఢ్యం చతుర్భుజమ్।
సంపూర్ణచంద్రసంకాశం హయగ్రీవ ముపాస్మహే॥

THIS BOOK,
**ADVAITA VIJAYAH** OF
SRI BELLAMKONDA RAMARAYA KAVI
WITH TELUGU TRANSLATION,
PUBLISHED WITH THE
FINANCIAL ASSISTANCE OF
AJAY CHANDRA. MAKKENA, U.S.A.,
IS PLACED AT
THE LOTUS FEET OF HIS HOLINESS
**SRI SRI SRI BHARATHI THEERTHA SWAMY**
OF SRINGERI SHARADA PEETHAM,
**SRINGERI**

# 'మైరుముకురికా'

జ్ఞానానందమయం రామం - నిర్మలస్ఫటికాంతరమ్,
ఆధారం తత్వ విద్యానాం - హయగ్రీవాయితం మమ:॥

అజీర్ణ భౌమ మధ్యార్థం - జీర్ణ భౌమ శిరశ్శ్రియమ్,
విశిష్టాద్వైతినం శేషం - రామం అద్వైతినం మమ:॥

'అణోరణీయాన్ మహతో మహీయాన్' అయిన ఈశ్వరుడు గోపాలుని, నుంచి గోవిందునిదాకా, పర్వతము నుంచి పరమాణువు దాకా, తన విభూతులను విస్తరించిన విరాట్టు. అట్లే నా వంటి సామాన్యుని నుంచి బెల్లంకొండ రామారావుగారి వఱకు సృజించిన ఆ మహాత్ముడు శ్రీ రామారావుగారి 'అద్వైత విజయం' గ్రంథమునకు నాచేత ఆంధ్రానువాదము చేయించెను.

'ప్రణమేదీశ్వరకలాం ఆశ్వచండాలగోఖరమ్" అన్నట్లు నా యందు దాగి యున్న ఒక ఈశ్వర కల, 'యద్య ద్విభూతి మత్సత్వం, శ్రీమ దూర్జిత మేవ వా' అన్నట్లు 'విభూతి మత్సత్వమయిన' శ్రీ రామారావు గార్కి 'త్వమేవాహమ్' అని నమస్కరించు చున్నది. ఈ పీఠిక మొదలు పెట్టుచున్నది.

శతాధిక గ్రంథరచయిత అయిన యీ ధిషణావతారుడు తన గ్రంథరచనా వ్యాసంగమునకు చెప్పిన కారణమే నా యీ అనువాద కార్యమునకున్ను కారణము. కాకపోతే, నావలెనే నా కారణముగూడా అణుప్రమాణము.

ఆదిభట్ల రామమూర్తి శాస్త్రి గారి యంతటి వారిచే 'వ్యాసుడో ఆది శంకరుడో' అని ఉత్ప్రేక్షింపబడిన యీ మహాత్ముని తత్వమును గుర్తించిన వారు తక్కువేయని చెప్పక తప్పదు. భాగవతములో గల ఒక శ్లోకము ఈ సందర్భమునకు చక్కగా సరిపోవును. చూ॥

'దుర్భగో బత లోకోయం - యాదవా నితరా మపి,
యే సంవసంతో న విదుః - హరిం మీనా ఇవోడుపమ్'

శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు శ్రీ రామారావు గారి 'శంకరాశంకర భాష్యము'ను చదువుకొనుచు గ్రంథపుటలలో వ్రాసిన యీ శ్లోకము రామారావు గారి నిగూఢ జీవతత్వమును దర్శించినది, చూ॥

**ఎటుగుదు మవతారంబవి**
**తురగాస్యుడొ శంకరుండొ తోపదు, బ్రహ్మ**
**స్థిరచిత్తుడు బెల్లము కొం**
**డ రామరాయకవి బుధజవధ్యేయుడయా!**

వేదాంత ముక్తావళి చదువుచూ అందులో శ్రీ శర్మగారే వ్రాసిన మఱొక కందమున్ను అట్టిదే.

**ముక్తావళి వ్రాసిన యా**
**వ్యక్తి నరుండటర! పిచ్చివాడవు గదరా!**
**ప్రాక్తన ఋషి యెవడో యీ**
**వ్యక్తనువు ధరించె, శాంకరీయము విలుపన్॥**

'యథోర్ణనాభి: సృజతే గృహ్యాతేచ' అన్నట్లు 'ఊర్ణనాభి' వలె శ్రీ రామారావు గారు తనలోని అనంత మేధాశక్తిని వెచ్చించుచు శతాధిక గ్రంథములను వ్రాసినది ఎందుకు? ఆ ఊర్ణనాభి తన 'నాభి' నుండి సృజించిన యీ ప్రపంచజాలమునకు ఆ ఊర్ణనాభితత్వమును తెలియపఱచుటకే గదా!

నిష్కారణ కారుణికుడైన యీ ఊర్ణనాభి చంద్రునకు నేను ఈయగలిగినది గూడా, ఆయన సృష్టించిన గూటిలోని ఒక దారమును మాత్రమే. అయితే యీ రామునకు హనుమంతునివలె ఈ 'కవిబ్రహ్మణ్యునకు' సర్వ గ్రంథముద్రణ ద్వారా సేవకుడయిన శ్రీ 'కవితా సుబ్రహ్మణ్యము' గారిని ముందుగా స్మరించి తరించెదము గాక!

శ్రీ రామరాయ చరిత్రమును సుందరముగా వర్ణించిన శ్రీ లంకా సుందర రామ శాస్త్రి గార్కి కృతజ్ఞతలు చెప్పుచు, నేను సంగ్రహముగా శ్రీ రామారావు గారి జీవిత ఘట్టములను ఇందు పొందుపఱచుచున్నాను.

**జీవిత పరిచయము:**

| | | |
|---|---|---|
| జననము | : | 27-12-1875 |
| తండ్రి | : | బెల్లంకొండ మోహనరావు గారు |
| తల్లి | : | హనుమాయమ్మ గారు |
| భార్య | : | ఆదిలక్ష్మమ్మ గారు |
| తాత | : | ఆళ్వారయ్య గారు |

పిన తండ్రి : కేశవరావు గారు (సంరక్షకుడు)
నివాసము : పమిడిపాడు,
నర్సరావుపేట తాలుకా, గుంటూరు జిల్లా
శాఖ : ఋక్
సూత్రం : ఆశ్వలాయన
గోత్రం : భారద్వాజస
మతం : ఆరువేల నియోగి - వైష్ణవము
సిద్ధాంతం : అద్వైతము
గురువులు : ప్రథమ గురువు-బెల్లంకొండ సీతారామయ్య
వ్యాకరణము-పురిఘళ్ళ రామశాస్త్రులు
తర్కము-పురిఘళ్ళ సుబ్రహ్మణ్యశాస్త్రి
యోగము-పాతూరి అక్కుభొట్లు
రచనలు : సాహిత్య, వేదాంతములు, కవిత్వము
నిర్యాణము : 27-10-1914

**వివరణ :**

***బాల్యము:-***

5 సంవత్సరముల వయస్సులో వీరి తండ్రి గారు పరమపదించిరి. తరువాత వీరు పినతండ్రిగారయిన కేశవరావు గారి సంరక్షణలో పెరిగినారు.

***విద్యాభ్యాసము:-***

ఆంగ్ల విద్యాభ్యాసమునకై గుంటూరులో ఒక పాఠశాలలో శ్రీ రామారావు గారు చేరినారు. కాని స్కూలుకు వెళ్లిన ప్రతిసారి వారికి అస్వస్థత కలిగెడిది. అందువలన వీరు ఆంగ్ల విద్యను మానవలసివచ్చెను. అప్పటికి 14 సం॥ వయస్సు. నాటి నుండి శ్రీ సీతారామయ్యగారివద్ద సంస్కృతవిద్య ప్రారంభమయినది. ప్రతి కావ్యమున 2 సర్గలు మాత్రమే చదువుట, ఆ తర్వాత ఆ గ్రంథమంతయు స్వయముగా సమన్వయమగుట - జరిగినవి. కాళిదాసు చెప్పినట్లు - 'ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః' (శ్రీ తాడేపల్లివెంకటప్పయ్యశాస్త్రిగారి విద్యాభ్యాసము గూడా ఇట్టిదే. వారును ఇట్లే మహా పండితులై మహాకవులై పరాశక్తి ప్రత్యక్షానుగ్రహముతో తపోధనులయిరి.) అలంకార, జ్యోతిష, ఆయుర్వేద విశిష్టాద్వైత గ్రంథము లన్నియు వీరికి స్వయముగనే సమన్వయమయినవి.

**స్వప్నము :**

శ్రీ రామారావు గారు విద్యాభ్యాసకాలముననే నమకచమకాదులు నేర్చుకొనిరి. తమ గ్రామములోని 'రమావల్లభరాజ' స్వామికి అర్చన, తులసీవనములో కాలక్షేపము, ఇంట హయగ్రీవ సాలగ్రామార్చన జరుపుచుండిరి.

ఒకనాడు స్వప్నములో ఒక బ్రాహ్మణుడు దర్శనమిచ్చి రామారావు గార్కి 'హయగ్రీవ మంత్రము'ను ఉపదేశించి, ఉపాసనాంగములయిన, కవచము న్యాసము మొ॥ 'దమ్మాలపాడు'లోగల శ్రీ రత్నమాచార్యుల వద్ద దొఱకునని గూడా చెప్పి మాయమయ్యెను. ఆ ప్రకారము రామారావుగారు దమ్మాల పాడులో రత్నమాచార్యుల వద్ద వానిని పొందిరి.

'దదామిబుద్ధియోగం తం - యేన మామనుయాంతి తే'

అను ప్రతిజ్ఞకు దృష్టాంతమిటువంటి ఘట్టములే కదా! లేనిచో ఆంగ్ల విద్య ఆగిపోవుట ఏమి? స్వప్నమేమి? మంత్రోపదేశమేమి? దమ్మాల పాడులో మంత్ర కవచము మొదలైనవి దొఱకుట ఏమి?

నాటి నుండి శ్రీ రామారావుగారి అనుదిన కృత్యము ఇది. శ్మశాన సమీపము లోని శేషుబావి వద్ద స్నానము, చింతలతోపులోని అరుగుపై సంధ్య, హయగ్రీవ మంత్రానుష్ఠానము, తరువాత మఱల స్నానము, ఇంట హయగ్రీవ సాలగ్రామార్చనము, భోజనానంతరము విద్యార్థులకు పాఠ ప్రవచనము, గ్రంథ రచనలు మొదలైనవి.

**వివాహము :**

నెల్లూరు వాస్తవ్యులు శ్రీ సింగరాజు వెంకటరమణయ్య గారి పుత్రిక శ్రీ ఆదిలక్ష్మమ్మ గారితో వైభవముగా వివాహము జరిగినది.

**గురుదక్షిణ :**

తర్కవ్యాకరణములు చదువవలయునని వీరికి గాఢవాంఛ కలిగెను. అగ్రహారీకులయిన వీరిని చూచుటకు అనేక పండితులు వచ్చు నలవాటు గలదు. భగవంతుని కృపవలన వీరి వద్దకు పురిఘళ్ళ వంశీయులయిన సోదర పండితులు వచ్చిరి. అందు రామశాస్త్రులవారు వీరికి వ్యాకరణమును, సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తర్కశాస్త్రమును బోధించిరి. ఈ అధ్యయనము గూడా కావ్య విద్యాధ్యయనము వలె, గురువులు నిమిత్తమాత్రులుగా స్వయం సమన్వయముగా సాగినదే. వ్యాకరణ

పఠన ఫలితముగా శ్రీ రామారావు గారు 'కౌముది' కి వ్యాఖ్యగా 'శరద్రాత్రి' అను గ్రంథమును రచించిరి. ఆ పాండిత్యమును చూచి గురువులు సంతోషించిరి.

రామారావు గార్కి 'గురువు' అనిపించుకొన్నందుకు సంతోషించిన ఆ గురువులు గురుదక్షిణగా రామరాయ రచిత పుస్తకములలో తమను గురువులుగా స్మరింపుమని కోరిరి. అందుకే శ్రీ రామారావు గారు తాము రచించిన చంపూ భాగవత వ్యాఖ్యలో ఈ గురువులిద్దఱిని స్తుతించిరి. చూ॥

1. సుబ్రహ్మణ్య నిదేశతః సుమనసాం, దాతుం తదీయామృతం, రామః ప్రారభత

2. పురిఘళ్ళ రామసూరి కరుణా సమాసాదితానవద్య శబ్ద విద్యస్య॥

**అద్వైత పరిచయము :**

మన మహాకవి పండితుని జీవితమునే అనల్ప పరివర్తన చేసిన అల్ప సన్నివేశమును వివరించెదను.

శ్రీ రాళ్ళభండి నరసింహశాస్త్రి అను ఒక పండితుడు శ్రీ మల్లాది రామకృష్ణ చయనులు గారి వద్ద 'వేదాంత పంచదశి' మొదలైన అద్వైత గ్రంథములు చదువు చుండెను. ఆయన ఒకసారి తమ మామగారి ఊరయిన 'పమిడిపాడు' వచ్చిరి. వారు శ్రీ రామారావు గారిని కలిసినపుడు వారి వద్దనున్న 'వేదాంత పంచదశి' ని శ్రీ రామారావు గారు చూచుట తటస్థించెను. అంత వఱకున్ను వారు కేవలము విశిష్టాద్వైత గ్రంథములను మాత్రమే చూచిరి. అందువలన ఈ పుస్తకమును తీసికొని శ్రీ రామారావు గారు '2' రోజులలో చదివి శ్రీ రాళ్లభండి వారికి అర్థము కాని యొక శ్లోకమునకు వ్యాఖ్య చేసిరి. ఆ శ్లోకము ఇది.

'వికల్పో నిర్వికల్పస్య - సవికల్పస్య వా భవేత్
ఆద్యే వ్యాహతి రన్యత్రా - నవస్థాత్మాశ్రయా దయః'

కష్టతమమని పేరొందిన ఈ శ్లోకమునకు అవలీలగా వివరణను ప్రసాదించిన రామారావు గారి అసాధారణ మేధాసంపత్తికి బోధపటిమకు సంతోషపరవశు లయిన శ్రీ రాళ్లభండి వారు తరువాత కాలములో శ్రీ రామారావు గారి వద్ద సూత్రభాష్య గీతాభాష్యములను పునరధ్యయనము కావించిరి. ఈ అధ్యయన ప్రవచన సారాంశముగా శ్రీ రామారావు గారు 'శంకరాశంకర భాష్యవిమర్శః', 'గీతాభాష్యార్క ప్రకాశిక' మొదలైన గ్రంథములను వ్రాసిరి. ఈ సందర్భమున నొక అంశము ప్రస్తావింపవలయును. రామారావు గారు వైష్ణవమతస్థులు కనుక

విశిష్టాద్వైత గ్రంథములను రామానుజభాష్యములను చదివిరి. కాని ఆ భాష్య పంక్తులయందు వారికి కొంత సందిగ్ధత లేదా అస్పష్టత గోచరించినది. గురు ముఖతః కాక స్వయముగా చదివికొనుట వలన తనకు 'సందిగ్ధత' వచ్చినదని వారు అప్పటికి భావించిరి. కాని తరువాత శంకరభాష్య పఠనము జరిగినపుడు ఎట్టి సందిగ్ధతలు లేకపోయినవి. శంకర రామానుజ భాష్యముల మధ్య వ్యత్యాసము -రామానుజ భాష్యములోని లోపములు వారికి స్పష్టమయినవి. వెనుకటి తమ సందిగ్ధతలు రామానుజ పంక్తి లోపమే కాని తమ బుద్ధి లోపము కాదని గ్రహించిరి. అందువలన అద్వైతమత స్థాపన గ్రంథములను వారు రచించిరి. అందు ప్రధానముగా 'రామానుజమతము'నే ఖండించిరి.

గ్రంథరచనా తాత్పర్యము :

అచ్చువేయించక యిన్ని గ్రంథములు వ్రాసి ఏమి ప్రయోజనము అని కొందఱడుగగా శ్రీ రామారావు గారు చెప్పిన సమాధానము ఇది.

**కోహం కథ మయం జాతః - సంసారాఖ్య ఉపాగతః**
**న్యాయేనేతి పరామర్శః - విచార ఇతి కథ్యతే**

**తచ్చింతనం తత్కథనం - అన్యోన్యం తత్ప్రబోధనమ్**
**ఏతదేక పరత్వం చ - తదభ్యాసం విదుః బుధాః**

**ఆసుప్తేః ఆమృతేః కాలం - నయే ద్వేదాంత చింతయా -**

అని జ్ఞాన వాశిష్ఠములో చెప్పినట్లు బ్రహ్మవిచారధార నిరంతరాయముగా కొనసాగుటకే గ్రంథరచన చేసినట్లు చెప్పి, యీ గ్రంథములలో 'జీవము' ఉన్నచో ప్రాచీన కాళిదాసాది గ్రంథములవలె ప్రకటితమగునని చెప్పిరి. నిజముగా అట్లే వాటి ప్రచురణకు వారియంత శ్రమించి సాధించినవారు శ్రీ కవితా సుబ్రహ్మణ్యము గారు.

ఆచరణ :

చక్రాంకితములు అవైదికములు అని నమ్మి ఆ అభిప్రాయభేదముచే వైష్ణవమును వీడి భస్మము దాల్చి అద్వైతియై చివఱకు బ్రహ్మైక్యము పొందిన యీ మహానుభావునకు స్తోత్రముగా ఒక సీసమును నేను సమర్పించుచుంటిని.

## నివాళి

పంగ నామములద్ది వైష్ణవరాముడై-తులసీవనములోన నిలిచినాడు,
శాస్త్రసాహిత్య లలో ఛాత్రాళిరాముడై - 'గురు చక్రవర్తియై' మెలసినాడు,
అల, శ్మశానము వద్ద అలరు చింతల మధ్య - బ్రహ్మచింతనతోడ వెలిగినాడు,
శ్రీ హయగ్రీవుని చిత్తమ్ములో నిల్చి - నిర్మల స్ఫటికమై నిలిచినాడు,

అట్టి 'బెల్లపుగొండ' ను పట్టి నట్టి - పమిడిపాటికి 'సీమనై' ప్రణతి సేతు
అట్టి మహనీయుడైన బ్రహ్మణ్యమూర్తి - తనవు దాకిన 'శేషుబావ' ని దలంతు.

**ముగింపు :**

ఈ మహామహోపాధ్యాయుని గ్రంథమును జీవిత చరిత్రమును పరిశీలించు నీయవకాశము శ్రీ రావి మోహనరావు గారి వలన నాకు కలిగినది. అద్వైత విజయ గ్రంథప్రతిని దానితో నేను కోరిన గ్రంథములను ఇచ్చి మధ్య మధ్య నా సంశయములను సఖ్యముతో తీర్చిన వారు శ్రీ ముల్లపూడి విశ్వనాథ శాస్త్రి గారు. వీరిర్వురికి నా కృతజ్ఞతలు సమర్పించెదను. ఈ గ్రంథములో చర్చించిన 'వాది సిద్ధాంతము (అద్వైతము), ప్రతివాది సిద్ధాంతము (విశిష్టా ద్వైతము), మధ్య కల భేదాలను నా బుద్ధికి దోచిన కొలది ఒక పట్టికగా పాఠక జనసౌకర్యము నకై అమర్చుచుంటిని.

**పట్టిక:**

| విషయము | అద్వైతము (వాది) | విశిష్టాద్వైతము (ప్రతివాది) |
|---|---|---|
| ప్రకృతి / ప్రపంచము | మిథ్య<br>వివర్తము<br>భ్రాంతి | సత్యము<br>పరిణామము |
| జీవుడు | చైతన్యము | చైతన్యము |

| | | |
|---|---|---|
| | నిత్యుడు<br>సత్యము<br>ఏకము, అఖండము<br>బ్రహ్మము<br>ఈశ్వరుడు<br>సర్వజ్ఞుడు<br>తత్త్వమసి | నిత్యుడు<br>సత్యము<br>ఖండము, అనేకులు<br>పరిమితము<br>ఈశ్వర శరీరము<br>కించిద్జ్ఞుడు |
| అవతారము | ఈశ్వరులు<br>జీవులు | ఈశ్వరులు<br>(జీవులు కారు)<br>నరసింహుని వలె |
| ఘటము | జీవుడు<br>ఈశ్వరుడు<br>అంతఃకరణము లేదు | జీవుడుకాడు<br>ఈశ్వరుడు |
| ఈశ్వరుడు /<br>పరమాత్మ<br>బ్రహ్మము | నిర్గుణుడు<br>నిర్విశేషుడు<br>భేదరహితుడు<br>అశరీరుడు<br>అసంగుడు | సగుణుడు<br>సవిశేషుడు<br>భేదత్రయ సహితుడు<br>ప్రపంచశరీరుడు,<br>ససంగుడు |
| బ్రహ్మజీవ భేదము | ఉపాధివలన వచ్చినది<br>ఘటాకాశ<br>మహాకాశముల వలె | సర్వజ్ఞత్వము<br>అల్పజ్ఞత్వము<br>మొ॥ గుణ భేదము |
| బ్రహ్మ జీవసంబంధము | అభేదము తత్త్వమసి | శరీర శరీరి<br>సంబంధము<br>అంతర్యామి<br>'య ఆత్మని తిష్ఠన్<br>అంతరాయమయతి' |

| కర్మలు - ఉపాసన యోగం మొదలైనవి | జ్ఞానాంగములు | భక్తియోగాంగములు |
| --- | --- | --- |
| భక్తి | తత్త్వజ్ఞానము | కైంకర్యము |
| అర్చన | 'సోహం' భావముతో ధ్యానము | అర్చాది విగ్రహ పూజ |
| అభేదోపాసన | తనే ఈశ్వరుడు | 'ఈశ్వర శరీరమే తాను' అనే అభేదము |
| జ్ఞానము | జీవస్వరూపము<br>బ్రహ్మస్వరూపము<br>బ్రహ్మయే జ్ఞానము<br>జ్ఞానమే జీవుడు | జీవునిగుణం<br>ఈశ్వరుని గుణము<br>వీరు జ్ఞాతలు |
| మాయతొలగుట | జ్ఞానము కల్గినంతనే | వైకుంఠమున విరజానది దాటినంతనే |
| అజ్ఞానము | భావ పదార్థము | అభావ పదార్థము |
| తత్వము | అద్వితీయము | 'చిత్, అచిత్ ఈశ్వరుడు' అని పదార్థ త్రయము |
| ముక్తి | స్వస్వరూప జ్ఞానము<br>సాయుజ్యము<br>బ్రహ్మైక్యము | ఈశ్వరసామ్యము<br>వైకుంఠప్రాప్తి,<br>ఈశ్వర కైంకర్యము |
| ముక్తిలో జీవుని స్థితి | అభేదము | భేదము |
| ముక్తి భేదాలు | సాయుజ్యము అసలు ముక్తి, సామీప్య సాలోక్య సారూప్యములు సగుణ ముక్తులు | సగుణముక్తులు<br>సాయుజ్యం<br>అసలు లేదు |

| | | |
|---|---|---|
| ఆత్మోపాసకులకు | అఖండానందము | అల్పానందము |
| ముక్తి సాధనము | జ్ఞానమాత్రమే | కర్మలతో గూడిన భక్తి ప్రపత్తులు |
| తత్త్వమసి | బ్రహ్మయే జీవుడు | కల్యాణగుణ విశిష్ట ఈశ్వరుడు చిద్విశిష్ట బ్రహ్మ అభిన్నులు |
| ప్రమాణాలు | తత్త్వమసి. అభేదము | 'అజామేకాం -' 'ద్వాసుపర్ణా-' భేదము |
| బ్రహ్మవిత్ | బ్రహ్మవేత్త బ్రహ్మమే అగును | బ్రహ్మమే బ్రహ్మవేత్త అగును. బ్రహ్మతత్త్వము జీవులకు అజ్ఞేయము |
| వేదాంత వాక్యములు | నిర్గుణమును చెప్పునవి | సగుణమును చెప్పునవి |
| 'నిర్గుణ' వాక్యములు | స్వార్థపరములు | హేయగుణములు లేవని చెప్పునవి |
| సగుణ వాక్యము | అన్యార్థములు, సగుణ బ్రహ్మ పరములు | స్వార్థపరములు |

ఇట్లు
'మనాక్ బృహన్మననశాలి'
**మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి**
తిమ్మసముద్రము

శ్రీ హయగ్రీవాయనమః

# అద్వైత విజయః

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితః

(1875-1914)

ఆంధ్రానువాదము

మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల, తిమ్మసముద్రం.

వాదీ : అహం బ్రహ్మాస్మి - నేను సర్వవ్యాపి అయిన బ్రహ్మ (వస్తువు)ను.

ప్రతివాదీ : న త్వం బ్రహ్మాసి - నీవు బ్రహ్మవు (వస్తువు) కాదు.

వాదీ : బ్రహ్మైవాహమస్మి - నేను బ్రహ్మ (వస్తువు)నే.

ప్ర॥వా॥ : జీవ ఏవ త్వమసి - నీవు జీవుడవే.

వాదీ : నాహం జీవః - నేను జీవుడను కాను

ప్ర॥వా॥ : న త్వం బ్రహ్మ - నీవు బ్రహ్మము కావు.

వా॥ : కుతోఽహం జీవః? - అయితే నేను ఎందుకని జీవుడను?

ప్ర॥వా॥ : కర్మాధీన జన్మమరణాది ప్రయుక్త సుఖదుఃఖ సంభోగ లక్షణ సంసార వత్త్వాత్ - కర్మలను బట్టి ఏర్పడు జనన మరణాదుల వలన కలిగెడి సుఖ దుఃఖములను అనుభవింపజేయు సంసారములో నిమగ్నుడవు కనుక, నీవు జీవుడవే.

వా॥ : కః పునః బ్రహ్మ? - అయితే ఎవడు 'బ్రహ్మము'

ప్ర॥వా॥ : శ్రీకృష్ణః - శ్రీకృష్ణుడు.

వా॥ : కుతః? - ఎందువలన?

ప్ర॥వా॥ : పురుషోత్తమత్వాత్ - పురుషోత్తముడు కనుక

వా॥ : తదపి కథమ్? - అది మాత్రము ఎట్లా?

ప్ర॥వా॥ : సర్వజ్ఞత్వాత్ సర్వేశ్వరత్వాత్ సర్వ జగదుదయ విభవ లయ

**హేతుత్వాచ్చ** - శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు కనుక, సర్వేశ్వరుడు కనుక, సమస్త జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములకు ఆయనయే కారణము కనుక.

వా॥ : **కిమత్ర మానమ్?** - అందుకు ప్రమాణము ఏమిటి?

ప్ర॥వా॥ : **సాక్షాత్ శ్రీకృష్ణ భగవద్గీతే ఏవ- "వేదాహం సమతీతాని-వర్తమానాని చార్జున, భవిష్యాణి చ భూతాని-మాం తు వేద, న కశ్చన" "భ్రామయన్ సర్వభూతాని- యంత్రా రూఢాని మాయయా, అహం సర్వస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా" ఇత్యాద్యాః**- ఎవరో కాదు. సాక్షాత్తుగా 1) శ్రీకృష్ణుడు 2) భగవద్గీత - ఇవి ప్రమాణము. చూ॥ గీత : "అర్జునా! భూత, వర్తమాన, భవిష్యత్తు లయిన జీవచరిత్రలు నాకు తెలియును. కాని నేను ఎవరికిని తెలియను." సంసార యంత్రము మీద పెట్టి, నా మాయాశక్తితో ఈ జీవులను త్రిప్పుచున్నాను. ఈ సమస్త ప్రపంచమునకు నేనే ఉత్పత్తిని, నేనే లయమును" మొ॥ గీతా వాక్యములు ప్రమాణము.

వా॥ : **కృష్ణోఽపి వసుదేవాత్ దేవక్యాం జాతః- మృతః చేతి సంసారీ జీవ ఏవ** - కృష్ణుడుగూడా దేవకీవసుదేవులకు జన్మించి కొంతకాలమునకు మరణించెను గదా! జననమరణములు కలవు కనుక, ఆయనయు సంసారబద్ధుడైన జీవుడే.

ప్ర॥వా॥ : ***మైవం వాదీః! మాయామానుష-విగ్రహత్వాత్ కృష్ణస్య. లీలయా హి భగవాన్ భూభారహరణార్థం, సంకల్పవశాత్ వసుదేవాత్ భువి అవతీర్ణః*** - అట్లనరాదు. కృష్ణుడు, మాయామానుష విగ్రహుడు. భూభార హరణమునకై స్వయముగా సంకల్పించి వసుదేవపుత్రునిగా భూమి యందు అవతరించినవాడు. అంతేగాని సాధారణ జీవులవలె కర్మవశమున అస్వతంత్రముగా జన్మించినవాడు కాదు. కనుక సంసార బద్ధుడైన జీవుడు కాడు.

వా॥ : ***లీలయా సంసరతోఽపి కృష్ణస్య కథం బ్రహ్మత్వమ్*** - లీలగా ఈ సంసారమున జన్మించినను, సంసారమున బడినట్లే కదా! అట్టి సంసార వశుడైన కృష్ణుడు "బ్రహ్మ" మెట్లగును.

ప్రా॥వా॥ : ***లీలాసంసారస్య స్వాయత్తత్వేన అబంధకత్వాత్*** - 'లీల' అయిన సంసారము ఒక ఆటవలె భగవంతునకు ఆధీనమయినది. అందువలన ఆయనకు మనకువలె సంసారము ఒక బంధము కాజాలదు. కనుక ఆయన సంసారబద్ధుడు కాడు కనుక బ్రహ్మమే!

వా॥ : ***యో వసుదేవాదవాతరత్ సఃకః?*** - వసుదేవుని నుండి అవతరించిన ఆ దేవుడు అసలు ఎవడు, అనగా కృష్ణావతారమునకు ముందున్న అసలు తత్త్వము ఏది?

ప్రా॥వా॥ : ***"ఉక్తం హి కృష్ణ" ఇతి*** - చెప్పితిని గదా! కృష్ణుడని

వా॥ : ***జన్మనా లబ్ధసత్తాకస్య హి కరచరణాది మత్పిండస్య "కృష్ణ" ఇతి నామ విహితం గర్గేణ; జన్మనః ప్రాగవస్థితస్తు మయా పృచ్ఛ్యతే కః? ఇతి*** - సరే! సరే! కాలుసేతులు మొ॥ అవయవములతో పుట్టి గర్గ మహాముని ద్వారా 'కృష్ణుడు' అని పేరు పెట్టించుకొనిన "దేహము" గూర్చి కాదు నేను అడిగినది. ఈ 'జన్మ' కు ముందు ఆయన ఎవరు? అన్నదే నా ప్రశ్న.

ప్రా॥వా॥ : ***శ్రీ మహావిష్ణుః ఆదినారాయణః కృష్ణత్వేనాఽవతీర్ణః*** - శ్రీ మహావిష్ణువే, ఆ ఆదినారాయణుడే 'కృష్ణుడు' గా అవతరించెను.

వా॥ : ***స చ నారాయణః కః?*** - అయితే ఆ నారాయణుడు ఎవడు?

ప్రా॥వా॥ : ***పరమాత్మా*** - పరమాత్మయే.

వా॥ : ***కుతః?*** - ఆయన "పరమాత్మ" ఎలా అయినాడు?

ప్రా॥వా॥ : ***పురుషోత్తమత్వాత్*** - పురుషోత్తముడు కనుక.

వా॥ : ***తచ్చ కథమ్*** - 'పురుషోత్తముడు' ఎలా అయినాడు?

ప్రా॥వా॥ : ***గీతావచనాత్-"ఉత్తమః పురుషస్త్వన్యః-పరమాత్మేత్యుదాహృతః యో లోకత్రయ మావిశ్య-బిభర్త్యవ్యయ ఈశ్వరః" ఇతి*** - భగవద్గీతయే ప్రమాణము. "ఈ ముల్లోకములన్నింట వ్యాపించిన ఆ పురుషోత్తముడే పరమాత్మ" (శరీరమున వ్యాపించిన వాడు జీవాత్మ లేదా ప్రత్యగాత్మ. అట్లే ముల్లోకములందు వ్యాపించిన వాడు పరమాత్మ)

వా॥ : **కిం రూప స్సనారాయణః?** - ఆ నారాయణుని రూపమేమి?

ప్ర॥వా॥ : **శంఖచక్రగదాధరః, పుండరీకాక్షః శ్రీ మహాలక్ష్మీ సమేతః, పద్మనాభశ్చ వైకుంఠనామక పరమ పదనిలయః** - ఆయన శంఖచక్ర గదాధరుడు, పుండరీకాక్షుడు, మహాలక్ష్మీసమేతుడు, పద్మనాభుడు, వైకుంఠలోక నివాసి.

వా॥ : **కథమస్య లోకత్రయ ప్రవేశః?** - (అట్టి ప్రత్యేక స్థలము, రూపము గల) ఆ నారాయణుడు ముల్లోకములలో ఎట్లు వ్యాపించును?

ప్ర॥వా॥ : **సూక్ష్మరూపేణ** - సూక్ష్మరూపముతో.

వా॥ : **కథం స్థూలస్య తస్య సూక్ష్మత్వమ్, నారాయణస్య?** - శంఖచక్రాదులు ధరించి స్థూలరుపములోనున్న ఆ నారాయణునకు మఱల 'సూక్ష్మ రూపము' ఎట్లు?

ప్ర॥వా॥ : *గగనవత్* - ఆకాశము వలె. (అది ఎంత పెద్దదయినను అంత సూక్ష్మము నందును లఘువుగా వ్యాపించినది గదా. అది ఒక గుహ నిండుగా వ్యాపించగలదు, ఒక సూది బెజ్జమునందును వ్యాపింపగలదు గదా)

వా॥ : **సర్వ వ్యాపిత్వాత్ *గగనస్య* భవతు సౌక్ష్మ్యమ్; కథం పునః పరమపద నిలయస్య నారాయణస్య సౌక్ష్మ్యమ్** - ఆకాశము సర్వత్ర వ్యాపించినది. దానికొక నిర్దిష్టమయిన చోటు లేదు. కాని నారాయణుడు వైకుంఠవాసి కదా! ఆయన ఎట్లు సూక్ష్మరూపమున సర్వత్ర వ్యాపించును. వైకుంఠమునందే ఉండునని చెప్పితివి కదా!

ప్ర॥వా॥ : **అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ఇతి శ్రుత్యా నారాయణస్య సర్వవ్యాపిత్వోపపత్తేః**- "లోపల బయట నారాయణుడు వ్యాపించియున్నాడు" అను వేదప్రమాణమున్నది గదా! దానిని బట్టి నారాయణుడు "సర్వవ్యాపి" అనుమాట సరిపోవును.

వా॥ : **శ్రుత్యుక్తత్వ మాత్రేణ కథం మధ్యమ పరిమాణస్య నారాయణస్య సర్వవ్యాపిత్వ మవగంతుం శక్యం ప్రత్యక్షాది విరుద్ధమ్** - వేదము చెప్పినంత మాత్రమున అనుభవమును ఎట్లు కాదనగలము? మధ్య

రకము పరిమాణముగల ఆకారముతో నున్న నారాయణుడు "సర్వ వ్యాపి" ఎట్లా కాగలడు! అది "మహాపరిమాణముగదా! ప్రత్యక్షాది ప్రమాణములకు ఈ వాదము విరుద్ధము కదా!

ప్రవా॥ : **నారాయణస్య విరాడ్రూపేణ సర్వవ్యాపిత్వాత్-సర్వాత్మకం హి విరాడ్రూపమ్** - నారాయణునకు 'విరాట్' అను స్వరూపము కలదు. ఆ విరాట్ రూపము సర్వవ్యాపి కదా! ఆ రూపముతో ఆయన సర్వ వ్యాపిగా ఉండును.

వా॥ : ***హంత! విచిత్రమిదం యదేకస్యైవ మహత్, మధ్య అణు పరిమాణ త్రయవత్త్వమ్*** - భలే! చాలా వింతగానున్నదే. ఒకనికే మహారూపము మధ్యరూపము, అణురూపము అని 3 రూపములు గలవా? (వైకుంఠమున శంఖ,చక్ర శోభితమయిన రూపము 'మధ్యరకమయిన మనవంటి రూపము. విరాట్ రూపము సర్వత్ర వ్యాపించునది. ఆకాశము వలె అది పెద్దవానిలో పెద్దదిగా వ్యాపించును. చిన్నవానిలో చిన్నదిగా వ్యాపించును. చిన్నదిగా వ్యాపించిన సందర్భమున "అణు రూపము" అనవచ్చును).

ప్ర॥వా॥ : ***నైవ విచిత్రం విచిత్ర శక్తా ఈశ్వరే*** - ఇందులో ఆశ్చర్యము ఏమున్నది. భగవంతుడు విచిత్ర శక్తులు గలవాడు కదా!

వా॥ : ***యస్య స్థూల మధ్య సూక్ష్మ రూపాణి త్రీణి సంతి సః కః?*** - సరే! ఇంతకూ, ఈ స్థూల,మధ్య,సూక్ష్మ రూపములు "3" కలిగి ఉన్న ఆ 'దేవుడు' ఎవరు?

ప్ర॥వా॥ : ***ఉక్తం హి నారాయణ ఇతి*** - 'నారాయణుడు' అని చెప్పితిని గదా!

వా॥ : ***కిం తస్య స్వరూపమ్?*** - ఆయన స్వరూపము ఏమి?

ప్ర॥వ॥ : ***ఉక్తమేవ 'శంఖచక్ర' ఇత్యాదినా*** - చెప్పితిని గదా! 'శంఖచక్రధారి" మొ॥ ఇంతకు ముందే!

వా॥ : ***నైవోక్తమ్ తద్ధి విగ్రహస్వరూపమ్ మయా తు. యస్య తద్విగ్రహః తత్స్వరూపం పృచ్ఛ్యతే*** - ఇంతకు ముందు మీరు 'విగ్రహ స్వరూపమే చెప్పితిరి. అనగా నారాయణుని 'శరీరము' గూర్చి చెప్పితిరి గాని నారాయణుని 'ఆత్మ' లక్షణము చెప్పలేదు. కనుక శంఖచక్రాది

యుక్త శరీరధారి అయిన నారాయణుని 'తత్వము' ఏమిటో చెప్పవలెను.

ప్రా॥వా॥ : **సర్వజ్ఞత్వ సకల కళ్యాణ గుణ నిలయత్వాదికమ్** - ఆయన సర్వజ్ఞుడు, సకల కళ్యాణ గుణ సమన్వితుడు. ఇదే ఆయన స్వరూపము.

వా॥ : **తద్ధి ధర్మజాతమ్** - మీరు చెప్పినవి నారాయణుని ఆత్మ స్వరూపము కాదు. ఆయన యొక్క ధర్మములు లేదా గుణములు.

ప్రా॥వా॥ : **తర్హి జ్ఞానమేవ స్వరూపం. జ్ఞాన స్వరూపం, జ్ఞానగుణకం హి బ్రహ్మ "సత్యం జ్ఞానం" ఇత్యాది శ్రుతేః** - అట్లయినచో నారాయణుని స్వరూపము జ్ఞానమే. బ్రహ్మమునకు జ్ఞానమే స్వరూపము. జ్ఞానమే గుణము. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అని వేద ప్రమాణము.

వా॥ : **తర్హి జ్ఞాన స్వరూపః, జ్ఞానగుణకశ్చ జీవోఽపి బ్రహ్మైవ**- అట్లయినచో అట్టి జ్ఞానస్వరూపుడైన, జ్ఞానగుణముగల జీవుడు ఎవడయినను 'బ్రహ్మమే' అగును.

ప్రా॥వా॥ : **మైవం. అపరిచ్ఛిన్నస్యైవ బ్రహ్మత్వాత్. బ్రహ్మహి పూర్ణమ్**- అలాకాదు బ్రహ్మ అనగా బృహత్ అనగా విశాలమయినది. పూర్ణమయినది. అనగా అఖండమయినది. జీవుడు శరీరము వలన 'ఖండముగా' భాసించువాడు. కనుక జీవుడు జ్ఞాని అయినను అఖండస్వరూపుడు కాడు కనుక 'బ్రహ్మము' కానేరడు.

వా॥ : **కథం తర్హి పరిచ్ఛిన్నస్య వాసుదేవస్య కృష్ణస్య బ్రహ్మత్వమ్**- అట్లయినచో వసుదేవపుత్రుడైన కృష్ణుడు సైతము శరీరమునందు ఇమిడి పరిమితమయిన వాడు కదా. ఖండస్వరూపుడు కదా! మఱి ఆయన 'బ్రహ్మ' మని ఎట్లు అంటివి?

ప్రా॥వా॥ : **కృష్ణ విగ్రహస్య పరిచ్ఛిన్నత్వేపి తదంతర్గతస్య జ్ఞానస్వరూపస్య వ్యాపిత్వాత్** - కృష్ణుని శరీరము ఖండమే. అఖండము కాదు. కాని ఆ శరీర మందలి "జ్ఞానము" అను కృష్ణ స్వరూపము సర్వవ్యాపి కనుక అఖండము. అందువలన కృష్ణుడు 'బ్రహ్మమే'!

వా॥ : **కథం జ్ఞాయతే, జ్ఞానస్వరూపత్వే సమానేఽపి కృష్ణ శరీరాంతర్గతః**

**పరమాత్మా, అస్మదాది శరీరాంతర్గతస్తు ఆత్మా జీవ ఏవేతి?-** అలాగా! మన శరీరములలోని ఆత్మ అయినను, కృష్ణ శరీరములోని ఆత్మ అయినను జ్ఞాన స్వరూపమయినదే కదా! '2'న్ను జ్ఞానస్వరూపమే అయినప్పుడు కృష్ణ శరీరములోనిది "పరమాత్మ" అని, మన శరీరము లోనిది "జీవాత్మ" అని ఎట్లు తెలియుచున్నది.

ప్ర॥వా॥ : *గుణతః* - గుణము వలన

వా॥ : **కథమ్?** - ఎట్లు-వివరింపుము?

ప్ర॥వా॥ : **యస్సర్వం వేత్తి సః పరమాత్మా యస్తు అల్పం వేత్తి సః జీవః ఇతి-** సర్వజ్ఞుడు అయినవాడు పరమాత్మ అల్పజ్ఞుడు అయినవాడు జీవాత్మ

వా॥ : **అనేన హి ధర్మభూత జ్ఞానస్యైవ వ్యాపిత్వం అవగమ్యతే** - దీనిని బట్టి "గుణమయిన జ్ఞానమే వ్యాపి" అని తెలియుచున్నది.

ప్ర॥వా॥ : **సత్యం, తత ఏవ స్వరూపభూత జ్ఞానస్యాపి. న హి పరిచ్ఛిన్న జ్ఞానస్వరూపః పుమాన్ అపరిచ్ఛిన్న జ్ఞానవాన్ భవితు మర్హతి. తస్మాత్ యస్య స్వరూపభూతం జ్ఞానం అపరిచ్ఛిన్నం తస్యైవ ధర్మ భూతం జ్ఞానమపీతి కృత్వా సర్వజ్ఞః ఈశ్వరః కృష్ణ ఏవ బ్రహ్మ** - నిజమే, జ్ఞానమే అఖండము. గుణమయిన జ్ఞానము అఖండమయినట్లు స్వరూపమయిన జ్ఞానము గూడా అఖండమే కావలయును. ఏమనగా, ఖండ జ్ఞాన స్వరూపుడైన వాడు అఖండజ్ఞానము గలవాడు కాలేడు. అనగా అల్పజ్ఞాన స్వరూపు డైనవాడు పూర్ణజ్ఞానవంతుడు కాలేడు. కనుక అఖండ జ్ఞానస్వరూపుడే 'అఖండ జ్ఞాని' కాగలడు. కాగా సర్వజ్ఞుడు ఈశ్వరుడు అయిన కృష్ణుడే బ్రహ్మము.

వా॥ : **కృష్ణ శరీర పరిచ్ఛిన్నస్య పరమాత్మనోఽపి కథం వ్యాపిత్వమ్?-** అయ్యా! పరమాత్మ అయినను "కృష్ణుడు" అనే ప్రత్యేక శరీరము నందున్నంత వఱకు "వ్యాపిత్వము" అనగా 'అఖండత్వము' ఎట్లు కుదురును?

ప్ర॥వా॥ : **ఆకాశస్య ఘటేనేవ పరమాత్మనః కృష్ణ శరీరేణ పరిచ్ఛేదాయోగాత్** - సర్వవ్యాపి అయిన ఆకాశము 'కుండ'యందున్నంత మాత్రమున ఆకాశము అఖండము కాదు అని చెప్పలేము కదా!. అట్టే సర్వవ్యాపి

అయిన పరమాత్మ కృష్ణ శరీరములో వ్యాపించిన మాత్రమున 'ఖండము' అని చెప్పరాదు. కనుక కృష్ణ శరీరమందున్న "పరమాత్మ" అఖండమే, పూర్ణమే.

వా॥ : **కిం కృష్ణ శరీర ఇవ అస్మదాది శరీరేష్వప్యస్తి పరమాత్మా?**-అయితే కృష్ణ శరీరములోనున్నట్లుగా మన వంటివారి శరీరమునందున్ను 'పరమాత్మ' కలదా?

ప్ర॥వా॥ : **ఓమ్** - అవును.

వా॥ : **తర్హి బ్రహ్మైవాహమస్మి** - అట్లయితే, నేనూ బ్రహ్మమునే.

ప్ర॥వా॥ : **నైవ త్వం బ్రహ్మ** - నీవు బ్రహ్మవు కానే కావు.

వా॥ : **కస్మాత్?** - ఎందుకని?

ప్ర॥వా॥ : **తవ శరీరే జీవేశౌ ద్వౌ స్తః-'ద్వా సుపర్ణా-' ఇత్యాది శ్రుతేః-తత్ర యో జీవః స ఏవ త్వం, మనుష్యోఽహమిత్యాద్యభిమానవాన్ సంసారీ. యస్తు అధీశ్వరః సః త్వద్భిన్న ఏవ. స ఏవ బ్రహ్మేతి** - ఎందుకంటే నీ శరీరములో ఇద్దరు కలరు. 1) జీవుడు 2) ఈశ్వరుడు. అందుకు ప్రమాణము 'ద్వా సుపర్ణా' అను శ్రుతి. దాని అర్థమేమనగా "మిత్రులు అయిన ఇద్దరు గరుత్మంతులు ఒకే చెట్టునందున్నారు. అందు ఒకడు రుచి రుచిగా "పిప్పలమును" ఆస్వాదించును. మఱొకడు ఏమి అనుభవించకుండగనే ప్రకాశించు చున్నాడు". ఇందులో చెట్టు మన శరీరము. రుచిగా ఆస్వాదించు గరుడుడు జీవుడు. అనుభవించని గరుడుడు "పరమాత్మ". కనుక నీ శరీరములో నీవు జీవుడవు. ఈశ్వరుడు బ్రహ్మము. "నేను మనుష్యుడను. నేను తినుచున్నాను, నేను బాధపడుచున్నాను" మొ॥ అనుభవములు నీకు కలవు కనుక, నీవు జీవుడవు. అనుభవములు లేక వెలుగువాడు కనుక ఈశ్వరుడు బ్రహ్మము.

వా॥ : **కిం మమేవ కృష్ణస్యాపి దేహే నాస్తి జీవః?** - అయితే నాదేహంలో ఉన్నట్టు కృష్ణదేహంలో మాత్రము జీవుడు లేడా?

ప్ర॥వా॥ : **నాస్తి** - లేడు.

వా॥ : **కస్మాత్?** - ఎందువలన ?

ప్ర॥వా॥ : **అనుభవాభావాత్** - జీవుని వలె కృష్ణునకు అనుభవములు లేవు కనుక.

వా॥ : **తర్హి కథం ప్రాణధారణం కృష్ణ శరీరస్య, జీవలింగం. హి తత్?**- మఱి కృష్ణ శరీరములో ప్రాణములు ఎట్లు నిలబడియున్నవి? ఈప్రాణ ధారణ 'జీవ' లక్షణము కదా. (దానిని బట్టి కృష్ణ దేహమునందున్న జీవుడున్నట్లుగ ఊహింపవలయును కదా!)

ప్ర॥వా॥ : **ఈశ్వర సంకల్పవశాదేవ** - ఈశ్వరుని సంకల్పము వలన ప్రాణములు నిలిచినవి.

వా॥ : **అస్మదాది దేహే - జీవేశౌ క్వ స్తః?** - మన దేహమునందు జీవేశ్వరులు ఎచ్చట ఉన్నారు?.

ప్ర॥వా॥ : **హృది జీవోఽస్తి. జీవేతు ఈశ్వరోఽస్తి** - హృదయములో జీవుడున్నాడు-జీవునిలో ఈశ్వరుడున్నాడు.

వా॥ : **కిం పరిమాణో జీవః?** - జీవుని పరిమాణం (సైజు) ఎంత?

ప్ర॥వా॥ : **అణుః** - అణువంత.

వా॥ : **కిం సావయవాణుః ? ఉత నిరవయవ పరమాణుః?**- అయితే ఈ అణువులో ఏవయినా అవయవ విభాగములు గలవా లేక అఖండ మయున, ఏ అఱలు పొఱలు లేనిదా యీ అణువు?.

ప్ర॥వా॥ : **నిరవయవ ఏవ** - ఏ అవయవములు లేని అఖండమే.

వా॥ : **కథం తత్ర ఈశ్వరసత్త్వమ్?** - మఱి దానియందు ఈశ్వరుడు ఎట్లుండును -ఎచ్చట ఉండును?

ప్ర॥ : **యథా నిరవయవే గగనే** - అఖండమయిన ఆకాశమునందు ఉన్నట్లే అఖండమయిన అణువునందు ఉండగలడు.

వా॥ : **సావకాశత్వాదస్తు గగనే ఈశ్వరః కథం జీవే?** - ఆకాశము విశాల మయినది కనుక ఈశ్వరుడుండును. కాని అణువంత జీవుని యందు ఈశ్వరుడు ఎట్లుండును.

ప్ర॥వా॥ : **జీవోఽపి సావకాశ ఏవ** - అయ్యా! జీవునిలోను చోటుగలదు.

వా॥ : **విభుత్వాదస్తు గగనస్య సావకాశత్వం కథమణోః జీవస్య?** - ఆకాశం

సర్వవ్యాపి అయిన విశాల పదార్థము కనుక ఈశ్వరునకు చోటు ఉండును. మఱి జీవుడు అల్పపరిమాణము గల 'అణువు' కదా! ఎట్లు చోటు ఉండును?

ప్ర॥వా॥ : *గగనే ఘటాది పదార్థ స్థిత్యర్థ మస్తి సావకాశత్వమ్, విభుత్వాత్. జీవేతు పరమాత్మ స్థిత్యర్థ మస్తి సావకాశత్వమ్, అణుత్వాత్-* ఆకాశంలో ఘటము మొ॥ పదార్థములకు చోటు కలదు. అది 'వ్యాపి' కనుక. జీవుని యందు పరమాత్మ ఉండగల చోటుగలదు- అణువు కనుక.

వా॥ : *నిరవయవం వస్తు సావకాశమితి విప్రతిషిద్ధం, అవయ విశ్లేషాదేవ-వస్తుని అవకాశ సంభవాత్* - "అవయవ విభాగములేని వస్తువులో చోటు కలదు" అను మాట కుదరదు. అవయవములు విడిపోయిననే గాని 'ఎడము' రాదు. 'ఎడము' వచ్చిననే చోటు ఏర్పడును. జీవాణువులో అవయవ విభాగమే లేదంటివి. అయినను పరమాత్మ పట్టగల 'చోటు' ఉండునంటివి. ఈ రెండు మాటలు అన్యోన్య విరుద్ధముగా లేవా?

ప్ర॥వా॥ : *"న హి దృష్టేఽనుపపత్తిరితి" న్యాయాత్ నిరవయవస్య ఆకాశస్య సావకాశత్వ దర్శనాత్ నిరవయవ జీవస్య సావకాశత్వ ముపపద్యతే* -"అసంభవములు ప్రత్యక్షముగా సంభవమయినచో తప్పులేదు" అను న్యాయము కలదు. ఆకాశము అవయవ విభాగములు లేని అఖండ వస్తువు కదా! అయినను దాని యందు ఘటాదులున్నవి కదా! అట్లే నిరవయవమయిన అనగా అఖండమయిన జీవాణువు నందు ఈశ్వరుడుండవచ్చును. కనుక తప్పులేదు. లోక ప్రమాణ విరుద్ధము కాదు.

వా॥ : *గగన నిరవయవత్వస్య అసంప్రతిపన్నత్వాత్, గగనస్య జన్యద్రవ్యత్వేన సావయవత్వాత్* - ఆకాశము నిరవయవము అనగా "అఖండము" అనుట అంగీకారయోగ్యము కాదు. ఆకాశము గూడా జన్యద్రవ్యము, అనగా పుట్టిన ద్రవ్యము కనుక సావయవమే. అనగా అఖండము కాదు. కనుక ఆకాశమునందు ఈశ్వరుడుండుటకు అభ్యంతరము లేదు. కాని అఖండమయిన జీవాణువునందు ఈశ్వరుడు ఎట్లు

ఉండగలడు?

ప్రా॥వా॥ : **అతీంద్రియాస్తు యే భావాః-న తాంస్తర్కేణ యోజయేత్-ఇతి న్యాయాత్ అతీంద్రియార్థే-వేదస్యైవ ప్రమాణత్వాత్-"యః ఆత్మని తిష్ఠన్' ఇతి శ్రుతేశ్చ నిరవయవోఽపి జీవః పరమాత్మనా వ్యాప్త ఏవ** -'ఇంద్రియాతీతమయిన విషయాల విషయంలో తర్కం పనికిరాదు" అను న్యాయము గలదు. అట్టి విషయాలలో 'వేదము' ప్రమాణము, "య ఆత్మని తిష్ఠన్" అను శ్రుతి పరమాత్మ జీవుని యందున్నట్లు చెప్పుచున్నది. కనుక అఖండమయినను, అవయవ విభాగము లేకపోయినను, 'జీవునియందు పరమాత్మగలడు' అను విషయము వేద ప్రమాణము వలన అంగీకరింపదగును.

వా॥ : **తర్హి సావయవః ఇతీష్యతామ్** - అట్లయినచో వేదప్రమాణమును బట్టి జీవునియందు పరమాత్మకు చోటు ఉన్నది కనుక జీవాణువు సావయవము అనగా 'అఖండము' కానిది అనగా అవయన విభాగము కలది అని అంగీకరింపవచ్చును కదా!

ప్రా॥వ॥ : **సావయవత్వే సతి అనిత్యత్వ ప్రసంగాత్** - అవయవ విభాగము ఉన్నదని అంగీకరించినచో ఆ వస్తువు అనిత్యమని చెప్పవలెను. అట్టియెడ 'జీవాత్మ' అనిత్యమని చెప్పవలసివచ్చును.

వా॥ : **జన్మ మరణ సంసారవాన్ హి జీవః** - అవును, జీవుడు అనిత్యమని చెప్పిన నష్టమేమి? ఎటూ అతనికి జనన మరణములు గలవు? కదా? "జననం, మరణం" అనునవి అనిత్యతకు హేతువులు కదా!

ప్రా॥వా॥ : **జీవాధిష్ఠిత శరీర గతే ఏవ-జన్మ మరణే, న తు జీవగతే** - జనన మరణములు జీవునివి కాదు. కేవలము శరీరమునకు చెందినవి. కనుక జీవుడు అనిత్యుడు కాడు. నిత్యుడు. కనుక అవయవ విభాగము అంగీకరించినచో అనిత్యుడు' అని చెప్పవలసి వచ్చును.

వా॥ : **తర్హి జన్మ మరణాది షడ్భావ వికార దూర ఏవ జీవః** - అయినచో నీ ఉద్దేశ్యములో జీవుడు నిత్యుడు. జననమరణములు మొ॥ భావ వికారములు "ఆఱు" అతనికి చెందవని నీ అభిప్రాయము" అగునా?

ప్రా॥వా॥ : **ఓమ్** - అవును.

వా॥ : **కథం అవిక్రియస్య సంసారిత్వ వికారః**-జనన మరణాది వికారములు నిజముగా లేని య్యీ జీవునకు తాను 'సంసారిని' అనే వికారము ఏల కలిగినది?

ప్రా॥వా॥ : **అవివేకాత్, ప్రకృతి సంసర్గవశాత్** - అజ్ఞానము వలన, తాను వేఱు, ఈ శరీరము వేఱు అను జ్ఞానము లేకపోవుట వలన, జీవులకు ఈ వికారము ఏర్పడినది.

వా॥ : **కా ప్రకృతిః?** - ఎవరా ప్రకృతి?

ప్రా॥వా॥ : **యా దేహేంద్రియాద్యాకార పరిణతా, దృశ్యతే సా** - ఈ శరీరములు, ఇంద్రియములుగా కనబడే ఆకారములుగా పరిణమించినది ఏదో అదే "ప్రకృతి"

వా॥ : **కథమసంగస్య ప్రకృతి సంసర్గః?** - ఏ సంగము లేని జీవునకు ప్రకృతితో సంగము (Attachment) ఎట్లు ఏర్పడినది?

ప్రా॥వా॥ : **ప్రకృతౌ స్థితి వశాత్** - ప్రకృతి యందే నివసించుట వలన ఏర్పడినది.

వా॥ : **కథం ప్రకృతిస్థస్య ఈశ్వరస్య ప్రకృత్యసంసర్గః**-అట్లయిన ఈశ్వరుడు గూడా ప్రకృతి యందే ఉండును కదా! మఱి ఆయనకు ప్రకృతితో ఏల సంబంధము లేదు? ఏల సంసార వికారము, ఆయనను వశపఱచుకొనలేదు?

ప్రా॥వా॥ : **ప్రకృతి వివిక్త-ఆత్మస్వరూప జ్ఞానసత్త్వాత్** - 'ప్రకృతి వేఱు-తాను వేఱు' అను ఆత్మజ్ఞానము ఉన్నందువలన ఈశ్వరునకు సంసార వికారములు లేవు.

వా॥ : **కథం చిదచిద్విశిష్టేశ్వరస్య ప్రకృతి వివిక్తత్వమ్?**- ప్రతి శరీరము నందు '3' గలవు. 'చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు" ఈ విధంగా చిత్తు (జీవుడు) అచిత్తు (జడము శరీర భాగములు)-ఈ రెండిటితో కలిసియున్న ఈశ్వరుడు ప్రకృతిలోనే గదా ఉన్నట్లు. అట్టి స్థితిలో "తాను ప్రకృతి కన్న వేఱు" అని ఎట్లు భావింపగలడు?

ప్రా॥వా॥ : **దండ విశిష్టస్య దేవదత్తస్య దండ వివిక్తత్వవత్** - కఱ్ఱ చేత బట్టిన

దేవదత్తుడు కట్టె కన్న భిన్నమే కదా. అట్లే చిత్తు అచిత్తులతో కలిసినను ఈశ్వరుడు భిన్నుడే కదా! కనుక "ప్రకృతి కన్న తాను భిన్నుడనని" ఆయన భావించుట సంభవమే.

వా॥ : ***కథం అసంగేశ్వరస్య చిదచిద్విశిష్టత్వమ్?***-ఈశ్వరుడు అసంగుడు కదా! తాను వేఱు ప్రకృతి వేఱు కదా. అట్టి ఈశ్వరునకు చిత్తు, అచిత్తులతో సంబంధమేల కుదురును?

ప్రా॥వా॥ : ***చిదచిచ్ఛరీరకత్వాత్*** -చిత్తు అచిత్తు ఆయన శరీరములే కనుక వానితో ఆయనకు సంబంధము ఏర్పడినది.

వా॥ : *కథం చిదచిచ్ఛరీరకస్య చిదచిదసంగః?*- 'చిత్తు, అచిత్తు' ఆయన శరీరములు అయినపుడు, వానితో ఆయనకు సంబంధము ఉన్నపుడు ఇక 'సంగము' లేకుండుట ఎట్లు?

ప్రా॥వా॥ : ***ఘటగతాకాశస్య ఘటరూపాదివేవ, వ ఈశ్వరస్య చిదచిదసంగః*** -కుండలో ఆకాశం ప్రతిఫలించింది. ఆ ఆకాశమునకు, కుండకు సంబంధము ఏర్పడినది. కాని వాని '2' మధ్య 'సంగము' లేదు. కుండరూపము ఆకాశమునకు చెందదు. దేనిదారి దానిదే. అట్లే 'చిత్తు, అచిత్తు' అనే శరీరమునందున్నను ఈశ్వరునకు ఆ శరీరముతో సంబంధమే గాని 'సంగము' లేదు.

వా॥ : ***"జీవః అసంగః, ఈశ్వరశ్చ అసంగః"-ఇతి ప్రకృతిరప్యసంగైవ. పసంగ పదార్థాంతరాభావాత్ తథా చ కథం జీవస్య ప్రకృతి పంపర్గః?***- జీవుడు అసంగుడే. ఈశ్వరుడు అసంగుడే, ఆలెక్కన చూస్తే ప్రకృతిగూడా సంగము లేనిదే. ఎవ్వరిమధ్య సంగము లేనపుడు ప్రకృతికి మాత్రము సంగము ఎచ్చట లభించును. కనుక జీవునకు అయినను ప్రకృతితో సంగము ఎట్లు సంభవించును.(సంభవింపనిచో జీవునకున్ను సంసారము లేదు. ఈశ్వరుని వలె జీవుడున్ను బ్రహ్మమే కావచ్చును.)

ప్రా॥వా॥ : ***అవివేకాదిత్యుక్తమేవ***-అయ్యా! 'తానువేఱు ప్రకృతివేఱు' అనుభవము లేకపోవుట వలన అని ఇంతకు ముందే చెప్పాము కదా!

వా॥ : ***కథం అవివేకాదపి అసంగస్య పంగిత్వమ్?*** -అవివేకము ఉంటే

మాత్రం, సంగము లేని వానికి సంగము ఎట్లు కలుగును?

ప్రవా॥ : **కోఽత్ర విస్మయః? అవివేకాత్-రజ్జోరపి సర్పత్వాపాతాత్-** ఇందులో ఆశ్చర్యమేమున్నది. అవివేకము వలననే కదా! త్రాడు పాముగా అనిపించుట. త్రాడు వాస్తవముగా పాము కాకపోయినను పాముగా కనిపించినట్లు సంగము లేకపోయినను సంగము ఏర్పడవచ్చును.

వా॥ : **తర్హి యథా రజ్జుః కాలత్రయేపి రజ్జు రేవ, తథా జీవః కాలత్రయేపి-అసంగ ఏవ, తస్య సంగిత్వం తు భ్రాంతి సిద్ధమేవ** -అట్లయితే, త్రాడు ఎల్లపుడు త్రాడే. అట్లే జీవుడు ఎల్లపుడు అసంగుడే. కనుక అతనికి సంగము అనునది 'భ్రాంతివలననే' అని తెలినది గదా!

ప్రవా॥ : **ఓమ్-** అవును.

వా॥ : **కథమియం భ్రాంతిః ఆసీదస్య స్వస్మిన్నపి?**-ఇతనికి తనయందే తనకు భ్రాంతి ఎట్లు ఏర్పడినది? (ఇతర వస్తువునందు భ్రాంతి ఏర్పడుటకు అవకాశము కలదు. 'తనే ఎవరో' అనే భ్రాంతి ఎట్లు)

ప్రవా॥ : **భగవన్మాయావశాత్**-భగవంతుని 'మాయ' వలన

వా॥ : **కా మాయా?**- మాయ అనగా ఏమిటి?

ప్రవా॥ : **భగవత్సంకల్పః**-ఈశ్వర సంకల్పమే మాయ.

వా॥ : **కుతో భగవతః తాదృశః సంకల్పః?**- భగవంతునకు అట్టి సంకల్పము ఎందుకు కలిగెను?

ప్రవా॥ : **లీలావశాత్, "చిక్రీడిషయా" హి భగవతా సృష్టమిదం జగత్-** భగవంతుడు క్రీడావినోదియై జగమును సృష్టించెను. ఇదియంతయు ఆయన లీల. కనుక ఆ లీల వలన ఆయనకు అట్టి సంకల్పము కలిగెను.

వా॥ : **కథం భ్రాంతి నివృత్తిః?**-మఱి యీ భ్రాంతి ఎట్లు తొలగును?

ప్రవా॥ : **భగవత్సంకల్పాదేవ**-మఱల ఈశ్వర సంకల్పము వలననే తొలగును.

వా॥ : **కథం భగవతః అస్మన్మోచన సంకల్పోదయః?**- మనలను ఈ యాట నుంచి విడిపించవలెనను సంకల్పము భగవంతునిలో ఎట్లు కలుగును?

ప్రా॥వా॥ : ***అస్మదారాధనోద్భూత దయావశాత్-*** మనము చేయు పూజా పురస్కారముల వలన దయగలవాడై అట్టి 'సంకల్పము' చేయును.

వా॥ : ***కథం తదారాధన మస్మాకమ్?***-ఆయనను ఆరాధించు భాగ్యము మనకెట్లు లభించును?

ప్రా॥వా॥ : ***ఈశ్వర సంకల్పాదేవ-*** అందుకయినను ఈశ్వర సంకల్పమే ఉండ వలయును.

వా॥ : ***కుతః తత్సంకల్పోదయః?***-ఇందుకు సంకల్పము ఎట్లు కలుగును?

ప్రా॥వా॥ : ***అస్మదదృష్టవశాత్***-మన భాగ్యము వలన కలుగును.

వా॥ : ***కథం "మన" ఆది రహితేశ్వరస్య, సంకల్పసిద్ధిః?***-మనస్సు ఉన్నచో సంకల్పము కలుగును. మనస్సులేని ఈశ్వరునికి ఇట్టి సంకల్పములు ఎట్లు కలుగును? 'కలుగును' అనుట హేతుబద్ధమా?

ప్రా॥వా॥ : ***జ్ఞానగుణకత్వాత్*** - జ్ఞానము ఆయన గుణము కనుక ఇట్టి సంకల్పములు కలుగవచ్చును.

వా॥ : ***కథమేవం సంకల్పాది ధర్మ సంగే సతి ఈశ్వరస్య అసంగత్వమ్?***-అయ్యా! ఇట్టి సంకల్పములు మొ॥ ధర్మములతో ఈశ్వరునకు సంగము కలదు గదా. ఆయన "సంగము లేనివాడు" ఎట్లు అగును?

ప్రా॥వా॥ : ***స్వస్య స్వధర్మేణ సహ సంగస్య అసంగత్వాభంజకత్వాత్***-స్వధర్మము నిర్వహించుట సంగము కాదు. అట్టి ధర్మ నిర్వహణ సంకల్పము వలన భగవంతుని అసంగత్వము దెబ్బతినదు. (అనగా కర్తవ్యములు మన రాగద్వేష పరిధిలోనివి కావు. రాగద్వేషములతో చేసినచో అచ్చట "సంగము" ఏర్పడును. భగవంతునకు రక్షణ మోక్షణాది సంకల్పములు కర్తవ్యములు కనుక వాని నిర్వహణలో రాగ ద్వేషములు లేవు. కనుక సంగము లేదు)

వా॥ : ***ధర్మః కిం ధర్మిణః అన్యః? ఉత అనన్యః?-ఆద్యే, ధర్మ సంగః ప్రాప్త ఏవ ధర్మిణః, ద్వితీయే, ధర్మధర్మి భావస్యైవ అసిద్ధిః***-ధర్మము ధర్మి కన్న భిన్నమా? లేక అభిన్నమా? అనగా ఒక ధర్మము కలవాడు వాని ధర్మము వేఱుగానుండునా? లేక ఒకటిగానే యుండునా? "ధర్మి ధర్మములు" వేఱు అనుకొన్న పక్షమున ఆ రెంటి మధ్య

"సంగము"నకు అవకాశము కలదు. ఏమనగా, 'సంగము' అనునది ఇతరులతోనే కదా. 'తనతో తనకు సంగము' అనునది కుదరని మాట. కనుక "ధర్మము వేఱు-ధర్మివేఱు" అన్నపుడు వానిమధ్య 'సంగము' అను దానికి అవకాశము కలదు. "ధర్మి ధర్మముల మధ్య" భేదము లేదు, అను రెండవ పక్షమున "ధర్మ-ధర్మి" అను వ్యవహారమేలేదు. ఏమనగ "ధర్మముగలవాడు -ధర్మము" అని విడిగా లేవు కనుక అంతా ఒకటే కనుక 'ధర్మ-ధర్మి' అను మాట కుదరదు.

ప్ర॥వా॥ : ధర్మః శక్తిః ధర్మిణః అన్యత్వా నన్యత్వాభ్యాం నిర్వక్తుం నైవ శక్యతే-యద్వా ధర్మిణః పృథగుపలంభాత్-ధర్మః అన్య ఏవ. సతు నేవ ససంగత్వం ధర్మిణః. తదపృథక్సిద్ధ విశేషణత్వాత్- ధర్మమనగా శక్తి. (అగ్నికి 'తగుల బెట్టుట' అనునది ధర్మము లేదా శక్తి) ఇది ధర్మికన్న వేఱుగా ఉండునా? ఒకటిగా నుండునా? అని నిర్వచింప సాధ్యము కాదు. లేదా, 'ధర్మి' (అగ్ని) కన్న వేరుగా లభించుట వలన ధర్మము ధర్మికన్న వేఱుగానున్నట్లే కాని దానికి ధర్మితో సంగము లేదు. ధర్మి కన్న భిన్నముగా ధర్మము ఉండదు కనుక. (సారాంశము (8పేజి) ('2' భిన్న వస్తువుల మధ్య 'సంగము' ఉండును. ఇచ్చట ధర్మము ధర్మికి భిన్నముగనున్న గుణము కాదు. అగ్నికి 'తగులబెట్టుశక్తి అను గుణము కలదు. కాని అది అగ్నికన్నా భిన్నముగా లేదు. కనుక వాని మధ్య 'సంగము' అనుపదము వాడరాదు. 'ధర్మి' అయిన అగ్ని మనకు లభ్యమే. దాని ధర్మమయిన శక్తి అగ్నివలె మూర్తముగా మనకు లభ్యము కాదు.)

వా॥ : సంకల్పాదీనామాత్మ ధర్మత్వే, తేషాం జన్మ నాశవత్త్వేన ఆత్మనః సవికారత్వం స్యాత్?-సంకల్పము మొ॥ ఆత్మధర్మములు అయినచో ఆత్మకు గూడా వికారములు (అనగా జనన మరణములు మొ॥ మార్పులు) ఉన్నట్లు చెప్పవలెను. ఎందుకంటే సంకల్పము మొ॥ పుట్టుచుండును. తరువాత గిట్టుచుండును కదా!

ప్ర॥వా॥ : నైవ స్యాత్, స్వరూప వికారాభావాత్-ఆత్మకు వికారములు అంటవు. ఏమంటే దాని స్వరూపములో మార్పు లేదు కనుక.

వా॥ : కిం ఈశ్వర సంకల్పాత్ ముక్తో జీవః పరమాణుః? ఉత వ్యాపీ?-ఈశ్వరసంకల్పము వలన మోక్షము పొందిన జీవుడు పరమాణువుగా నుండునా? (విరాట్టువలె) వ్యాప్తిగా అఖండముగా నుండునా?

ప్ర॥వా॥ : అణురేవ!-పరమాణువుగానే యుండును!

వా॥ : కథం ముక్తస్య సర్వజ్ఞత్వమ్?-మఱి ముక్తజీవుడు సర్వజ్ఞుడు ఎట్లగును?

ప్ర॥వా॥ : భగవదనుగ్రహాత్ ధర్మభూత జ్ఞానస్య హి సంకోచవికాసౌ స్తః-భగవంతుని అనుగ్రహము వలన సర్వజ్ఞత్వము వచ్చును. ధర్మమయిన జ్ఞానమునకు సంకోచవికాసములు అనగా పెరుగుదల తఱుగుదల, ఉండును.

వా॥ : క్వాసౌ వర్తతే ముక్తః?-ఈ ముక్త జీవుడు ఎచ్చట ఉండును?

ప్ర॥వా॥ : పరమపదే వైకుంఠే-వైకుంఠ దివ్యధామమున

వా॥ : కిం దేహీ ముక్తః ఉతాదేహః?-ముక్త జీవునకు దేహము ఉండునా? ఉండదా?

ప్ర॥వా॥ : యదృచ్ఛయా భవతి బహువిధః-స్వేచ్ఛగా రకరకాలుగానుండును.

వా॥ : కస్తస్య ఈశ్వరాత్ భేదః?-ఈశ్వరునికి అతనికి మధ్య భేదము ఏమి కలదు?

ప్ర॥వా॥ : సృష్ట్యాద్యహేతుః ముక్తః పరిచ్ఛిన్నశ్చ-ముక్తజీవుడు ఈశ్వరుని వలె ప్రపంచ సృష్టి మొ॥ చేయలేడు. అఖండవ్యాపికాడు. ఖండస్వరూపుడు గానే యుండును.

వా॥ : కథం ఈశ్వరః అపరిచ్ఛిన్నః? స్వభిన్న చిదచితోః వత్త్వేన వస్తు పరిచ్ఛేద సత్త్వాత్-అయ్యా! ఈశ్వరుడు అఖండుడు అన్నారు గదా! అది ఎట్లు కుదురును? ప్రపంచమున ఆయనతో బాటు ఆయనకన్న భిన్నముగా ప్రతి శరీరమున 'చిత్తు,అచిత్తు' అనునవి కలవు కదా! వాటియందు ఈశ్వరుడు లేడు కదా! వాటితో పాటుగా, కదా! ఈశ్వరుడు ఉన్నది.

ప్ర॥వా॥ : చిదచితోః అపి ఈశ్వర శరీరత్వాదినా ఈశ్వరా పృథక్సిద్ధ విశేషణ

త్వేవ ఈశ్వర పరిచ్ఛేదకత్వాభావాత్-చిత్తు అచిత్తులు కూడా ఈశ్వర శరీరములు కనుక ఈశ్వర భిన్నముగా ఉండనివి కనుక వాటి వలన ఈశ్వరుని 'అఖండత' అను గుణమునకు భంగము లేదు. (ఉదా॥ కొబ్బరికాయ పీచు, టెంక, కొబ్బరి, నీరు అనునవి ఏకజాతీయములే. అట్లే చిత్తు, అచిత్తు గూడా ఈశ్వర ధర్మములే కనుక అందున్ను ఈశ్వరతత్త్వము కలదు. కమక ఈశ్వర వ్యాప్తికి అఖండత్వమునకు భంగము లేదు.)

వా॥ : యది చిదచిద్భ్యాం పృథక్ ఈశ్వరః సిద్ధ్యతి, తర్హి ఈశ్వరాత్ పృథగపి చిదచితౌ సిద్ధ్యత ఏవ - చిత్తు అచిత్తులకన్న వేఱుగా ఈశ్వరుడు ఉన్నచో ఈశ్వరుని కన్న వేఱుగా చిత్తు అచిత్తులు ఉన్నట్లు అంగీకరింపవచ్చును.

ప్ర॥వా॥ : కార్యాత్ పృథక్ కారణ సిద్ధావపి కారణాత్ పృథక్ కార్యం నైవ సిద్ధ్యతి-కార్యము కన్న భిన్నముగా కారణం ఉన్నను కారణం కన్న భిన్నముగా కార్యము ఉండదు.

వా॥ : "అజో నిత్యః" ఇతి "అజామేకా" ఇతి చ శ్రుతేః చిదచితో అజత్వేన కథం తయోః ఈశ్వరస్య చ కార్యకారణ భావః?-'అజో నిత్యః' అను వేదభాగము 'అజామేకాం-' అను వేదభాగము వలన "చిత్తు, అచిత్తు" గూడా 'అజములుగా' అనగా పుట్టుక లేనివిగా తెలియు చున్నది. మఱి వాటికి ఈశ్వరుడు ఎట్లు కారణము కాగలడు. (పుట్టుక లేని వానిని పుట్టించుట అసంభవము. పుట్టించనపుడు కారణములుండవు. కారణమే లేనపుడు ఈశ్వరుడు కారణమనుట ఎట్లు. కారణము కానిచో 'చిదచిత్తులు-ఈశ్వరుడు' వీరిమధ్య కార్యకారణ భావము ఎట్లు ఉండును.)

ప్ర॥వా॥ : మూల ప్రకృతేః అజత్వేపి, దేహాద్యాకార పరిణత కార్య ప్రకృతేః జన్యత్వేన తత్సంసృష్టచితోపి జన్యత్వాత్ - మూలప్రకృతికి పుట్టుక లేదు. అది అజము. కాని దేహం మొ॥ దృశ్యమయిన ఆకారములుగా పరిణమించిన కార్యప్రకృతికి పుట్టుక గలదు కదా! అనగా ఈ దృశ్య ప్రపంచము పుట్టినదే కదా? దానియందు అనగా దృశ్యప్రపంచ రూపమయిన కార్య ప్రకృతి (అచిత్)యందు కలసిన 'చిత్తు' గూడా

కార్యప్రకృతితో పాటే పుట్టినది కదా! కనుక, చిత్తు అచిత్తులు కార్యములే. ఈశ్వరుడు వారికి కారణమే.

వా॥ : **తర్హి స్థూల చిదచితోః ప్రకృతి కార్యత్వమేవ న ఈశ్వర కార్యత్వమ్**- అప్పుడు ఈ స్థూల చిదచిత్తులు ప్రకృతికి పుట్టినవి కనుక ప్రకృతి కార్యములు అగును.గాని ఈశ్వర కార్యములు ఎట్లగును? కావు గదా! కనుక ఈశ్వరునికి వాటికి కార్య కారణ భావము కుదరదు కదా!

ప్ర॥వా॥ : **ఘటం ప్రతి మృద ఇవ స్థూలచిదచితౌ ప్రతి ప్రకృతేః ఉపాదానత్వేపి కులాలవదీశ్వరస్య నిమిత్త కారణత్వాత్**-కారణములు '2' విధములు. 1) ఉపాదాన కారణము 2) నిమిత్త కారణము. కుండకు మట్టి ఉపాదాన కారణము. కులాలుడు (కుమ్మరి) నిమిత్త కారణము. అట్లే స్థూలమయిన చిత్తు అచిత్తులకు ప్రకృతి ఉపాదాన కారణము. ఈశ్వరుడు నిమిత్త కారణము. కనుక చిత్తు, అచిత్తులకు ఈశ్వరునితో కార్య కారణభావము కలదు.

వా॥ : **నిమిత్త కారణాత్ కార్యం పృథక్సిద్ధమేవ, కులాలాత్ ఘటవత్**- అయినచో, నిమిత్త కారణముకన్న కార్యము వేఱు అని ప్రసిద్ధమే కదా. "కుండవేఱు, కుమ్మరి వేఱు" కదా! ఆ విధముగా చిదచిత్తులు వేఱు ఈశ్వరుడు వేఱు, అని తేలుచున్నది కదా! (అదే సత్యమన్నచో ఈశ్వరుడు "సర్వవ్యాపి" కాడని చెప్పవలసి వచ్చును.)

ప్ర॥వా॥ : ***ఈశ్వరస్య స్వతః నిమిత్త కారణత్వేపి ప్రకృత్యధిష్ఠానద్వారా ఉపాదానత్వమపి, ఈశ్వరాధిష్ఠిత ప్రకృతి పరిణామత్వాత్ జగతః***- ఈశ్వరుడు ప్రపంచమునకు ప్రత్యక్షంగా ఉపాదాన కారణం కాదు. నిమిత్త కారణమే. అయితే ప్రపంచము అనగా ప్రకృతి యొక్క పరిణామమే కదా. ఆ ప్రకృతిని అధిష్ఠించియున్నవాడు ఈశ్వరుడే. కనుక ప్రకృతి యందు అధిష్ఠించియున్న కారణమున ఈశ్వరుడు పరోక్షముగా జగత్తునకు ఉపాదాన కారణముగూడా అగుచున్నాడు. కనుక ఈశ్వరుడు చిదచిత్తులయందున్ను వ్యాపించియున్నాడు.

వా॥ : **స్థూలచిదచితోః ఈశ్వరాపృథక్సిద్ధత్వేపి కేవల చితః సూక్ష్మాచితశ్చ**-

**తత్పృథక్సిద్ధి రేవ. తదకార్యత్వాత్**-స్థూలమయిన "చిత్తు- అచిత్తులు" ఈశ్వరుని కన్న భిన్నము కాకపోవచ్చును. కేవల చిత్తు, సూక్ష్మ మయిన 'అచిత్తు' మాత్రము ఈశ్వరుని కన్న భిన్నమయినవే. ఏమంటే అవి ఈశ్వర నిర్మితములు కావు కనుక.

ప్ర॥వా॥ : **సూక్ష్మచిదచితోః ఈశ్వర శరీరత్వాత్-ఈశ్వరాఽ పృథక్సిద్ధత్వమ్** - "సూక్ష్మ చిత్తు, సూక్ష్మ అచిత్తు"-ఇవి ఈశ్వర శరీరములు కనుక, అవి ఈశ్వర భిన్నములు కావు. కనుక ఈశ్వరుని సర్వవ్యాపిత్వము నకు భంగము లేదు.

వా॥ : **శరీర శరీరిణౌ పరస్పరం పృథక్సిద్ధావేవ**-సూక్ష్మ చిత్తు,సూక్ష్మ అచిత్తు ఈశ్వర శరీరములు అనుకొన్నచో ఈశ్వరుడు ఆ శరీరములందుగల 'శరీరి" అగును. అనగా శరీరమునకు శరీరికి భేదము కలదు. కనుక సూక్ష్మచిత్తు అచిత్తులకు భేదము కలదు. తద్వారా ఈశ్వర వ్యాప్తికి భంగము వచ్చినది.

ప్ర॥వా॥ : **మైవమ్, దేహాత్ పృథగ్ దేహినః లోకాంతరగంతుః సిద్ధత్వేపి-దేహినః పృథక్ దేహస్యాఽసిద్ధేః**-(శరీరమునకు శరీరమునకు భేదము అంతగా కుదరదు) అట్లు కాదు. మరణించన దేహధారి దేహమును విడిచి లోకాంతరమేగును. అందువలన దేహం కన్న భిన్నంగా "దేహి" ఉన్నట్లే. కాని 'దేహి' లేని దేహము అట్లు ప్రత్యేక ఆస్తిత్వము కలది కాదు. కనుక దేహికి భిన్నముగా దేహము లేదు. కనుక "శరీర శరీరులకు" భేదము లేదు.

వా॥ : **శ్మశానగంతా దేహోపి దేహినః పృథక్సిద్ధ ఏవ**-దేహమును విడిచి పరలోకమేగు ఆత్మ దేహము కన్న భిన్నమైనపుడు 'ఆత్మ' ను విడిచి శ్మశానమునకు పోవు 'దేహము' గూడ దేహికన్న భిన్నమని చెప్పవలెను.

ప్ర॥వా॥ : **అచేతన దేహస్య దేహినః పృథక్సిద్ధత్వేపి చేతన దేహో సిద్ధ ఏవ**-అచేతన దేహము దేహికన్న భిన్నముగా ఉన్నట్టు నిరూపణ అయినను చేతన దేహము దేహికన్న భిన్నముగా లేనట్లే కదా!

వా॥ : **తర్హి ఈశ్వరాదచేతన దేహః పృథక్సిద్ధ ఏవ**-అయినచో, అచేతన

దేహము ఈశ్వరుని కన్న భిన్నమని నిరూపణ అయినది కదా!

ప్రా॥వా॥ : పరిచ్ఛిన్నాత్ జీవాదేవ అచేతనస్య పృథక్సిద్ధిః. నతు వ్యాపకాదీశ్వరాత్- అట్లు కాదు. పరిమితుడైన జీవుని కన్న అచేతన శరీరము భిన్నమని మాత్రమే నిరూపణ అయినది. అంతేకాని వ్యాపకుడయిన ఈశ్వరుని కన్న ఈ శరీరము భిన్నమయినది కాదు. అనగా ఈశ్వరుడు దేహమును విడుచును అనునది లేదు కనుక (సర్వవ్యాపి కనుక). ఈశ్వరుని కన్న శరీరము భిన్నమయినది కాదు.

వా॥ : తర్హి వ్యాపకః ఈశ్వరశ్చ దేహాత్ పృథగ సిద్ధ ఏవ - అయితే, వ్యాపకుడైన యీశ్వరుడు దేహముకన్న భిన్నము కాదని తేలినట్లు కదా!

ప్రా॥వా॥ : దేవదత్త దేహోపాధికస్య ఈశ్వరస్య యజ్ఞదత్త దేహాత్ పృథక్ సిద్ధత్వాత్-దేవదత్త దేహమునందున్న ఈశ్వరుడు యజ్ఞదత్త దేహము కన్న భిన్నుడు అని చెప్పవలెను.

వా॥ : కథ మేకస్యాః సూక్ష్మ ప్రకృతేః పృథక్సిద్ధిః ఈశ్వరస్య?- అఖండమయిన సూక్ష్మప్రకృతి నుండి ఈశ్వరుడు ఎట్లు వేఱుగానుండును?

ప్రా॥వా॥ : చిదుపాధ్యపేక్షయా-"చిత్తు అనగా జీవుడు అను శరీరములోనున్నాడు కనుక.

వా॥ : యద్యేవముపహితేశ్వరస్య పృథక్సిద్ధిః తర్హి నిరుపాధికస్య తస్య అపృథక్సిద్ధి రేవ- ఉపాధి (ఆధారం)లో నున్న ఈశ్వరునికి భిన్నస్థితి ఉన్నచో, ఏ ఉపాధియులేని ఈశ్వరునికి అసలు భిన్నస్థితి ఉండరాదు కదా!

ప్రా॥వా॥ : నిరుపాదికేశ్వరస్యైవ అభావాత్. చిదచిద్విశిష్టో హి ఈశ్వరః- 'ఉపాధి లేని యీశ్వరుడు' లేడు. ఈశ్వరుడు 'చిత్తు అచిత్తులతో' కూడియే యుండును. (కనుక నీ ప్రశ్న అనవసరము).

వా॥ : కీదృశం తత్ వైశిష్ట్యమ్? -ఆ "కూడియుండుట" విశిష్టత ఎట్టిది?

ప్రా॥వా॥ : చిదచిచ్ఛరీరకత్వ మిత్యుక్తమేవ-'చిత్తు-అచిత్తు' లే శరీరంగా కలిసి ఉండుటయే-విశిష్టత.

వా॥ : కిం చిదచిదనుగతత్వం తత్?-అంటే! చిత్తు అచిత్తుల వెంబడి యుండుటయా? (వ్యాపించియుండుటయా?)

ప్ర॥వా॥ : ఓమ్-అవును.

వా॥ : యద్యనుగతాత్ పృథగనుగంతవ్యం న సిద్ధం తర్హి కథం "అనుగంతృ అనుగంతవ్య" భావ సిద్ధిః? -అట్లయినచో, 'అనుసరించువారు - అనుసరింపబడువారు వీరి మధ్య భేదము లేనిచో "అనుసరించుట-అనుసరింపబడుట" అను సంబంధము కుదరదు గదా? (దానిని బట్టి చిదచిత్తులు-ఈశ్వరుని మధ్య భేదమున్నట్లు అంగీకరింప వలయును)

ప్ర॥వా॥ : అనుగతాత్ పృథక్ అనుగంతవ్యాసిద్ధావపి అనుగంతవ్యాత్ పృథక్ అనుగతస్య సిద్ధత్వాత్-అనుసరించిన ఈశ్వరుని కన్న భిన్నముగా అనుసరింపవలసిన చిదచిత్తులు భిన్నము కాక పోయినను, వానికన్న భిన్నముగా అనుగతుడైన ఈశ్వరుడు సిద్ధించును.

వా॥ : కిమిదమనుగంతవ్యం చిదచిద్ద్వయం నిత్యం సత్యం చ?- అనుసరింపబడవలసిన ఈ "చిదచిత్తులు" నిత్య సత్యములా? కాదా?

ప్ర॥వా॥ : తథైవ-నిత్య సత్యములే.

వా॥ : 'కథం ఏకమేవాద్వితీయం బ్రహ్మ ఇతి శ్రుతస్య బ్రహ్మణః అద్వైతత్వస్యోపపత్తిః?-అట్లయినచో "బ్రహ్మమొక్కటే దానికి రెండవది లేదు" అను వేదవాక్యము ఎట్లు కుదురును? నిత్య సత్యములుగా బ్రహ్మకు తోడు చిదచిత్తులు ఉన్నవి కదా!

ప్ర॥వా॥ : స్వసమాన ద్వితీయ వస్తు రహితత్వాత్ ఉక్తం 'బ్రహ్మ అద్వితీయ'. మితి శ్రుత్యా-తనతో సమానముగా అట్టి లక్షణములుగల రెండవ వస్తువు ఏదియు లేక పోవుట వలన 'బ్రహ్మ అద్వితీయము' అని చెప్పబడినది.

వా॥ : ఏవం జీవోప్యద్వితీయ ఏవ-ఈ లెక్కన జీవుడు గూడా అద్వితీయుడే. అట్టివాడు మరొకడు లేడు కనుక.

ప్ర॥వా॥ : న, స్వసమానంత జీవ సత్వాత్, నానా హి జీవాః-అట్లు కుదరదు.

జీవులు అనేక మంది కదా! వారందరు సమానులు కనుక అద్వితీయులు కారు.

వా॥ : "నేహ నానాస్తి కించన" ఇతి శ్రుత్యా బ్రహ్మణి ద్వైతం ప్రతిషిధ్యతే- "ఇచ్చట అనేక వస్తువులు లేవు. ఉన్నది ఒక్కటే" అను వేదవాక్యము బ్రహ్మము ఒక్కటే అని, రెండవది లేదు అనియు ద్వైతమును (2 అను భావమును) నిషేధించుచున్నది కదా!

ప్ర॥వా॥ : అబ్రహ్మాత్మక ద్వైతప్రతిషేధపరా శ్రుతి:-బ్రహ్మము కానిది రెండవది ఏదియు లేదని శ్రుతి తాత్పర్యము అంతేకాని బ్రహ్మములు '2' లేవని కాదు.

వా॥ : 'అహం బ్రహ్మాస్మి' ఇతి శ్రుత్యా జీవ బ్రహ్మభేద: ప్రతిపాద్యతే- 'నేను బ్రహ్మమును' అను వేదవాక్యము 'జీవుడు బ్రహ్మము' ఒక్కటి అని అద్వైతమును చెప్పుచున్నదికదా!

ప్ర॥వా॥ : బ్రహ్మాత్మకో జీవ ఇతి శ్రుత్యర్థ:-'జీవుడు బ్రహ్మ స్వరూపుడు'-అని చెప్పటయే వేదార్థము.

వా॥ : కథం జీవస్య బ్రహ్మాత్మకత్వమ్?-జీవుడు బ్రహ్మ స్వరూపుడెట్లగును?

ప్ర॥వా॥ : బ్రహ్మ శరీరత్వాత్-బ్రహ్మకు జీవుడు శరీరము కనుక.

వా॥ : తర్హి అచిద్ద్రవ్యమపి బ్రహ్మాత్మక మేవ-అప్పుడు 'అచిత్తు' గూడా బ్రహ్మ స్వరూపమే కదా!

ప్ర॥వా॥ : సత్యం అత ఏవ 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇతి శ్రుతి:-నిజమే! అందుకే 'ఇది అంతయు బ్రహ్మమే కదా' అని వేదము చెప్పుచున్నది.

వా॥ : బహిర్భూతం బ్రహ్మాపి జీవస్య శరీరమేవ-బాహ్యమయిన యీ 'అచిత్తు' రూపమయిన బ్రహ్మ గూడా జీవుని శరీరమే గదా!

ప్ర॥వా॥ : ఓమ్-అవును

వా॥ : కథం అనుగతస్య జీవస్య బ్రహ్మణః పృథగసిద్ధి:?-అనుగతుడైన జీవుడు బ్రహ్మకన్న వేరుగా ఏల సిద్దింపడు?

ప్ర॥వా॥ : న కేవలం అంతస్థమేవ వస్తు అనుగతమ్ కింతు బహిరంతర్వ్యాపక మేవ. వ్యాపకత్వం హి అనుగతత్వమ్- 'అనుగతం' అంటే కేవలము

లోపల వ్యాపించినది అని అర్థము కాదు. లోపలను, బయటను వ్యాపించినదే అనుగతము. అనుగతము అనగా లోపల బయట వ్యాపించినది అని అర్థము.

వా॥ : *కిమస్మాత్ భిన్నాత్మజ్ఞానాత్ ఫలమ్?*-ఇలా భిన్నమయిన ఆత్మ జ్ఞానము వలన ఏమి ఫలము?

ప్ర॥వా॥ : *'నిరంజనః పరమం సామ్యముపైతి' ఇతి శ్రుతం ఈశ్వర సామ్యమేవ*-'అట్టివాడు భగవంతునితో పరమ సమానత్వమును పొందగలడు' అనే వేద వాక్యము వలన ఈ ఆత్మజ్ఞానమునకు ఫలము ఈశ్వర సామ్యము పొందుటయే.

వా॥ : *'య, ఉ దరమంతరం కురుతే అథ తస్య భయం భవతి' ఇతి భయం శ్రూయతే* -'కొంచెము భేదమును భావించినను అట్టి వానికి భయము కలుగును' అనే వేదవాక్యము వలన 'భిన్న' ఆత్మజ్ఞానము భయ హేతువు కదా!

ప్ర॥వా॥ : *అబ్రహ్మాత్మక జీవదర్శనస్య భయహేతుత్వముక్తం శ్రుత్యా*-ఆ వేదవాక్యమునకు అర్థము అది కాదు. జీవుడు బ్రహ్మస్వరూపుడు అయిననూ కానట్లు దర్శించుట భయహేతువు అని అర్థము. జీవ బ్రహ్మలు లేరని కాదు.

వా॥ : *పరిచ్ఛిన్న జీవస్య కథం అపరిచ్ఛిన్న బ్రహ్మసామ్యమ్?*-ఖండస్వరూపుడయిన జీవునకు అఖండమయిన బ్రహ్మముతో ఎట్లు పోలిక కుదురును?

ప్ర॥వా॥ : *సర్వజ్ఞత్వాది గుణతః*-సర్వజ్ఞత్వము మొదలైన గుణముల వలన

వా॥ : *యది బ్రహ్మభిన్నద్రష్టృ జీవసిద్ధిః తర్హి 'నాన్యోఽతోస్తి ద్రష్టా' ఇతి శ్రుతి విరోధః*-బ్రహ్మకు భిన్నముగా సర్వజ్ఞుడైన మరొక జీవుడు ద్రష్టగా/ సాక్షిగా ఉన్నట్లు తేల్చినచో 'ఆత్మ కన్న మరొక ద్రష్ట లేడు' అను వేదవాక్యము విరోధించును గదా?

ప్ర॥వా॥ : *న, బ్రహ్మద్రష్టృ పురుషాభావ పరత్వాత్ తస్యాః, జీవా హి స్వాన్ పరస్పరం పశ్యంతి దేహాదీంశ్చ, న తు బ్రహ్మ పశ్యంతి, బ్రహ్మ తు సర్వమపి, అత ఏవ బ్రహ్మణః సర్వజ్ఞతమ్*-ఆ వాక్యమునకు

తాత్పర్యము అది కాదు. బ్రహ్మను చూచు పురుషులు ఎవరును లేరు. బ్రహ్మమును బ్రహ్మమే చూడగలడు. జీవులు తమను, సాటి జీవులను మాత్రమే దర్శింపగలరు. బ్రహ్మము సర్వమును దర్శింప గలడు. కనుక బ్రహ్మము సర్వజ్ఞత కలది.

వా॥ : **జీవోపి బ్రహ్మ పశ్యత్యేవ 'దృశ్యతే తు అగ్ర్యయా బుద్ధ్యా' ఇతి శ్రుతేః** - 'ఏకాగ్రమయిన బుద్ధిచేత భగవంతుడు దర్శింపబడును' అను వేదవాక్యము ప్రకారము జీవునకు బ్రహ్మ దర్శనము కలదని తెలియు చున్నది కదా. కనుక జీవుడు గూడా తనను బ్రహ్మను 'బ్రహ్మవలె' దర్శించును.

ప్ర॥వా॥ : **పరోక్షమేవ బ్రహ్మ పశ్యతి న తు ప్రత్యక్షమ్**- జీవునకు బ్రహ్మ దర్శనము (ప్రత్యక్షము) జరుగదు. కనుక బ్రహ్మద్రష్ట కాడు.

వా॥ : **బ్రహ్మాపి జీవం పరోక్షమేవ పశ్యతి**- బ్రహ్మ గూడా జీవుని పరోక్షము గానే చూచును.

ప్ర॥వా॥ : **న, అన్యస్త్వనశ్నన్న అభిచాకశీతి, సాక్షీచ' ఇత్యాది శ్రుతేః**- లేదు బ్రహ్మము జీవుని ప్రత్యక్షముగానే చూచును. 'పరమాత్మ వెలుగు చున్నాడు. సాక్షిగానున్నాడు' అను వేద వాక్యములు ఇందుకు ప్రమాణము.

వా॥ : **ముక్తజీవః ప్రత్యక్షమేవ పశ్యతి బ్రహ్మ, సర్వజ్ఞత్వాత్**- మామూలు జీవుడు చూడలేక పోయినను, ముక్త జీవుడు బ్రహ్మను ప్రత్యక్షముగా చూడగలడు గదా! అతడు సర్వజ్ఞుడు గదా! కనుక ముక్తజీవుడు ద్రష్టయే.

ప్ర॥వా॥ : **ఓమ్**-అవును.

వా॥ : **కథం శ్రుత్యవిరోధః?**-అట్లయినచో 'బ్రహ్మము కన్న ద్రష్టలేడు' అను వేద వాక్యము ఎట్లు కుదురును?

ప్ర॥వా॥ : **సంసార మండలే 'నాన్యో తోస్తి ద్రష్టా' ఇతి శ్రుత్యాశయాత్. యద్వా ముక్తోపి పరమపదనిలయం నారాయణమేవ పశ్యతి, న తు సర్వాంతరం బ్రహ్మ. అదృశ్యత్వాత్తస్య**- సంసార మండలమున ఉన్న జీవులను దృష్టిలోనుంచుకొని వేదము 'పరమాత్మకన్న ద్రష్టలేడు'

అను చెప్పినది. ముక్తజీవులను గూర్చికాదు. లేదా, ముక్తజీవుల యినను వైకుంఠవాసి అయిన నారాయణుని మాత్రమే చూచును. సర్వవ్యాప్తమయిన బ్రహ్మమును చూడలేరు. అట్టి బ్రహ్మము అదృశ్యము కనుక. కనుక ముక్తజీవులయినను పూర్తిగా ద్రష్టలు కారు. పరమాత్మయే ద్రష్ట.

వా॥ : ***హంత! తర్హి ఈశ్వర ఏక ఏవ ద్రష్టా, ప్రకృతి పురుషౌ తు దృశ్యావేవ***- అహో! అయితే, ఈశ్వరుడు ఒకడే ద్రష్ట. ప్రకృతి పురుషులు ద్రష్టలు కారు దృశ్యులు మాత్రమే. అంతేకదా!

ప్ర॥వా॥ : **పురుషో ద్రష్టాపి**-పురుషుడు దృశ్యుడే కాదు ద్రష్ట గూడా అగును.

వా॥ : **కథం ఏకస్యద్రష్టృ దృశ్య భావద్వయమ్?**-ఒకడే అటు ద్రష్ట ఇటు దృశ్యుడు గూడా ఎలా అగును?

ప్ర॥వా॥ : ***ఉపపద్యత ఏవ. ద్రష్టృ దృశ్యత్వయోరవిరోధాత్, దేవదత్తో హి విష్ణుదత్తం పశ్యతి తేన దృశ్యతే చేతి***-కావచ్చును. విరోధము లేదు. దేవదత్తుడు విష్ణుదత్తుని చూచును. విష్ణుదత్తునిచే చూడబడును. కనుక ఒక వ్యక్తియే ద్రష్ట, దృశ్యుడు కావచ్చును.

వా॥ : ***దేహేంద్రియాది సంఘాత ఏవ దృశ్యతే***- జీవుడు దృశ్యుడు కాడు. నీవు 'దృశ్యుడు' అని భావించునది దేహేంద్రియముల సమూహమే తప్ప అందలి జీవుడు కాడు. కనుక జీవుడు ద్రష్టయే కాని దృశ్యుడు ఎట్లగును?

ప్ర॥వా॥ : ***తర్హి సంఘాత ఏవ పశ్యతి*** - అట్లయినచో జీవుడు ద్రష్ట గూడా కాలేడు. కేవలము శరీరేంద్రియ సమూహమే మరొక శరీరేంద్రియ సమూహమును చూచుచున్నది.

వా॥ : ***అహం ప్రత్యయ విషయో జీవః పశ్యతి 'అహమిమం పశ్యామి' ఇతి అనుభవాత్***- 'నేను వీనిని చూచుచున్నాను' అను, అనుభవము ప్రకారము 'నేను' అను పదము వలన జీవుడు చెప్పబడును. కనుక జీవుడే ద్రష్ట.

ప్ర॥వా॥ : ***తర్హి జీవ ఏవదృశ్యతే॥ మామయం పశ్యతి' ఇతి అనుభవాత్***- అట్లయినచో జీవుడే చూడబడుచున్నాడు. 'నన్ను వీడు చూచు

చున్నాడు' అను వాక్యములోని 'నన్ను' అను పదము జీవుని సూచించును గదా!

వా॥ : సంఘాతే ఆత్మాభిమానాత్ జీవస్య దృశ్యత్వం విష్ణుదత్తో హి జీవః దేవదత్తం దృష్ట్వా। గౌరోయం స్థూలోయం॥ ఇతి ప్రత్యేతి - 'శరీరేంద్రియ సమూహమే తాను, అను శరీరాభిమానము వలన' జీవుడు కనబడుచున్నట్లు' అనిపించుచున్నది. కాని వాస్తవముగా చూచునది 'శరీరమునే'. విష్ణుదత్తుడు దేవదత్తుని చూచి 'ఈ దేవదత్తుడు పచ్చని వాడు, లావుగానున్నాడు' అని భావించుట శరీరమును బట్టియే గదా! కనుక జీవుడు శరీరమునే చూచును గాని జీవుని చూడ లేడు. కనుక జీవుడు దృశ్యుడు గాడు.

ప్ర॥వా॥ : తథా సంఘాత ఏవ పశ్యతి చక్షుష ఏవ ద్రష్టృత్వాత్- అట్లయినచో చూచువాడు మాత్రము జీవుడని యేల చెప్పవలె. శరీరేంద్రియ సమూహమే చూచుచున్నదని చెప్పవచ్చును. ఎటూ, చూచునది కన్నే కదా.

వా॥ : మైవం, చక్షుషః కరణత్వాత్ ఆత్మనః కర్తృత్వాత్ చ, 'చక్షుషా పశ్యామి, ఇతి హి అనుభవః-అట్లు వీలు లేదు. కన్ను సాధనము. జీవుడు కర్త. జీవుడు కంటితో, చూచును. 'కంటితో చూచుచున్నాను' అనిగదా అనుభవము.

ప్ర॥వా॥ : తర్హి అంతఃకరణ మస్తు ద్రష్టృ-అయినచో అంతఃకరణమే ద్రష్ట = చూచునది.

వా॥ : అంతఃకరణస్య కరణత్వేన కర్తృత్వా సంభవాత్. "మనసాహ మిదం మనోమి" ఇతి అనుభవాచ్ఛ-అంతఃకరణము ఒక సాధనమే కాని కర్తకాదు కదా. "మనస్సుతో నేను మననం చేస్తున్నాను" అని కదా అనుభవం. ఇందులో 'నేను' కర్త. మనస్సు-మననానికి సాధనము కదా.

ప్ర॥వా॥ : యస్సంఘాతం పశ్యతి సః ఆత్మానం పశ్యతి. అన్యం జీవం చ పశ్యతి-సరే శరీరేంద్రియ సమూహమును ఎవడు చూచునో వాడే ఆత్మను, ఇతర జీవుని చూచును.

వా॥ : **అదృశ్యత్వా దన్యస్య వ హి ఆత్మానమివ అన్యం జీవం కోపి సాక్షాత్ పశ్యతి, అన్యథా జీవాంతరానుభూయమాన సుఖదుఃఖాది సాక్షాత్కా రాపత్తేః జీవస్య**-కాని ఆ చూచువాడెవడైనా ఇతర జీవుని చూడలేడు. తన ఆత్మను మాత్రమే కనుగొనగలడు. లేనిచో ఇతర జీవులు అనుభవించు సుఖదుఃఖములు కూడా, చూచే జీవునకు సాక్షాత్క రించును.

ప్ర॥వా॥ : **జీవస్య జీవాంతరాదృశ్యత్వేపి బ్రహ్మాదృశ్యత్వ మస్త్యేవ స్వదృశ్య త్వవత్. జీవో హి ఆత్మానం వేత్తి** -జీవునకు తన గురించి తెలియును కదా!. అట్లే జీవుని గూర్చి బ్రహ్మమునకు తెలియును. బ్రహ్మ ద్రష్ట జీవుడు బ్రహ్మకు దృశ్యుడు. మఱొక జీవునకు జీవుడు కనబడక పోవచ్చును అంతే.

వా॥ : **కర్మ కర్తృ విరోధాత్ న స్వదృశ్యత్వం స్వస్య**-కర్తయే కర్మ ఎట్లగును? కర్మ కర్త ఎట్లగును? కనుక తనను తాను చూడటం కుదరదు.

ప్ర॥వా॥ : **'మామహం జానామి' ఇతి అనుభవః కథమ్?**-కుదురుతుంది. తనే కర్త, కర్మ కావచ్చును. లేకపోతే నన్ను నేను ఎఱుగుదును అను వాక్యము కుదరదు గదా!. అందులో ఒకడే కర్త, కర్మ గదా.

వా॥ : **స్వప్రకాశత్వా జ్జీవస్య, చక్షురాది వ్యాపారం వినా జీవో హి స్వయమేవ భాసతే**-జీవుడు స్వయంప్రకాశకుడు. అతనికి తనను గూర్చి తెలిసికొనుటకు కన్నులు మొ॥ అవసరము లేదు. ఆత్మజ్ఞానము స్వయముగా దీపమువలె భాసించును.

ప్ర॥వా॥ : **కుతః స్వప్రకాశత్వమ్?**-జీవునకు ఈ స్వయంప్రకాశము ఎట్లు అబ్బినది?

వా॥ : **జ్ఞానస్వరూపత్వాత్, జ్ఞానం హి ఆత్మానమన్యాంశ్చ అవభాసయతీతి, స్వప్రకాశమ్**-జీవుడు జ్ఞానస్వరూపుడు గదా॥ జ్ఞానము (దీపమువలె) తనను ఇతరులను ప్రకాశింపజేయును. కనుక జ్ఞానమును స్వప్రకాశము అందురు.

ప్ర॥వా॥ : **జ్ఞానం జ్ఞేయమేవ అవభాసయతి, జ్ఞానం తు జ్ఞానాంతరేణ అవభాస్యతే నత్స్వాత్ అనువ్యవసాయస్య**-జ్ఞానము జ్ఞేయమునే

ప్రకాశింపజేయును. తనను ప్రకాశింపజేయదు. జ్ఞానము మఱియొక జ్ఞానము చేత అనగా అనువ్యవసాయము చేత ప్రకాశింప జేయబడును. అనువ్యవ సాయమున్నది కదా! (అనగా ఘటమును చూచినవానికి ఇది ఘటము అను జ్ఞానము కలుగును. ఈ జ్ఞానము వలన జ్ఞేయ మయిన ఘటము తెలియుచున్నది. ఇట్టి జ్ఞానము తనకు కలిగినది అను విషయము మఱొక జ్ఞానము చేత తెలియ బడును).

వా॥ : **తచ్చ జ్ఞానాంతరం కేన అవభాస్యతే?**-ఆ మఱియొక జ్ఞానము దేనిచే ప్రకాశింపజేయబడుచున్నది?

ప్ర॥వా॥ : **అన్యేవ జ్ఞానాంతరేణ**-దానిని మఱియొక జ్ఞానము ప్రకాశింప జేయును.

వా॥ : **తదపి కేన?**-ఈ జ్ఞానమును ఏది ప్రకాశింపచేయును?

ప్ర॥వా॥ : **తతోపి అన్యేన**-అది మరొక జ్ఞానము చేత

వా॥ : **తర్హి అనవస్థాదోషః**-అయితే అనవస్థ అను దోషము వచ్చును గదా! అంటే మఱొక జ్ఞానము చేత' అని అలా చెప్పుచుండవలసినదే గదా!

ప్ర॥వా॥ : **తథా చేత్ జ్ఞానం బ్రహ్మణా భాస్యతే**-అట్లైతే, జ్ఞానమును బ్రహ్మమే ప్రకాశింపజేయును.

వా॥ : **తచ్చ బ్రహ్మ జ్ఞానస్వరూపం ఖలు**-ఐనచో, ఆ బ్రహ్మము కూడా జ్ఞానస్వరూపమే కదా!.

ప్ర॥వా॥ : **భవతు, జీవ స్వరూపజ్ఞానాత్ బ్రహ్మజ్ఞానం విలక్షణమితి బ్రహ్మైవ భాస్య ఏవ జీవః**-అగుగాక! జీవుని రూపమయిన జ్ఞానముకన్న బ్రహ్మ స్వరూపమయిన జ్ఞానము భిన్నమయినది. కనుక జీవుడు బ్రహ్మము చేత ప్రకాశించును.

వా॥ : **బ్రహ్మస్వరూపం జ్ఞానం కేన భాస్యతే**-బ్రహ్మము జ్ఞానరూప మయినచో ఆ జ్ఞానమును ఎవరు ప్రకాశింపచేయును?

ప్ర॥వా॥ : **స్వేనైవ** - స్వయముగానే

వా॥ : **కుతః** - ఎందువలన?

ప్ర॥వా॥ : **స్వయంప్రకాశత్వాత్** - స్వయముగనే ప్రకాశించునది కనుక

వా॥ : **కిం మానమ్?** - బ్రహ్మము స్వయంప్రకాశమని ఏమి ప్రమాణము?

ప్ర॥వా॥ : **'తమేవ భాంతమనుభాతి సర్వమ్' ఇతి శ్రుతిః**-ఈ ప్రపంచము అంతయు, వెలుగుచున్న ఆ బ్రహ్మమును బట్టియే వెలుగుచున్నది. (దీపము చుట్టూ ఉన్న వస్తువులు వెలుగుచున్న దీపమును బట్టి వెలిగినట్లు)

వా॥ : **కో భేదః జీవ బ్రహ్మస్వరూప జ్ఞానయోః?**-అయ్యా, జీవ స్వరూప మయిన జ్ఞానమునకు బ్రహ్మ స్వరూపమయిన జ్ఞానమునకు మధ్య ఏమి భేదము?

ప్ర॥వా॥ : **బ్రహ్మ ప్రకాశ్యత్వ స్వప్రకాశ్యత్వ రూపః అయమేవ**-ఏమి భేదమా? ఇదే భేదము. జీవస్వరూపజ్ఞానము బ్రహ్మజ్ఞానము చేత ప్రకాశించును బ్రహ్మజ్ఞానము స్వయంప్రకాశము-ఇదే తేడా.

వా॥ : **స చ కిం ప్రయుక్తః?**-ఈ భేదమునకు కారణమేమి?

ప్ర॥వా॥ : **పరిచ్ఛిన్నత్వా పరిచ్ఛిత్నత్వ ప్రయుక్తః**-జీవుడు పరిచ్ఛిన్నుడు అనగా ఖండ స్వరూపుడు. బ్రహ్మము అపరిచ్ఛిన్నము అనగా అఖండము. వారి జ్ఞానములున్ను అట్టివే. అదే కారణము.

వా॥ : **జ్ఞానేన జ్ఞేయం పరిచ్ఛిద్యతే నతు జ్ఞానం కేనాపి, ఇతి అపరిచ్ఛిన్న మేవ జ్ఞానమ్**-జ్ఞానము వలన జ్ఞేయము పరిచ్ఛిన్నమగును. కాని జ్ఞానము దేని చేతను ఎపుడును పరిచ్ఛిన్నము కాదు. కనుక జ్ఞానము ఎపుడును అపరిచ్ఛిన్నమే. (అనగా జ్ఞానము విశాలము. జ్ఞేయములు ఖండములు)

ప్ర॥వా॥ : **జ్ఞానమపి పరిచ్ఛిద్యత ఏవ. దేవ దత్తస్య కౌముదీ మాత్ర జ్ఞానమస్తి, విష్ణుదత్తస్య భాష్యాంత జ్ఞానమస్తి' ఇత్యేవం ప్రతీతేః** -జ్ఞానము గూడా పరిచ్ఛిన్నము అగును. దేవదత్తుడు వ్యాకరణశాస్త్రములో 'కౌముది' మాత్రమే చదివెను. విష్ణుదత్తుడు భాష్యము వరకు చదివెను. ఇందులో దేవదత్తుని జ్ఞానము చిన్నది, విష్ణుదత్తుని జ్ఞానము పెద్దది-అను కొలతలు కలవు కదా. కనుక జ్ఞానము కూడా ఖండమగును. కొలతలలో తేడాలుండును.

వా॥ : నైవమ్. తత్ర కౌముద్యాది విషయ పరిచ్ఛేద ఏవ, నతు తద్ జ్ఞాన పరిచ్ఛేదః, జ్ఞానగత అల్పత్వ మహత్త్వయోః, జ్ఞేయోపాధి ప్రయుక్త త్వాత్-అలాకాదు. అచ్చట 'కౌముది' మొ॥ విషయముల యొక్క పరిమాణము అది. అంతేతప్ప జ్ఞాన పరిమాణము కాదు. జ్ఞేయం అయిన కౌముది మొ॥ వాని అల్పత్వమును బట్టి జ్ఞానము అల్ప మనిపించును. భాష్యము మొ॥ వాని అధికత్వమును బట్టి అధికము అనిపించును. అంతేకాని జ్ఞానమునకు పరిమాణము లేదు. అది అఖండము (అంటే సముద్రమున మన పాత్రలో తెచ్చిన నీరువలే జ్ఞానము తేడా)

ప్ర॥వా॥ : జ్ఞానానాం నానాత్వాత్ అస్త్యేవ పరిచ్ఛేదః-జ్ఞానములు అనేకములు. కనుక వానికి పరిచ్ఛేదములు అనగా 'ఇంత, అంత' అను కొలతలు కలవు.

వా॥ : విషయ నానాత్వ ప్రయుక్త మేవ జ్ఞాననానాత్వమ్, న స్వతః ఇతి ఏక మేవ జ్ఞానమ్, యద్వా వృత్తి జ్ఞానాన్యేవ నానా, నతు చైతన్య రూపం జ్ఞానమ్-జ్ఞానములు అనేకములు అనుట భ్రమ. విషయములు అనేకములు కనుక ఆ విషయ జ్ఞానములు అనేకములనిపించు కొనును. కాని స్వయంగా జ్ఞానములు అనేకములు కావు కనుక జ్ఞానము ఒక్కటే. లేదా,

వృత్తి జ్ఞానములు అనేకము. చైతన్య రూపమయిన జ్ఞానము ఒక్కటే. (వృత్తి జ్ఞానము అనగా మనకు కలుగు అన్నిరకముల విషయ జ్ఞానములు. ఉదా॥ 'ఇది కుండ, నేను సుఖంగా ఉన్నాను, ఇది నాది మొ॥ భావములు అన్నియూ వృత్తి జ్ఞానములే).

ప్ర॥వా॥ : వృత్తి జ్ఞానవత్ జీవ చైతన్యమపి పరిచ్ఛిన్నమేవ-వృత్తి జ్ఞానము వలె జీవ చైతన్యము గూడా పరిచ్ఛిన్నమే. అనగా ఖండరూపమే.

వా॥ : తర్హి క్షణికమపి స్యాదేవ-అయినచో క్షణికము గూడా కావలయును.

ప్ర॥వా॥ : పరిచ్ఛిన్న మపి చైతన్యం నిత్యమేవ, ఈశ్వర సంకల్పవశాత్-క్షణికము కాదు. జీవ చైతన్యము ఖండమయినను నిత్యమే. కారణం ఈశ్వరుని సంకల్పము.

వా॥ : కేన పరిచ్ఛిద్యతే జీవ చైతన్యమ్? - జీవ చైతన్యమును ఎవరు పరిచ్ఛిన్నము చేసెదరు? (అంటే అదిగాక మిగిలిన చోటున వ్యాపించిన వస్తువేది అని అర్థము)

ప్ర॥వా॥ : బ్రహ్మ చైతన్యేన-బ్రహ్మ చైతన్యము చేయును. (అనగా బ్రహ్మ చైతన్యము వ్యాపించియుండును).

వా॥ : కస్మాత్ ?- ఎందువలన?

ప్ర॥వా॥ : పరిమితత్వాత్ - జీవుడు ఖండమయిన చైతన్యము అగుట వలన

వా॥ : బ్రహ్మ చైతన్యం కేన పరిచ్ఛిద్యతే -బ్రహ్మ చైతన్యమును ఎవరు ఖండము చేసెదరు?

ప్ర॥వా॥ : న కేనాపి -ఎవరును చేయరు.

వా॥ : కస్మాత్? -ఎందువలన?

ప్ర॥వా॥ : అపరిమితత్వాత్ - అఖండమగుట వలన (అంటే సర్వత్ర అదియే వ్యాపించుట వలన)

వా॥ : బ్రహ్మ ఏకమేవ సర్వమాత్మానం చ వేత్తి, జీవస్తు ఆత్మానం జగచ్చ వేత్తి, న తు బ్రహ్మ, దేహాది జగత్తు న కిమపి వేత్తీతి దృశ్యమేవ, ఇత్యత్ర కిమ్ మానమ్?-"బ్రహ్మ" ఒక్కటే. తనను సమస్తమును ఎఱుగును. జీవుడు తనను ప్రపంచమును ఎఱుగును. బ్రహ్మమును ఎఱుగడు. దేహాది జడ ప్రపంచము (అచిత్తు)నకు ఏమియు తెలియదు. అది కేవలము దృశ్యమే" ఈ విషయములకు ప్రమాణము ఏమి?

ప్ర॥వా॥ : దేహోఽసవోఽక్షా మనవో భూతమాత్రా నాత్మానమన్యం చ విదుః పరం యత్, సర్వం పుమాన్వేద గుణాంశ్చ తదజ్ఞో న వేద సర్వజ్ఞ మనంత మీడే. ఇతి భాగవతమ్. "స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా" ఇతి శ్రుతిశ్చ. - '2' ప్రమాణములు కలవు. 1. భాగవతము. 2 శ్రుతి 1. దేహము ప్రాణములు ఇంద్రియములు మొ॥నవి తమను ఇతరులను గూడ ఎఱుగవు. అవి జడములు. పురుషుడు ఈ సమస్తమును ఎఱుగును. వీరెవరునూ ఎఱుగని ఆ సర్వజ్ఞుని స్తుతించెదను"-భాగవతము.

2. ఆయన వేద్యమును అంతటిని ఎఱుగును. ఆయనను తెలిసిన వారు ఎవరును లేరు-శ్రుతి.

వా॥ : న ఈశ్వరో వేద్యం జగదేవ వేత్తి, న తు వేత్తారం జీవమ్-ఈశ్వరుడు తెలియదగినదైన ప్రపంచమునే తెలియును కాని వేత్త అయిన జీవుని తెలిసికొనడు. అతడు వేద్యుడు కాడు కనుక.

ప్ర॥వా॥ : వేత్తు: జీవస్యాపి బ్రహ్మ వేద్యత్వాత్-అట్లు కాదు. జీవుడు వేత్త అయినను వేద్యుడే. బ్రహ్మమునకు వేద్యుడు. కనుక పై శ్రుతిలో వేద్యం అనగా జీవుడున్ను వచ్చును. కనుక జీవుడు బ్రహ్మకు తెలియదగినవాడు.

వా॥ : కథం వేత్తు: వేద్యత్వమ్?-వేత్త అయిన జీవుడు వేద్యుడు ఎట్లగును? అనగా తెలిసికొనెడి జీవుడు తెలియదగినవాడు ఎట్లగును?

ప్ర॥వా॥ : శ్రుత్యాదిప్రామాణ్యాత్-వేదము మొ॥ ప్రమాణములు వలన.

వా॥ : బ్రహ్మాఽ పి జీవస్య అపరోక్షమేవ. 'యత్సాక్షాదపరోక్షాత్' ఇతి శ్రుతే: -బ్రహ్మ గూడా జీవునకు పరోక్షము కాదు. ప్రత్యక్షమే. పైన చెప్పిన వేద వాక్యము అందుకు ప్రమాణము. కాగా బ్రహ్మయు జీవునకు వేద్యుడే.

ప్ర॥వా॥ : బ్రహ్మణ ఏవ బ్రహ్మ అపరోక్షం ఇతి శ్రుత్యర్థాత్ -బ్రహ్మకే బ్రహ్మ అపరోక్షము అనగా ప్రత్యక్షము అని వేదార్థము.

వా॥ : కథం జీవ: బ్రహ్మ పరోక్ష: రూపరహితత్వాత్- రూపరహితుడైన జీవుడు బ్రహ్మకు మాత్రము ఎట్లు ప్రత్యక్షమగును?

ప్ర॥వా॥ : నీరూపస్యాపి సుఖాదే: యథా జీవాపరోక్షత్వం తద్వత్- రూపము లేని సుఖదుఃఖాదులు జీవునకు ఎట్లు ప్రత్యక్షమగుచున్నవో అట్లే రూపరహితుడైన జీవుడు బ్రహ్మకు ప్రత్యక్షము కావచ్చును.

వా॥ : యది జీవస్య సర్వదాపి పరోక్షం బ్రహ్మ తర్హి తత్ నాస్త్యేవ- జీవునకు బ్రహ్మము సర్వదా పరోక్షముగా నుండినచో అనగా ప్రత్యక్షము కానిచో అసలు బ్రహ్మము లేదనవచ్చును కదా!.

ప్ర॥వా॥ : స్వర్గాదివత్ శాస్త్రప్రామాణ్యేన అస్తిత్వం బ్రహ్మణః-స్వర్గము కనబడక

పోయినను శాస్త్ర ప్రమాణముల వలన ఉన్నదని భావించి నట్లు బ్రహ్మయొక్క అస్తిత్వమున్ను శాస్త్ర ప్రమాణముల వలన గుర్తింప వచ్చును.

వా॥ : స్వర్గోపి జీవస్య భోగసమయే ప్రత్యక్షః-స్వర్గము జీవునకు భోగ కాలమున ప్రత్యక్షమగును కదా!.

ప్ర॥వా॥ : తర్హి ధర్మాదివదితి విద్ధి- అయినచో ధర్మము మొ॥ వాని వలె బ్రహ్మకు అస్తిత్వము అందుము.

వా॥ : ధర్మః ఖలు అనుమేయః- ధర్మము ప్రత్యక్షము కాదు. అనుమేయమే అనగా ఊహింపబడునది.

ప్ర॥వా॥ : బ్రహ్మాప్యనుమేయమేవ-బ్రహ్మయు ఊహింపదగినదే.

వా॥ : కథం తర్హి శాస్త్ర ప్రమాణకం బ్రహ్మ?-అప్పుడు బ్రహ్మకు శాస్త్రము ప్రమాణమని యేల చెప్పితివి?

ప్ర॥వా॥ : శ్రుత్యనుగృహీతానుమానగమ్యత్వాత్-వేదముతో గూడిన అనుమాన ప్రమాణముతో ఊహింపబడును.

వా॥ : కిం లింగం బ్రహ్మానుమాపకమ్?-బ్రహ్మను ఊహించుటకు పనికి వచ్చు లింగము (హేతువు) ఏమి?

ప్ర॥వా॥ : జగజ్జన్మాదికం, జీవపారతంత్ర్యం చ-ప్రపంచము పుట్టుట, జీవుల పరాధీనత-మొ॥ లింగములను బట్టి బ్రహ్మము ఊహింపదగును.

వా॥ : ప్రకృతి పరతంత్ర ఏవ జీవః, ప్రకృతి జన్యమేవ జగచ్చ-జీవుడు పరాధీనుడే- కాని ప్రకృతికి పరాధీనుడు. ప్రపంచము పుట్టినది. కాని ప్రకృతి వలన పుట్టినది. కనుక పైన చెప్పిన లింగముల వలన ప్రకృతిని ఊహింపవచ్చును. బ్రహ్మమునకు అవి లింగములుకావు.

ప్ర॥వా॥ : జడా ప్రకృతిః జీవాన్ ప్రతి నేష్టే. ఈశ్వర పరతంత్రా చ సా. ఈశ్వరాధిష్ఠిత ప్రకృతిత ఏవ జగజ్జన్మాదికమ్ -ప్రకృతి జడమయినది. దాని వలన చైతన్య రూపులయిన జీవులను జడ ప్రకృతి సృష్టింప జాలదు. ప్రకృతి ఈశ్వర పరాధీన. కనుక ఈశ్వర సహితమయిన ప్రకృతి వలన సృష్టి మొ॥ కనుక సృష్టి మొ॥ ఈశ్వరలింగములే.

వా॥ : తచ్చ బ్రహ్మ పరతంత్రమ్-ఆ బ్రహ్మయు పరాధీనమే.

ప్ర॥వా॥ : న, 'న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే' ఇతి శ్రుతేః బ్రహ్మాధిక వస్త్వభావాత్ - కాదు 'బ్రహ్మముతో సమానుడు గాని అధికుడు గాని లేదు'' అను శ్రుతి వాక్యమును బట్టి బ్రహ్మమును మించిన వస్తువు లేదు.

వా॥ : బ్రహ్మాపి సృష్ట్యాదిషు అస్వతంత్రమేవ. కాలాది సవ్యపేక్షత్వాత్-సృష్టి మొ॥ వానియందు బ్రహ్మము గూడా పరాధీనమే. దానికి కాలము మొ॥ కావలెను కదా.

ప్ర॥వా॥ : ఈశ్వరశక్తి విశేషత్వాత్ కాలాదీనాం, ఈశ్వరస్య హి బహ్వ్యః శక్తయస్సంతి, పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబల క్రియాచ ఇతి శ్రుతేః-నీవు చెప్పు కాలాదులు ఈశ్వరుని శక్తి విశేషములే. ఈశ్వరునికి అనేక శక్తులు కలవు. చూ॥శ్రుతి. బ్రహ్మము యొక్క శక్తి వివిధ రూపములుగా నున్నది. సహజ మయిన జ్ఞానబల క్రియలున్ను' కనుక ఈశ్వరుడు పరతంత్రుడు కాడు.

వా॥ : తచ్చ బ్రహ్మ ప్రత్యగాత్మైవ - ఆ బ్రహ్మ ప్రత్యగాత్మయే

ప్ర॥వా॥ : న, పరమాత్మైవ బ్రహ్మ, పూర్ణత్వాత్. ప్రత్యగాత్మా తు జీవ ఏవ, పరిచ్ఛిన్నత్వాత్-కాదు. పరమాత్మయే బ్రహ్మము, పూర్ణుడు కనుక. ప్రత్యగాత్మ జీవుడే, పూర్ణుడు కాడు కనుక.

వా॥ : ప్రత్యగాత్మాపి అపరిచ్ఛిన్న ఏవ-ప్రత్యగాత్మయు అనగా జీవుడున్ను పూర్ణుడు. పరిచ్ఛిన్నుడు కాదు.

ప్ర॥వా॥ : న "వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ భాగో జీవస్య విజ్ఞేయః" ఇతి శ్రుతేః -జీవుడు పూర్ణుడు కాడు. ఏమనగా "వెంట్రుక చివఱను 100 భాగాలు చేసి, అందులోని ఒక భాగమును మఱల 100 భాగములుగా చేసినచో ఆ భాగమంతటివాడు జీవుడు' అని వేదము జీవుని అత్యంత స్వల్ప పరిమాణముగా చెప్పినది కనుక జీవుడు పూర్ణుడు, అఖండుడు కాడు. పరిచ్ఛిన్నుడే.

వా॥ : కేనాస్య పరిచ్ఛేదః?-జీవునకు దేనితో పరిమితి గలదు? ఎలా కొలవగలము?

ప్ర॥వా॥ : **దేశవస్తుభ్యామ్**-దేశము, వస్తువుల చేత

వా॥ : **కథమ్**-ఎట్లు?

ప్ర॥వా॥ : **జీవోహ్యంతఃకరణదేశే ఏవ అస్తి అచిదీశ్వరాభ్యాం విలక్షణశ్చ ఇతి**-జీవుడు ఉన్న ప్రదేశము అంతఃకరణము (2) జీవ లక్షణము అచిత్తు (జడ ప్రకృతి) కన్న ఈశ్వరుడి కన్న బిన్నము. ఇది వస్తు లక్షణము.

వా॥ : **అంతఃకరణే సత్త్వ ప్రయుక్తమేవ జీవస్య అణుత్వమ్**-అంతః కరణమునందుండుట వలననే జీవునకు "అణుపరిమాణము" అబ్బినది.

ప్ర॥వా॥ : **మైవమ్. అణుత్వాదేవ జీవస్య అంతఃకరణే స్థితిరితి స్వభావత ఏవ అణుఃజీవః**-అణువు కనుకనే జీవునకు అంతఃకరణమున చోటు దొరికినది. అందువలన జీవుడు స్వభావరీత్యా అణువే కాని అంత కరణములో నుండుట వలన "అణువు"గా మారలేదు.

వా॥ : **కథం అణోః జీవస్య సర్వదేహ వ్యాపిత్వమ్?**-జీవుడు అణువంత అయినచో సమస్త దేహమున ఎట్లు వ్యాపింపగలడు?

ప్ర॥వా॥ : **ధర్మభూత జ్ఞాన ద్వారా**-తన ధర్మమయిన 'జ్ఞానము' ద్వారా వ్యాపించును. (దీపము కాంతి ద్వారా ఇల్లంతయు వ్యాపించినట్లు)

వా॥ : **కథం జ్ఞానస్య జ్ఞానమేవ ధర్మః జీవో హి జ్ఞానస్వరూపః?**-అయ్యా, జీవుడు జ్ఞానస్వరూపుడంటిరి కదా!. జ్ఞానమునకు జ్ఞానమే గుణమా? ధర్మమా?

ప్ర॥వా॥ : **యత్ జీవస్య స్వరూప భూతం జ్ఞానం, తతః అన్యదేవ ధర్మభూతం జ్ఞానం ఇతి జ్ఞానస్య జ్ఞానం ధర్మః భవితుం అర్హత్యేవ, ధర్మ ధర్మిణోః భేదాత్** -జీవునకు స్వరూపమయిన జ్ఞానము వేఱు. ధర్మమయిన జ్ఞానము వేఱు. కనుక ధర్మి అయిన స్వరూపజ్ఞానమునకు ధర్మ మయిన జ్ఞానము గుణము కాదగును. "ధర్మము, ధర్మి" బిన్నములు కదా!

వా॥ : **కిం ధర్మభూతేవ జ్ఞానేవ జ్ఞేయం పరిచ్ఛిద్యతే, ఉత, స్వరూపభూతేన?**-సరే, అట్లయినచో జ్ఞేయమునకు పరిచ్ఛేదము లేదా పరిమితి ఏ జ్ఞానముతో కలుగును? 1. ధర్మమయిన జ్ఞానముతోనా? (2)

స్వరూపమయిన జ్ఞానముతోనా?

ప్రా॥వా॥ : ధర్మభూతేనైవ-ధర్మమయిన జ్ఞానముతోనే.

వా॥ : కిమర్థం తర్హి స్వరూపజ్ఞానాభ్యుపగమః?-మఱి, యింక స్వరూప జ్ఞానమును అంగీకరించవలసిన అవసరమేమి?

ప్రా॥వా॥ : శ్రుత్యనుసారార్థమ్ ధర్మభూత జ్ఞాన పరిచ్ఛేదార్థం చ- వేదవాక్యమును అనుసరించుటకు ధర్మమయిన జ్ఞానమును విడిగా గుర్తించుటకు.

వా॥ : తర్హి ధర్మజ్ఞానస్య జ్ఞేయత్వ మాపతితమ్-అట్లయినచో, ధర్మజ్ఞానము "జ్ఞేయము" కావలసివచ్చును.

ప్రా॥వా॥ : ఆపతతు-అగుగాక.

వా॥ : కథం జ్ఞానత్వ జ్ఞేయత్వయోః సామానాధికరణ్యమ్?-జ్ఞానత్వము, జ్ఞేయత్వము అనునవి 2 న్ను, ఒకే వస్తువులో ఎట్లుండును? అనగా ఒకే వస్తువు తెలిసికొనదగినది, తెలుసుకొనుట-ఎట్లు అగును?

ప్రా॥వా॥ : అవిరోధాత్-విరోధము లేకపోవుట వలన

వా॥ : స్వరూపజ్ఞానస్య ధర్మజ్ఞాన సద్భావే కిం మానమ్?-స్వరూపమయిన జ్ఞానమునకు మళ్లీ జ్ఞానమే ధర్మముగానున్నదని ఏమి ప్రమాణము?

ప్రా॥వా॥ : తస్య భాసా సర్వమిదం విభాతి, న విజ్ఞాతు ర్విజ్ఞాతేః విపరిలోపో విద్యత-ఇత్యాది శ్రుతయః-ఆయన వెలుగుతోనే ఇదంతయు వెలుగుచున్నది. "జ్ఞాత యొక్క జ్ఞానమునకు లోపము లేదు. (అనగా జ్ఞాతకు ధర్మముగా జ్ఞానమున్నట్లు-వేదము చెప్పినట్లే కదా) అను శ్రుతులు ప్రమాణము.

వా॥ : స్వరూప భూతజ్ఞానం జ్ఞాతైవ -స్వరూపముగా అయిన జ్ఞానము జ్ఞాతయే గదా!

ప్రా॥వా॥ : జ్ఞాతురేవ స్వరూపం జ్ఞానమ్-జ్ఞాత యొక్క స్వరూపమే జ్ఞానము.

వా॥ : జ్ఞాతుః ధర్మః జ్ఞాతృత్వమేవ జ్ఞానమ్-జ్ఞాత యొక్క గుణము జ్ఞాతృత్వము. అదే జ్ఞానము అగును కదా!.

ప్రా॥వా॥ : భవతు-అగుగాక!

వా॥ : తర్హి సర్వావభాసకస్య చైతన్యస్య యత్ సర్వావభాసనం ధర్మః తదేవ

జ్ఞానం ధర్మభూతమితి ఉచ్యతే త్వయా - అంటే సమస్తమును ప్రకాశింపజేయు చైతన్యమునందు ప్రకాశింపజేయుట అను ధర్మము గలదు అదే జ్ఞానము ధర్మము అని కదా తమరు చెప్పినది.

ప్ర॥వా॥ : ఓమ్-అవును

వా॥ : కథం అణుః జీవః సర్వదేహ వ్యాపి శైత్యాదిక మవభాసయేత్?- సరే, అణువయిన జీవుడు సమస్తదేహమునందు వ్యాపించు శీతోష్ణాదులను ఎట్లు తెలుపును?

ప్ర॥వా : భాసయేదేవ, సూక్ష్మస్యాపి దీపస్య గృహాంతః సర్వ పదార్థావభాసన శక్తివత్ అణోరపి జీవస్య తాదృశ శక్తి సద్భావాత్- తెలుపగలడు. సూక్ష్మమయిన దీపము ఇంటిలోని సమస్త పదార్థములను తెలిపినట్లు జీవుడు అణువయినను సర్వ శరీరమందలి శీతోష్ణాదులను తెలుపగలడు.

వా॥ : తర్హి స్వరూప చైతన్యస్యైవ సర్వావభాసకత్వాత్ ధర్మభూత జ్ఞానాభ్యుపగమః వ్యర్థ : - అట్లయినచో స్వరూపచైతన్యమే, సమస్తమును వెలిగించునని చెప్పక 'ధర్మము' అను పేరుతో మఱొక జ్ఞానమును (చైతన్యమును) ఏల అంగీకరింపవలయును? వ్యర్థము కదా!

ప్ర॥వా॥ : న, స్వరూపజ్ఞానే యా సర్వావభాసకత్వ శక్తిరస్తి తస్యా ఏవ ధర్మ భూత జ్ఞానత్వాత్ - వ్యర్థము కాదు. స్వరూపమయిన జ్ఞానము నందు సర్వమును ప్రకాశింపజేయు శక్తి గలదు. అదే 'ధర్మ'మయిన జ్ఞానము. (సూర్యుడు-కాంతి వలె)

వా॥ : కథం జ్ఞానస్య శక్తిత్వమ్? - జ్ఞానము శక్తి అగునా?

ప్ర॥వా॥ : 'పరాస్యశక్తిః' ఇతి శ్రుత్యా జ్ఞాన శక్తి సద్భావస్య స్థాపితత్వాత్- ఇంతకు ముందు చెప్పిన 'పరాస్యశక్తిః' అను వేదవాక్యమున జ్ఞానము భగవంతుని శక్తియని చెప్పబడినది. కనుక జ్ఞానము శక్తియే.

వా॥ : శక్తిః శక్తాత్ అర్థాంతరం న భవతి - శక్తి శక్తిమంతుని కన్న భిన్నం కాదు కదా!

ప్ర॥వా॥ : భవత్యేవ, శక్తే రేవ శక్తిత్వే అగ్నిః అగ్నిశక్తిరితి పృథక్ వ్యవహారాసిద్ధేః అగ్నిస్వరూపనాశాభావేపి మణిమంత్రాదినా అగ్నిశక్తి నాశదర్శనాచ్చ

- భిన్నమే. శక్తి శక్తిమంతులు ఒక్కటి కాదు. కనుకనే అగ్ని అనియూ, అగ్నిశక్తి అనియూ లోకమున వ్యవహారము ఏర్పడినది. అగ్ని అచ్చటనే యున్నను మణి, మంత్రము మొ॥ వానితో "అగ్నిశక్తి" నిరోధింపబడు చున్నది కదా. కనుక 'అగ్ని వేఱు-అగ్నిశక్తి వేఱు, అట్లే 'శక్తి వేఱు-శక్తిమంతుడు వేఱు'.

వా॥ : **యది జీవ చైతన్యం సర్వావభాసకం, కథం తర్హి తస్య బ్రహ్మావభాసకత్వం, బ్రహ్మావభాస్యత్వం చ?**- జీవ చైతన్యము అందటిని అన్నింటిని ప్రకాశింపజేయునదియైనచో అది బ్రహ్మమును ఏల ప్రకాశింపజేయదు? పైగా బ్రహ్మచేత ప్రకాశింపజేయబడవలసిన అగత్యమేమి?

ప్ర॥వా॥ : **యథా దీపః సర్వావభాసకోపి చక్షురవభాస్యః తదనవభాసకశ్చ, తద్వత్** - దీపము అంతటిని ప్రకాశింపజేసినను దానిని తెలిసికొనుటకు కన్ను కావలెను. అట్లే దీపము కంటిని వెలిగించలేదు. ఈ విధముగా జీవ చైతన్యము బ్రహ్మను తెలుపలేదు. బ్రహ్మము చేతనే తెలుపబడును.

వా॥ : **యది జ్ఞానవాన్ జీవః, కథమస్య సుషుప్తి మూర్ఛాదిషు జ్ఞానాభావః?** - జీవుడు జ్ఞానము కలవాడైనచో మఱి అతనికి గాఢనిద్రలో మూర్ఛలో ఏల జ్ఞానము లోపించును?

ప్ర॥వా॥ : **తమోఽభిభూతత్వాత్** - అజ్ఞానము కప్పివేయుటవలన

వా॥ : **కిమభిభూతం తమసా?** - అజ్ఞానము దేనిని కప్పినది?

ప్ర॥వా॥ : **ధర్మభూతం జ్ఞానమ్** - ధర్మమయిన జ్ఞానమును

వా॥ : **కేన? కిమివ?** - దేనితో దేనిని కప్పినట్లు?

ప్ర॥వా॥ : **హస్తేవ దీపప్రకాశ ఇవ** - చేతితో దీపపు వెలుతురును కప్పినట్లు (అనగా దీపము వెలుగుచునేయుండును. కాని స్వరూపకాంతి ఉన్నది. చేతితో కప్పుటవలన కాంతి వ్యాప్తి పోయినది. అనగా ధర్మమయిన వ్యాపక కాంతి కుంటుపడినది. జీవ స్వరూప చైతన్యము అట్టే ఉన్నది. కాని ధర్మమయిన వ్యాపించు చైతన్యము అజ్ఞానము చేత ఆపబడినది. ఇట్లే మసికప్పిన దీపము కూడా ఉదాహరణము)

వా॥ : తర్హి విక్రియత ఏవ జీవః - అయితే జీవునకు వికారములు ఉన్నట్లే (వికారము-మార్పు)

ప్ర॥వా॥ : న, ధర్మజ్ఞాన మేవ విక్రియతే - లేదు. ధర్మమయిన జ్ఞానము మాత్రమే మార్పులు చెందును.

వా॥ : ముక్తజీవాత్ ఈశ్వరస్య కో విశేషః? - ముక్త జీవునకు, ఈశ్వరునకు మధ్య తేడా ఏమిటి?

ప్ర॥వా॥ : మహానస్తి - చాలా తేడా ఉన్నది.

వా॥ : కథయ - చెప్పుము

ప్ర॥వా॥ : వచ్మి, శృణు, పరిచ్ఛిన్నః, సర్వజ్ఞః సృష్ట్యాద్యకర్తా జీవః, అపరిచ్ఛిన్నః సర్వజ్ఞః సృష్ట్యాది కర్తా ఈశ్వరః ఇతి -వినుము. పరిచ్ఛిన్నుడు అనగా ఖండుడు, సర్వజ్ఞుడు సృష్టి మొ॥ చేయనివాడు ముక్త జీవుడు. అఖండుడు సర్వజ్ఞుడు సృష్టి మొ॥ చేయువాడు ఈశ్వరుడు. ఇది తేడా.

వా॥ : 'నిష్కలం నిష్క్రియం' ఇతి శ్రుతేః ఈశ్వరస్య నిష్క్రియస్య కథం సృష్ట్యాది కర్తృత్వమ్? - వేదవాక్యమున భగవంతుడు నిష్క్రియుడు అనగా క్రియ చేయనివాడు అని చెప్పబడెను. అట్టి స్థితిలో సృష్టి కర్త ఎట్లగును?

ప్ర॥వా॥ : "స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" ఇతి శ్రుతేః ఈశ్వరః సక్రియ ఏవ గమనాది క్రియారహిత మితి తు నిష్క్రియ పదార్థః, పూర్ణం హి బ్రహ్మ, సర్వశక్తి మచ్చ, యతో వా- ఇత్యాది శ్రుతేః బ్రహ్మణ ఏవ హి జగజ్జనన సామర్థ్యమ్ - స్వాభావికీ - అను శ్రుతిలో ఈశ్వరునికి క్రియ ఉన్నట్లే చెప్పబడినది. మఱి 'నిష్క్రియం' అని ఎందుకన్నారు? అంటే సృష్టి క్రియ లేదని కాదు. గమనము మొ॥ క్రియలు లేవు అని అర్థము. పూర్ణమయిన బ్రహ్మము సర్వశక్తులు గలది. 'యతో వా-' అను శ్రుతి వలన బ్రహ్మమునుండియే జగత్తు వచ్చినదని చెప్పబడినది. కనుక సృష్టి సామర్థ్యము బ్రహ్మమునకే గలదు.

వా॥ : ఈశ్వరో మాయావీ జగత్కర్తా, నిర్మాయం తు బ్రహ్మ నిష్క్రియ మేవ- అట్లు కాదు. ఈశ్వరుడు మాయావి. సృష్టికర్త. మాయారహిత

మయిన బ్రహ్మము మాత్రము క్రియారహితము అని చెప్పవచ్చు గదా!.

ప్ర॥వా॥ : ***ఈశ్వరస్యైవ బ్రహ్మత్వాత్, నిర్మాయ బ్రహ్మ పదార్థాభావాచ్చ బ్రహ్మణః శక్తిర్హి మాయా యది బ్రహ్మ నిర్మాయం స్యాత్ తర్హి తత్ సర్వావభాసకం న భవత్యేవ*** - ఈశ్వరుడే బ్రహ్మము. మాయా రహితమయిన బ్రహ్మపదార్థము ఏదియును లేదు. బ్రహ్మశక్తియే మాయగదా. బ్రహ్మకు మాయయే లేనిచో ఈ సమస్తమున్ను లేదు. దానిని ప్రకాశింపజేయుటయు లేదు.

వా॥ : ***ఇష్టాపత్తిరేవ సర్వస్యైవ అభావాత్*** - మాకిష్టమే. ఏదీ లేదు కనుక. ప్రపంచము అంటూ ఏదీ లేదు కనుక అంతా మిథ్య కదా!

ప్ర॥వా॥ : ***కథం ప్రతీయమానస్య సర్వస్య అభావః?*** - కనబడుతున్న ఈ ప్రపంచము లేకపోవటము ఏమిటి?

వా॥ : ***యథా ప్రతీతస్య సర్పస్య రజ్జు గతస్య అభావః*** - త్రాడును చూచి "పాము" అను భ్రాంతి పడినపుడు త్రాడుపై మన అనుభవము లోనికి వచ్చిన 'పాము' మిథ్యయే కదా! నిజంగా లేదు కదా!.

ప్ర॥వా॥ : ***జగన్న రజ్జు సర్పవత్ మిథ్యా***- సర్పమువలె జగత్తు మిథ్య కాదు.

వా॥ : ***కస్మాత్?*** - ఎందువలన కాదు?

ప్ర॥వా॥ : ***భ్రాంతిం వినైవ సిద్ధత్వాత్ సత్య సర్పవత్, అతస్మిన్ తద్బుద్ధిః భ్రాంతిః యథా రజ్జౌ సర్పబుద్ధిః ప్రకృతే చ జగత్యేవ జగద్బుద్ధేః ఇయం ప్రమైవ "తస్మిన్ తద్బుద్ధేః ప్రమాత్వాత్"*** - ఇచ్చట భ్రాంతి లేదు. 'అది' కాని దానిని 'అది' గా తలచుటయే భ్రాంతి. పాము కాని త్రాడును పాముగా తలచుట భ్రాంతి. కాని ప్రస్తుతము జగత్తును చూచి జగత్తుగా తలచుట భ్రాంతి కాదు. 'ప్రమ' 'దానిని' 'దానిని' గానే తలచుట ప్రమ కదా. (అనగా త్రాడును త్రాడుగానే తలచుట 'ప్రమ' కదా!)

వా॥ : ***బ్రహ్మైవ జగద్రూపేణ భాతీతి బ్రహ్మణి జగద్బుద్ధిః ఇయమ్ భ్రాంతి రేవ*** - ఇచ్చటను బ్రహ్మయే ఉన్నది. దానిని జగత్తుగా భావించుట భ్రాంతియే.

ప్ర॥వా॥ : **సూక్ష్మచిదచిద్విశిష్టం బ్రహ్మైవ స్థూల జగద్రూపేణ పరిణతం మృద్ఘట ఇవ ఇతి, తాదృశో బ్రహ్మణి జగద్బుద్ధిః ప్రమైవ** - 'సూక్ష్మచిత్తు సూక్ష్మఅచిత్తు'తో గూడిన బ్రహ్మయే స్థూలజగత్తుగా పరిణమించినది. 'మట్టి' కుండగా పరిణమించినట్లు. కనుక అట్టి జగత్తుగా పరిణమించిన బ్రహ్మమునందు 'జగత్తు' అను బుద్ధి ప్రమయే.

వా॥ : **జగత్ కాలత్రయేపి నాస్తీతి మిథ్యైవ** - ప్రపంచము మూడు కాలము లందును లేదు. కనుక మిథ్యయే.

ప్ర॥వా॥ : **సూక్ష్మత్వస్థూలత్వోపాధిభ్యాం కాలత్రయేప్యస్తి ఏవేతి న మిథ్యా**- సూక్ష్మ, స్థూల శరీరములతో మూడు కాలములందును కలదు. కనుక జగత్తు మిథ్య కాదు.

వా॥ : **కార్యమనృతం కారణం సత్యం 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్' ఇతి శ్రుతేః, తతశ్చ కారణం బ్రహ్మైవ సత్యమ్. కార్యం జగత్ మిథ్యైవ**-కారణము సత్యము కార్యము. మిథ్య ఏమనగా 'వాచారంభణం-' అనువేద వాక్యము 'మట్టి నిజమని దాని వికార మయిన కుండ మిథ్యయని" చెప్పుచున్నది. కనుక కారణమయిన బ్రహ్మయే సత్యము. కార్యమయిన ప్రపంచము అసత్యము, మిథ్య.

ప్ర॥వా॥ : **సూక్ష్మ చిదచిద్విశిష్ట బ్రహ్మణ ఏవ కారణత్వేన సూక్ష్మచిదచితో రేవ స్థూల చిదచిత్త్వేన చ చేతనాచేతనాత్మకం జగత్ సత్య మేవ** - సూక్ష్మమయిన చిదచిత్తులతో (జీవ, ప్రకృతులతో)గూడిన బ్రహ్మయే ప్రపంచ కారణము. కనుక, అందలి సూక్ష్మచిదచిత్తులే మనకు కనబడు స్థూల చిదచిత్తులు కనుక (గింజలు చెట్లయినట్లు) చేతనా చేతనాత్మకమయిన అనగా జీవ,జడమయమయిన యీ ప్రపంచము సత్యమే.

వా॥ : **కథం సత్యస్య సంసారస్య నివృత్తిః?** - సంసారము సత్యమయినచో అది యెట్లు నివర్తించును?

ప్ర॥వా॥ : **ఈశ్వరానుగ్రహాత్ సతి ప్రకృతి పురుషవివేకే** - ఈశ్వర కటాక్షము వలన "ప్రకృతి వేఱు - తాను వేఱు" అని వివేకము కలిగినపుడు నివర్తించును.

వా॥ : **అవివేకకృతః సంసారః కథం సత్యః?** - ప్రకృతి పురుష వివేకము లేక వచ్చిన (భ్రాంతి రూపమయిన) సంసారము ఎట్లు సత్యమగును?

ప్రా॥వా॥ : **సంసారో న అవివేకకృతః, కింతు ప్రకృతి పురుష సంగకృతః** - సంసారము అవివేకము వలన వచ్చినది కాదు. ప్రకృతి పురుషుల మధ్య సంగము వలన ఏర్పడినది.

వా॥ : **సః సంగః కింకృతః?** - ఆ సంగము దేనివలన ఏర్పడినది?

ప్రా॥వా॥ : **అవివేకకృతః** - అవివేకముచే ఏర్పడినది.

వా॥ : **కథం తర్హి సంగః సత్యః?** - మఱి ఆ సంగము సత్యము అగునా?

ప్రా॥వా॥ : **సంగః భ్రాంతి సిద్ధ ఏవ** - లేదు. సంగము భ్రాంతి వలన ఏర్పడినది.

వా॥ : **తర్హి సంగజస్సంసారోఽపి మిథ్యైవ** - భ్రాంతి వలన వచ్చిన సంగము వలన ఏర్పడిన సంసారము గూడ భ్రాంతియే మిథ్యయే.

ప్రా॥వా॥ : **న, భ్రాంతి సిద్ధ రజ్జు సర్ప జన్యస్య భయకంపమరణాదేః సత్యత్వ దర్శనాత్** - మిథ్య కాదు. ఏమంటే, భ్రాంతి వలన త్రాటిని చూచి పాము అనుకొన్న వానికి వాస్తవముగానే భయము వణకు చివఱకు మరణము గూడా కనబడుచున్నది. కనుక భ్రాంతి ఫలితము సత్యము కనుక సంసారము సత్యము కావచ్చును.

వా॥ : **సంగహేతురవివేకః కేన కృతః?** - సంగమునకు కారణమయిన అవివేకము దేనివలన సంభవించినది?

ప్రా॥వా॥ : **భగవన్మాయయా** - భగవంతుని మాయ వలన,

వా॥ : **కథం మాయా నివృత్తిః?** - ఆ మాయ ఎట్లు తొలగును?

ప్రా॥వా॥ : **భగవత్ప్రాప్తేః** - భగవంతుని పొందుట వలన,

వా॥ : **కిం తత్ర మానమ్?** - అందుకు ప్రమాణ మేమి?

ప్రా॥వా॥ : **'మామేవ యే ప్రపద్యంతే-మాయామేతాం తరంతితే' ఇతి గీతా వచనమ్**- 'నాకు ప్రపన్నులయిన వారు మాయను దాటగలరు' అను గీతావచనము.

వా॥ : **కోఽయమీశ్వరస్య జీవేషు ప్రద్వేషః, యన్మాయయా జీవానాం అవివేక జననమ్?** - ఈశ్వరునకు జీవులయందు ఈ ద్వేషమేమిటి?

మాయ చేసి జీవుల యందు అవివేకము కలిగించుట ఏమి?

ప్రాll వాll : అనాది కాల సంచితజీవాదృష్టవశాత్ - అనాదికాలము నుండి సంపాదించిన ఆయా జీవుల అదృష్టము, వలన అవివేకము కలుగును.

వాll : కిం తత్ అదృష్టమ్? - ఏమా అదృష్టము?

ప్రాll వాll : పుణ్యాపుణ్య లక్షణం కర్మ - పుణ్య పాపకర్మ ఫలము

వాll : దేహినో జీవస్య కథం దేహరూప ప్రకృతి సంగః స్యాదసత్యః?- దేహధారి అయిన జీవునకు దేహరూపమయిన ప్రకృతితో ఏర్పడిన సంగము సత్యమా? అసత్యమా?

ప్రాll వాll : అవివేకాదయం సత్య ఏవ సతి తు వివేకే జీవస్య దేహిత్వమేవ న సిద్ధ్యతి-అవివేకమున్నంత వఱకు సంగము సత్యమే. వివేకము కలిగిన తర్వాత అసత్యమే జీవుడు దేహధారియే కాడు.

వాll : తర్హి జీవోబ్రహ్మైవ - అయితే జీవుడు బ్రహ్మయే

ప్రాll వాll : న, పరిచ్ఛిన్నత్వాత్ - కాడు. ఖండస్వరూపుడు కనుక.

వాll : జీవస్సత్యః దేహస్సత్యః చేతి కుత స్తయో స్సంగో న సత్యః? - అయ్యో! జీవుడు సత్యము దేహము సత్యము - మఱి ఇక వారి సంగము ఎందుకు సత్యము కాదు?

ప్రాll వాll : అసంగత్వాత్ పురుషస్య - పురుషుడు సంగము లేని వాడు కనుక ('తామరాకు సత్యము నీరు సత్యము' వాని మధ్య సంగం అసత్యము)

వాll : అసంగస్యాపి జీవస్య దేహసంగః స్యాదేవ, ఈశ్వర సంకల్పవశాత్ - జీవుడు సంగరహితుడయినను, ఈశ్వర సంకల్పము వలన దేహముతో జీవునకు సంగము ఏర్పడవచ్చుగదా?

ప్రాll వాll : భఽవతు, తర్హి సంగోఽపి సత్యః - అవును. అప్పుడు సంగము గూడ సత్యమగును.

వాll : కథం అసంగత్వశ్రుతి విరోధ పరిహారః? - 'జీవుడు అసంగుడు' అనే వేదవాక్యముతో విరోధము వచ్చును గదా. దానికి ఏమి పరిహారము?

ప్రా॥వా॥ : **ముక్తజీవ పరత్వాత్ శ్రుతేః ప్రకృతి సంగరహితో హి ముక్తః** - వేదము 'అసంగుడు' అని చెప్పినది 'ముక్త జీవుని' గుఱించి. సాధారణ జీవుని గుఱించి కాదు. ప్రకృతి సంగం లేనివాడే ముక్తుడు.

వా॥ : **కథం ప్రకృతి సంగరాహిత్యం ముక్తస్య?** - ముక్తునకు ప్రకృతి సంగము ఎట్లు పోవును?

ప్రా॥వా॥ : **ఈశ్వరానుగ్రహాత్** - ఈశ్వరుని అనుగ్రహము వలన.

వా॥ : **ఈశ్వరస్యైవ ప్రకృతివిశిష్టత్వేన కథం జీవస్య తదనుగ్రహాత్ ప్రకృతి విమోక్షః?** - ఈశ్వరుడే ప్రకృతితో కల్సియున్నాడు కదా? మఱి ఆయన అనుగ్రహముతో జీవుడు ప్రకృతి నుండి ఎట్లు విడివడును?

ప్రా॥వా॥ : **ప్రకృతి విశిష్టోపి ఈశ్వరః ప్రకృతి వియుక్త ఏవ, ప్రకృతౌ అహం మమాభిమానాభావాత్** - ఈశ్వరుడు ప్రకృతితో కలిసియున్నను దానితో ఆయనకు సంగము (attachment) లేదు. దానికి పరతంత్రుడు కాడు. దానియందు "నేను - నాది" అను అహంకార మమకారములు (జీవునకున్నట్లు) భగవంతునకు లేవు.

వా॥ : **"ప్రకృతిం విద్ధి మే పరామ్" ఇతి గీతావచనాత్ ప్రకృతౌ మమాభిమానః అస్త్యేవ ఈశ్వరస్య** - గీతలో భగవంతుడు 'మే' (నాది) అను శబ్దముతో 'నా ప్రకృతి' అని చెప్పినాడు కదా? కాబట్టి ఆయనకు ప్రకృతి యందు మమ (నాది) కారము కలదు.

ప్రా॥వా॥ : **అహమభిమానస్తు నాస్తీతి** - 'నేను' అను అభిమానము ప్రకృతిపై భగవంతునకు లేదు కదా. (అనగా జడ దేహము ప్రకృతి దీనియందు మనకు 'నేను' అను అభిమానము కలదు. అట్లు భగవంతునికి తన ప్రకృతి యందు 'నేను' అను అభిమానము లేదు కనుక ప్రకృతితో సంగము లేదు. కనుక ఆయన అనుగ్రహముతో జీవుడు గూడా ప్రకృతి సంగమునుంచి విడివడును.)

వా॥ : **సోపి అస్త్యేవ. 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' ఇతి రామాయణాత్** - తన శరీరమునందు (ప్రకృతి యందు) ఈశ్వరునకు 'నేను' అను అభిమానము కలదు. ఏమనగా రామాయణమున రాముడు తనను "నేను దశరథసుతుడనైన

రాముడు అనే మనిషిని" అని చెప్పెను కదా!

ప్రౌ॥వా॥ : **తద్వచనస్య లీలాప్రయుక్తత్వాత్** - ఆ మాట 'లీలలో' ప్రయోగింప బడినది. కనుక పరిహాసవాక్యము వంటిది.

వా॥ : **తర్హి లీలయైవ ఈశ్వరస్య ప్రకృతి వైశిష్ట్యమపి ఇతి బ్రూహి** - అట్లయినచో, ఈశ్వరుడు ప్రకృతి సహితుడుగా నుండుటయు 'లీల' అనుకొనుము.

ప్రౌ॥వా॥ : **రామకృష్ణాదిదేహాకార ప్రకృతి వైశిష్ట్యస్య లీలామయత్వేపి ప్రకృతి మాత్ర వైశిష్ట్యస్య స్వాభావికత్వాత్** - రామకృష్ణాదులు అవతరించిన పురుషులు. వారు దేవీ రూపముగా పరిణమించిన ప్రకృతిలో కల్సియుండుట "లీల". అట్లుగాక ఈశ్వరుడు కేవల "ప్రకృతి" తో కల్సియుండుట స్వాభావికము. లీల కాదు.

వా॥ : **కిం తత్ ప్రకృతిమాత్రమ్?** - "కేవల ప్రకృతి" అనగానేమి?

ప్రౌ॥వా॥ : **యత్ జగజ్జన్మాద్యుపాదానమ్** - ప్రపంచము యొక్క సృష్టి మొదలగు వానికి ఉపాదాన కారణముగా (కుండకు మట్టి వలె) అయినది కేవల ప్రకృతి.

వా॥ : **జీవో ముక్తిదశాయాం శుద్ధః ప్రకృతి వియుక్తత్వాత్. ఈశ్వరస్తు సదాపి అశుద్ధః ఏవ. ప్రకృత్యవియుక్తత్వాత్ ఇతి ముక్త ఏవ ఈశ్వరా దుత్తమః ఇతి సిద్ధమ్**- అయినచో జీవుడే శుద్ధుడని, ఈశ్వరుడు అశుద్ధుడని తేలుచున్నది. ఏలననగా, ముక్తజీవునకు ప్రకృతి సంబంధము లేదు. కనుక శుద్ధుడు. ఈశ్వరునకు ప్రకృతి సంబంధము సహజము. పోదు. కనుక ఈశ్వరుడు అశుద్ధుడు.

ప్రౌ॥వా॥ : **ప్రకృత్యవియుక్తత్వేపి శుద్ధమేవ ఈశ్వరరూపమ్** - ప్రకృతితో కల్సినను ఈశ్వరుడు శుద్ధుడు.

వా॥ : **కస్మాత్ ?** - ఎందుకని?

ప్రౌ॥వా॥ : **ప్రకృతి విలక్షణత్వాత్, ప్రకృతౌ అహం మమాభిమానాభావాచ్చ**- ఈశ్వరుడు ప్రకృతి కన్నా విలక్షణ మగుట వలన, ప్రకృతి యందు 'నేను, నాది' అను అభిమానములు లేవు కనుక.

వా॥ : తర్హి విదుషః జీవస్య స్వరూపమపి శుద్ధమేవ - అట్టిచో, జ్ఞానియైన జీవుని స్వరూపము గూడా శుద్ధమే కదా.

ప్రా॥వా॥ : భవతు - కానిమ్ము

వా॥ : నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావః జీవః బ్రహ్మైవ - అప్పుడు, నిత్యుడు శుద్ధుడు, బుద్ధుడు (జ్ఞాని) ముక్తుడు అయిన జీవుడు బ్రహ్మయేకదా!

ప్రా॥వా॥ : న - కాదు.

వా॥ : కుతః? - ఎందువలన?

ప్రా॥వా॥ : పరిచ్ఛిన్నత్వాత్ - ఖండ స్వరూపుడు కనుక.

వా॥ : "యో వై భూమా తదమృత మథ యదల్పం తన్మర్త్యమితి. శ్రుతేః అల్పోజీవః స్యాదనిత్యః - "బ్రహ్మము అమృతము, అల్పము మృతము" అను వేదమునుబట్టి ఖండస్వరూపుడు అనగా అల్పుడైన జీవుడు 'మృతుడు' అనగా 'అనిత్యుడు' అని తేలుచున్నది. (మఱి మీరు జీవుడు నిత్యుడని చెప్పితిరి గదా! ఎట్లు?)

ప్రా॥వా॥ : ఈశ్వర సంకల్పవశాత్ అల్పత్వేపి జీవస్య అనిత్యత్వాభావః కించ సావయవాణోరేవ అనిత్యత్వమ్. నతు నిరవయవాణోః నిత్యాః ఖలు పరమాణవః - అల్పుడైనను జీవుడు అనిత్యుడు కాడు. కారణము ఈశ్వరానుగ్రహమే. అంతేకాక, అవయవ విభాగము గల అణువు అనిత్యము. లేని అణువు నిత్యము. పరమాణువులు నిత్యములు గదా!

వా॥ : "యేన సర్వమిదం తతమ్" ఇతి, "కూటస్థ మచలం ధ్రువం" ఇతి చ గీతావచనాత్ విభురేవ జీవః - గీతలో "జీవుడు ఈ సర్వ ప్రపంచమున వ్యాపించినట్లు, ఆ జీవుడు అచంచలుడు నిత్యుడు" అనియు చెప్పబడినది. కనుక జీవుడు 'విభువే'.

ప్రా॥వా॥ : న, విభుత్వే ఉత్క్రాంతి గత్యాద్యయోగాత్. గీతావచనం తు, ధర్మభూత జ్ఞాన ద్వారా సర్వవ్యాపకః కరచరణాద్యభావాత్ దేహవత్ చలన రహితశ్చ ఇత్యభిప్రాయగర్భమ్ - విభువు అనగా సర్వవ్యాపి అని అర్థము. అట్టిచో మరణించిన శరీరము నుండి ఉత్క్రాంతి ఉత్క్రమణము అనగా పైకి పోవుట అనునది జీవునకు కుదరదు. అంతట వ్యాపించిన వానికి 'పైకి, కిందకు' అని ఉండదు గదా!

మటి గీతలో 'విభువు' అనుటకు అర్థమే మనగా, ధర్మమయిన జ్ఞానము ద్వారా (దీపము కాంతి ద్వారా ఇల్లంతయు) వ్యాపించును అని. పైగా శరీరము వలె జీవునకు కాలు సేతులుండవు కనుక అతడు 'అచలః' కదలని వాడు అనియు చెప్పబడినది.

వా॥ : ***సర్వవ్యాపిని ఈశ్వరచైతన్యే అణు పరిమాణ జీవచైతన్యాని కుతః న విలీనాని, సముద్రోదకే వర్షోదబిందు బృందవత్?*** - సర్వ వ్యాప్త మయిన సముద్రజలములో వర్షబిందువులు కల్సిపోయినట్లు ఈశ్వర చైతన్యములో జీవచైతన్యములు ఏల లీనమగుట లేదు?

ప్రా॥వా॥ : ***జగత్కారణ ప్రకృతివ్యవధాన సత్త్వాత్. ఈశ్వర చైతన్యం హి ప్రకృతి విశిష్టమ్*** - ఈశ్వర చైతన్యములో 'ప్రకృతి' ఇమిడి యున్నది. అది ప్రపంచకారణము. కనుక అది జీవచైతన్యమును ఈశ్వర చైతన్యములో కలుగనీయదు.

వా॥ : ***ప్రకృతేరంతః వర్తమానః భవతు ఈశ్వరః జీవదుర్లభః. ప్రకృతేః బహిస్థస్తు సులభ ఏవ*** - భగవంతుడు లోన, బయట వ్యాపించి యున్నాడు కదా! లోన వ్యాపించిన భగవంతునిలో కలియుటకు ప్రకృతి అడ్డము కావచ్చును. కాని ప్రకృతికి బయట వ్యాపించిన ఈశ్వరునిలో జీవులు కలియుటకు ప్రకృతి ఆటంకము ఎట్లగును?

ప్రా॥వా॥ : ***మూల ప్రకృతేః బహిర్దేశస్యైవ అభావాత్, తత్సత్త్వే వా జీవస్య తద్దేశస్య అసన్నికృష్టత్వాత్*** - మూల ప్రకృతికి బాహ్య స్థలము అనునది లేదు. ఉన్నదనుకొన్నచో, జీవునకు ఆ స్థలమునకు సామీప్యము లేదందుము. అందువలన అచ్చట ఈశ్వరునితో కలియలేడు.

వా॥ : ***"యథోదకే శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి" ఇత్యాది జీవ బ్రహ్మ సాయుజ్య ప్రతిపాదక శ్రుతీనాం కా గతిః?*** - నిర్మల జలమున పోయ బడిన శుద్ధజలము దాని వలెనే అయినట్లు బ్రహ్మ సాయుజ్యమును పొందినవాడు బ్రహ్మయే అగును. అను వేద వాక్యముల గతి ఏమి? (వీనిని బట్టి జీవునకు బ్రహ్మము అందునని తెలియుచున్నది కదా!)

ప్రా॥వా॥ : ***అర్వాచీనైః కల్పితత్వేన అథోగతిరేవ, యద్వా తాదృగేవ భవతీతి***

బ్రహ్మసామ్యమేవ ముక్త జీవస్య ప్రతిపాద్యతే శ్రుతిభిః. "పరమం సామ్యముపైతి" ఇతి శ్రుత్యంతరాత్. కథం అన్యథా జీవస్య బ్రహ్మణి లయః స్యాత్ నిత్యస్య- ఆ వేదవాక్యములు ఆధునికుల కల్పనలు. కనుక వాటికి సమన్వయము చేయనక్కఱలేదు. లేదా, ముక్తజీవుడు బ్రహ్మసామ్యమును పొందును. అని చెప్పుటయే వాటి భావము. "పరమసామ్యమును పొందును" అను ఇతర వేదవాక్యములను బట్టి పై అర్థమే సరి. లేనిచో నిత్యుడైన జీవునకు 'లయము' ఎట్లు కలుగును.

వా॥ : అనయా ముక్త్యా స్వాభావికాణుభావాపత్తిరూపయా జీవస్య కిం ఫలమ్? - ఈ రకమయిన ముక్తి వలన జీవునకు సహజమయిన తన ప్రాత అణుస్వరూపము వచ్చును. దీనివలన ఒరిగినదేమి?

ప్ర॥వా॥ : దేహసంబంధాభావ ఏవ. తత్సంబంధ ప్రయుక్తో హి జన్మజరా మరణాదిః సర్వసంసారః, తత్ప్రయుక్తం దుఃఖం చ, యద్వా బ్రహ్మానందానుభవః - దేహ సంబంధము తొలగుటయే ఫలము దేహ సంబంధము ఉండుట వలననే గదా, జనన మరణాది సర్వ సంసార వికారములు, వాని వలన దుఃఖములున్ను. అవి తప్పుటయే ఫలము. లేదా బ్రహ్మానందమును అనుభవించుట ఫలము.

వా॥ : ప్రకృతి తిరోహితత్వాత్ బ్రహ్మణః కథం తదానందానుభవః జీవస్య? - బ్రహ్మకు జీవునకు మధ్య ప్రకృతి అడ్డ గోడవలె నుండును కదా! మఱి జీవునకు బ్రహ్మానందానుభవమెట్లు కలుగును?

ప్ర॥వా॥ : ఈశ్వరానుగ్రహాత్ ప్రకృత్యేకదేశం భిత్త్వా పరమాత్మానం ప్రవిశ్య జీవః తదానందమనుభవతి - ఈశ్వరానుగ్రహము వలన జీవుడు ప్రకృతిని కొంతభాగము ఛేదించుకొని పరమాత్మలో ఏకమయి బ్రహ్మానందమును అనుభవించును.

వా॥ : తర్హి సిద్ధం జీవబ్రహ్మ సాయుజ్యమ్ - అయినచో జీవ బ్రహ్మలకు "కలసి పోవుట" అను సాయుజ్యముక్తి ఉన్నట్లే తేలినది కదా!

ప్ర॥వా॥ : న సిద్ధమ్. భోక్తృభోగ్యభావ విరోధాత్. జీవో హి భోక్తా బ్రహ్మ, తు భోగ్యమ్- సాయుజ్యము కుదరదు. జీవుడు భోక్త అనగా అనుభవించు

వాడు. బ్రహ్మము భోగ్యము అనగా అనుభవింపబడి ఆనందము నిచ్చునది. సాయుజ్యమయినచో కలిసిపోవుట కనుక 'భోక్త భోగ్యము' అన్న సంబంధమునకు భేదమునకు అవకాశము లేదు.

వా॥ : **బ్రహ్మచైతన్యం ప్రవిష్టస్య జీవ చైతన్యస్య కుతః న లయః?** - అదేమిటి? బ్రహ్మ చైతన్యమునందు ప్రవేశించిన జీవచైతన్యము దానిలో ఎందుకు కలగదు?

ప్ర॥వా॥ : **ఈశ్వర సంకల్పాదేవ** - భగవత్సంకల్పము వలననే.

వా॥ : **యది ముక్తస్య భోగ్యం బ్రహ్మ, తర్హి జీవ ఏవ బ్రహ్మణోఽపి శేషీతి బ్రహ్మణః జీవశేషత్వం ఆపతితమ్** - ముక్త జీవునకు బ్రహ్మము భోగ్య పదార్థమయినచో 'జీవుడే శేషి బ్రహ్మము శేషము' కావలసి వచ్చును గదా!

ప్ర॥వా॥ : **బ్రహ్మ న శేషమ్. కింతు తదీయానంద ఏవ, జీవో హి బ్రహ్మానందం భుంక్తే నతు బ్రహ్మ** - అయ్యా! జీవుడు బ్రహ్మమును అనుభవింపడు. బ్రహ్మానందమును అనుభవించును. కనుక బ్రహ్మ శేషము కాదు. బ్రహ్మానందము శేషము.

వా॥ : **కిం బ్రహ్మ తదానందయోః భేదః?** - బ్రహ్మకు ఆయన వలన వచ్చిన ఆనందమునకు మధ్య తేడా ఏమి?

ప్ర॥వా॥ : **సత్యం, బ్రహ్మ హి ఆనందగుణకమ్, 'ఆనందమయః' ఇతి శ్రుతేః** - బ్రహ్మకు ఆనందమే గుణము. 'ఆనందమయుమయినది బ్రహ్మము' అని గదా వేదము.

వా॥ : **న హి కోశః** - 'ఆనందమయము' అనునది కోశము పేరు గదా!

ప్ర॥వా॥ : **న, అన్నప్రాణమనాంస్యేవ కోశాః, విజ్ఞానమయానందమయౌ జీవేశ్వరావేవ** - కాదు. కోశములు '3' మాత్రమే. అవి అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములు. విజ్ఞానమయుడు జీవుడు. ఆనందమయుడు ఈశ్వరుడు.

వా॥ : **కథం మయట ఉపపత్తిః?** - 'మయట్' అను ప్రత్యయమునకు సమన్వయము ఏమి?

ప్రా॥వా॥ : ***ప్రాచుర్యార్థే మయడ్విధానాత్*** - మయట్ - ప్రచురమయిన అని అర్థము. అనగా ఎక్కువగా గల.

వా॥ : ***కిం ఆనంద ప్రచురే బ్రహ్మణి లేశతో దుఃఖమస్తి?*** - బ్రహ్మ ఆనందము ఎక్కువగా గలది. అనగా అందు దుఃఖము తక్కువగా నున్నట్లే. మఱి బ్రహ్మమున దుఃఖము కొంచె మయినను కలదా?

ప్రా॥వా॥ : ***న, ప్రాచుర్యస్య ఇతర సత్తానిషేధపరత్వాత్*** - దుఃఖము లేదు. ప్రచుర మనగా ఆనందము తప్ప మఱేదియు లేదనే అర్థము.

వా॥ : ***కిం సర్వేముక్తాః ఆత్మానందమనుభవంతి? ఉత కతిచిదేవ?*** - ముక్తజీవులందఱును ఆత్మానందమును అనుభవించెదరా? లేక కొంతమంది మాత్రమేనా?

ప్రా॥వా॥ : ***కతిచిదేవ*** - కొంత మంది మాత్రమే.

వా॥ : ***కే తే?*** - ఎవరు వారు?

ప్రా॥వా॥ : ***యే పరమాత్మానం ఉపాసితవంతః*** - ఎవరు పరమాత్మను ఉపాసించిరో వారు మాత్రమే ముక్తి పొందెదరు.

వా॥ : ***ఆత్మోపాసకానాం కా గతిః?*** - అయితే ఆత్మోపాసన చేయువారి గతి ఏమి?

ప్రా॥వా॥ : ***తే స్వానందమేవ అత్యల్పమనుభవంతి*** - వారు అల్పమయిన ఆత్మానందమును అనుభవించెదరు.

వా॥ : ***కుతః?*** - ఎందువలన?

ప్రా॥వా॥ : ***ఆత్మోపాసకానాం ఈశ్వరానుగ్రహాభావేన ఈశ్వరావారకప్రకృతి భేదనస్య దుశ్శకత్వాత్*** - ఆత్మోపాసకులకు ఈశ్వరానుగ్రహము లేదు. అందువలన ఈశ్వరుని ఆవరించిన ప్రకృతిని వారు భేదింపలేరు. అందువలన బ్రహ్మానందము లభింపదు.

వా॥ : ***తటాకం ప్రవిశ్య గౌః జలం ముఖేనేవ, జీవః ఈశ్వరం ప్రవిశ్య తదానందం కేనానుభవతి?*** - చెఱువునందు ప్రవేశించిన "గోవు" నోటితో నీటిని త్రాగును. ఈశ్వరునియందు ప్రవేశించిన జీవుడు ఆనందమును దేనితో అనుభవించును?

ప్ర॥వా॥ : స్వేనైవ, యద్వా ధర్మభూత జ్ఞానేన - స్వయముగనే, లేదా తనకు ధర్మముగానున్న జ్ఞానము ద్వారా.

వా॥ : ఏవం అనంతముక్తానుభూయమానత్వాత్ ఈశ్వరానందస్య క్షయః స్యాత్ - ఇంతమంది ముక్తజీవులు కోటాను కోట్లు అనుభవించుట వలన ఈశ్వరానందము తఱిగిపోవును.

ప్ర॥వా॥ : న, అక్షయత్వాత్ తదానందస్య - తఱుగదు. ఆ ఈశ్వరానందము అక్షయమయినది.

వా॥ : కథం తర్హి జీవానామీశ్వర శేషత్వమ్? - అయినచో జీవులు ఈశ్వర శేషములు ఎట్లు అగుదురు. (అనగా ఈశ్వరుడు భోగింపదగిన వస్తువులు ఎట్లగుదురు. వారే ఈశ్వరుని భోగించుచున్నారు కదా!

ప్ర॥వా॥ : ఈశ్వర పరతంత్రత్వాత్ ఈశ్వర లీలారస పరిపూరకత్వాచ్చ - 1) జీవుడు ఈశ్వర పరతంత్రుడు కనుక, 2) ఈశ్వరుని క్రీడారసమును పూరించువాడగుట వలన.

వా॥ : స్వానంద మపహరద్భిఃముక్తైః కథం ఈశ్వరస్య లీలారసః పూర్యతే - తన ఆనందము కొఱకు సంసారములో నుండక ముక్తిని పొందు జీవుల వలన ఈశ్వరునికి ఎట్లు క్రీడావినోదము లభించును? (సంసారమే కదా ఆయన లీల)

ప్ర॥వా॥ : యథా స్వస్తన్యం పిబద్భిః శిశుభిః మాతుః. వత్సలో హి జీవేషు ఈశ్వరః "వత్సలో వత్సరో వత్సీ" ఇతి సహస్రనామ పాఠాత్ - ముక్తిని పొందుట అనగా బ్రహ్మమునందుజేరి ఆనందమును పొందుట. అనగా తల్లినిజేరి శిశువు స్తన్యము త్రాగినట్లు. ఆ పిల్లల వలన తల్లికి వచ్చు ఆనందమే పరమాత్మకు వినోదము. జీవులందు ఈశ్వరుడు ప్రేమగలవాడు కదా! విష్ణుసహస్రనామములలో "వత్సలుడు అనియు వత్సములు గలవాడనియు" కలదు కదా!

వా॥ : కథం ఈశ్వరాజన్యేషు జీవేషు ఈశ్వరస్య వాత్సల్యమ్?- ఈశ్వరునకు పుట్టని యీ జీవుల మీద ఆయనకు ఏల ప్రేమ కలదు?

ప్ర॥వా॥ : మనుష్యత్వాదివేషేణ జీవానాం ఈశ్వర జన్యత్వాత్, యథా కశ్య పాదిభ్యః ఇంద్రాదయః - కశ్యపాదులకు ఇంద్రాదులు జన్మించినట్లు

జీవులు మనుష్య మొదలగు వేషములతో ఈశ్వరునికి పుట్టిరి కనుక ప్రేమకు అవకాశము కలదు.

వా॥ : **కః ఈశ్వరస్య ప్రథమః పుత్రః?** - ఈశ్వరునికి ప్రథమ పుత్రుడు ఎవరు?

ప్ర॥వా॥ : **హిరణ్యగర్భః** - హిరణ్యగర్భుడు.

వా॥ : **సహి స్రష్టా ఈశ్వర ఏవ** - ఆయన ఈశ్వరుడే, సృష్టి కర్త, కనుక

ప్ర॥వా॥ : **న, ఈశ్వర సృష్టత్వాత్ జీవ ఏవ** - ఈశ్వరునిచే సృష్టింపబడెను కనుక ఆయనయు జీవుడే.

వా॥ : **రుద్రః కః?** - రుద్రుడు ఎవరు?

ప్ర॥వా॥ : **ఈశ్వరస్య పౌత్రః** - ఈశ్వరుని మనుమడు.

వా॥ : **విష్ణుః కః?** - విష్ణువు ఎవరు?

ప్ర॥వా॥ : **ఈశ్వర ఏవ** - ఈశ్వరుడే.

వా॥ : **కస్మాత్?** - ఎందువలన?

ప్ర॥వా॥ : **స్వతంత్రత్వాత్** - స్వతంత్రుడు అగుట వలన.

వా॥ : **విష్ణు విగ్రహోఽపి ప్రాకృత ఏవ** - విష్ణు శరీరము గూడా ప్రకృతి బద్ధమే.

ప్ర॥వా॥ : **న, అప్రాకృత దివ్యమంగలః** - కాదు. అప్రాకృతమయినది, దివ్యమయినది, మంగళమయినది ఆయన శరీరము.

వా॥ : **కుతః?** - ఎందువలన?

ప్ర॥వా॥ : **శాస్త్రాదిభ్యః** - శాస్త్రము మొదలగు వాని వలన.

వా॥ : **కిం శాస్త్రమ్?** - ఏది శాస్త్రము?

ప్ర॥వా॥ : **నారాయణోపనిషదాదికమ్** - నారాయణోపనిషత్తు మొదలైనవి అయిన ఉపనిషత్తులు.

వా॥ : **య ఏవ విష్ణుశరీరే వర్తతే చైతన్యరూపః నారాయణః స ఏవ పాషాణేపి, నారాయణస్య వ్యాపిత్వాత్, ఇతి విష్ణువత్ పాషాణస్యాపి నారాయణత్వ మేవ** - విష్ణు శరీరమున చైతన్యరూపముగా ఏ

నారాయణుడు కలడో ఆయనయే పాషాణమునందున్ను కలడు. నారాయణుడు సర్వవ్యాపి కదా! కనుక విష్ణువలె పాషాణమయినను నారాయణుడే.

ప్రాౢవా॥ : **ఓమ్** - అవును.

వా॥ : ***తర్హి కుతః బ్రహ్మరుద్రాదీనాం అనారాయణత్వమ్?*** - మఱి బ్రహ్మ రుద్రాదులు ఎందుకని నారాయణులు కారు?

ప్రాౢవా॥ : ***జీవాంతర్వ్యాపి చైతన్య దృష్ట్యా తేఽపి నారాయణ భూతా ఏవ*** - జీవుని యందు వ్యాపించిన "చైతన్యం" ప్రకారము వారందఱు నారాయణులే.

వా॥ : ***జీవస్యైవ చైతన్యత్వాత్ కథం తస్మిన్నపి చైతన్యవ్యాప్తిః?*** - జీవుడే చైతన్యము కదా! మఱల అందులో మఱొక నారాయణ చైతన్యము ఎట్లు కుదురును?

ప్రాౢవా॥ : ***యుజ్యత ఏవ, చైతన్య భేదాత్*** - బాగానే కుదురును. చైతన్యముల మధ్యన ఉన్న భేదము వలన.

వా॥ : ***మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః "ఇతి గీతావచనాత్ ఈశ్వరాంశ జీవస్య కథం ఈశ్వరాత్ భేదః"?*** - 'జీవుడు తన అంశయే' అని గీతలో భగవంతుడు చెప్పినాడు కదా. ఈశ్వరుని అంశయే అయిన జీవుడు ఈశ్వరునికన్న భిన్నము కాడు గదా! మఱి చైతన్య భేదము ఎట్లు?

ప్రాౢవా॥ : ***ఈశ్వరస్య ప్రకృతి పురుష విశిష్టత్వేన, జీవస్య ఈశ్వరాంశత్వేపి ఈశ్వరాత్ భేద ఏవ, యథా, దండివః అంశః దండః దండినో భవతి భిన్నః*** - ఈశ్వరుడు ప్రకృతి పురుషులతో కూడియున్నాడు. దండధారి ఒక దండముతో కూడియున్నాడు. దండధారిలో 'దండము' అంశ మయినను, దండధారి కన్న భిన్నమయినట్లు, ఈశ్వరుని కన్న జీవుడు భిన్నుడే. ఈశ్వరునిలోని అంశము.

వా॥ : ***తర్హి దేహివః జీవస్య దేహోపి అంశ ఏవ*** - "దేహి" అయిన జీవుని దేహము గూడా అంశమే.

ప్రాౢవా॥ : ***ఇష్టాపత్తిః*** - అంతే.

వా॥ : ప్రకృతిరపి ఈశ్వరాంశ ఏవ - ప్రకృతి గూడా ఈశ్వరాంశయే.

ప్ర॥వా॥ : ఓమ్ - అవును.

వా॥ : ఈశ్వరస్య ప్రకృతి పురుష వైశిష్ట్యే కిమ్ మానమ్? - ఈశ్వరుడు ప్రకృతి పురుషులతో కలిసియే ఉన్నాడని ఏమి ప్రమాణము?

ప్ర॥వా॥ : "భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ, అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా, అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్. జీవ భూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్' ఇతి గీతావచన మేవ - పంచభూతములు మరియు మనస్సు, బుద్ధి, అహంకారము- ఈ '8' యు కలిసి నా అపరాప్రకృతి. దీనికి భిన్నమయినది పరాప్రకృతి అనబడుజీవము. దీనివలననే ప్రపంచము నడుచు చున్నది.

వా॥ : 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' ఇతి శ్రుతేః, సృష్టేః ప్రాక్ బ్రహ్మ ఏక మేవ అస్తి - "మొదట 'సత్' ఒక్కటే కలదు" అను వేద వాక్యము వలన సృష్టికి ముందు 'బ్రహ్మము' ఒక్కటే కలదని తెలియుచున్నది.

ప్ర॥వా॥ : స్థూల చిదచిత్సృష్టేః ప్రాక్ ప్రలయదశాయాం చ సూక్ష్మ చిదచితాస్త ఏవ. అన్యథా అసత్కార్య వాదాపత్తేః. ప్రలయే వినా జ్ఞానాదికం సర్వముక్తి ప్రసంగాచ్చ. శ్రుతిస్తు సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మసద్భావ ప్రతిపాదనపరా - ప్రలయదశలో స్థూలమయిన చిత్తు అచిత్తులు లేవు. కాని సూక్ష్మ చిదచిత్తులు కలవు. లేనిచో అసత్కార్యవాదము వచ్చిపడును. అనగా అంతకు ముందులేని ప్రపంచము పుట్టినట్లు చెప్పవలసివచ్చును. చెప్పినచో ప్రతి ప్రలయమునందును సర్వజీవులు ముక్తులగుదురని చెప్పవలసి వచ్చును. సృష్టికి పూర్వము బ్రహ్మము మాత్రమేయుండెను అన్న వేదవాక్యమునకు అర్థము 'స్థూల చిదచిత్తులు' లేవనియే. సూక్ష్మ చిదచిత్తులతో గూడిన 'బ్రహ్మము' ఉన్నదని చెప్పుటయే తాత్పర్యము.

వా॥ : అనేన జీవేన ఆత్మనానుప్రవిశ్య - ఇతి శ్రుతేః ఈశ్వర ఏవ జీవః- 'నా స్వరూపమయిన జీవునితో లోపల ప్రవేశించి' - అనువేదమును బట్టి ఈశ్వరుడు జీవుడని తెలియుచున్నది కదా!

ప్రాII వాII : **"జీవేన శరీరేణేతి" శ్రుత్యర్థాత్ న ఈశ్వరో జీవః ఈశ్వరస్యైవ జీవత్వే నియామ్య నియామక భావాసిద్ధేః** - జీవుడు అనే శరీరముతో, అని వేదార్థము చెప్పవలయును. కనుక జీవుడు ఈశ్వర శరీరమే కాని ఈశ్వరుడు కాడు. ఈశ్వరుడే జీవుడైనచో "నియమించువాడు - నియమింపబడువాడు" అను వ్యవహారము నిలువదు. ఈశ్వరుడు నియామకుడు. జీవుడు నియమింపబడువాడు గదా!

వాII : **కిం ఈశ్వరవత్ జీవోప్యేకః?** - ఈశ్వరునివలె జీవుడున్ను ఒక్కడేనా?

ప్రాII వాII : **న** - కాడు

వాII : **కుతః?** - ఎందువలన?

ప్రాII వాII : **"నిత్యో నిత్యానాం చేతనః చేతనానాం, ఏకో బహూనాం యో విదధాతి కామాన్" ఇతిశ్రుతేః సుఖాద్యనుభవవైచిత్ర్యాచ్చ** - నిత్యులలో ఆయన ఒక్కడే నిత్యుడు. చేతనులలో ఆయన ఒక్కడే చేతనుడు అను శ్రుతి వలన సుఖము మొII అనుభవముల మధ్యనున్న భేదము వలన జీవులు అనేకులు.

వాII : **అశబ్ద మస్పర్శ మరూపం - ఇత్యాది శ్రుత్యా ఈశ్వరస్య అశరీరత్వాత్ కథం రామకృష్ణాదయః ఈశ్వరాః?** - "శబ్ద స్పర్శ రూపములు లేనివాడు" అని ఈశ్వరుని గూర్చి వేదము. మఱి శరీర సహితులైన రామకృష్ణాదులు ఈశ్వరులు ఎట్లగుదురు?

ప్రాII వాII : **కేవలేశ్వరస్య తథాత్వేఽపి విశిష్టేశ్వరః శరీర్యేవ** - కేవలము ఈశ్వరుడైన వాడు అశరీరుడే. మిశ్రమము అయిన ఈశ్వరుడు సశరీరుడే. అనగా ప్రకృతి జీవయుక్తుడు అయినవాడు-మిశ్రమము.

వాII : **కిం ద్వావీశ్వరౌ?** - ఈశ్వరులు ఇద్దరు గలరా?

ప్రాII వాII : **న, ఏక ఏవ ఈశ్వరః పరం తు యః ప్రకృతి పురుషాంతరః సః అశరీరః సశరీరశ్చ ఈశ్వరః** - లేదు ఒక్కడే ఈశ్వరుడు. కాని ప్రకృతి పురుషులలో ఉన్నవాడు అశరీరుడు. వారితో కలసి ఉన్నందున సశరీరుడు.

వాII : **కథమ్?** - ఎట్లు?

ప్రా॥వా॥ : **స్వత: పరతశ్చ** - స్వయముగాను (అంతర్యామిగా) ఇతరుల వలలను (ప్రకృతి పురుషుల వలన)

వా॥ : **తర్హి జీవో౽పి స్వత: అశరీర ఏవ** - అయినచో జీవుడున్ను స్వయముగా అశరీరుడే.(శరీరములోని వాడు)

ప్రా॥వా॥ : **సత్యమ్** - నిజమే.

వా॥ : **తర్హి, అస్మదాది శరీరగత: పురుష ఇవ రామకృష్ణాది శరీరగతోపి పురుషో జీవ ఏవ** - అయినచో మన శరీరములందలి పురుషుని వలె రామకృష్ణాది శరీరములందలి పురుషుడున్ను జీవుడే కదా!

ప్రా॥వా॥ : **న, ఈశ్వర ఏవ** - కాదు. ఈశ్వరుడే.

వా॥ : **కుత:?** - ఎందుకని?

ప్రా॥వా॥ : **సర్వజ్ఞత్వాది గుణయోగాత్** - 'సర్వజ్ఞత' మొ॥ గుణములు గలవు కనుక.

వా॥ : **కథం పరిచ్ఛిన్నస్య తస్య ఈశ్వరత్వమ్?** - ఖండ స్వరూపుడైన జీవునకు ఈశ్వరత్వము రాదు. రామకృష్ణ శరీరములలో పరిమితులు గదా!

ప్రా॥వా॥ : **అపరిచ్ఛిన్న ఏవ** - రామకృష్ణ శరీరగత జీవుడు అఖండుడే.

వా॥ : **కథం దేహిన: పరిచ్ఛేదాభావ:?** - దేహధారి అయిన జీవునకు పరిమితి లేకపోవుట ఎట్లు?

ప్రా॥వా॥ : **యది దేహే ఏకస్మిన్ ఏవాస్తి తర్హి, దేహోత్తస్య పరిచ్ఛేద: అస్తు, నతు తథా, కింతు సర్వత్రాస్తీతి** - దేహమునందు ఒక్కదాని యందే ఉన్నచో దేహము వలన పరిమితి ఏర్పడును. కాని అట్లు లేదు. కాని సర్వత్ర ఉన్నది.

వా॥ : **జీవో౽పి సర్వత్ర అస్త్యేవ** - జీవుడు సర్వత్ర ఉన్నాడు.

ప్రా॥వా॥ : **న** - కాదు.

వా॥ : **కుత:?** - ఎందువలన?

ప్రా॥వా॥ : **అచేతనే జీవాదర్శనాత్** - చైతన్యము లేనిదానియందు జీవుడు కనబడకపోవుట వలన

వా॥ : **ఈశ్వరోఽ పి నాస్తి అచేతనే** - అచేతన పదార్థమునందు ఈశ్వరుడు కూడా లేడు.

ప్ర॥వా॥ : **అస్త్యేవ, స్తంభాత్ నరసింహావిర్భావ స్మరణాత్** - ఉన్నాడు. స్తంభము నుండి నరసింహస్వామి ఆవిర్భవించెను కదా!

వా॥ : **యః స్తంభాదుద్భూతః నరసింహః స చేతన ఏవ, రామకృష్ణాదివత్ ఇతి చేతన ఏవ నరసింహ దేహే అస్తి ఈశ్వరః, న అచేతనే** - స్తంభము నుండి ఉద్భవించిన నరసింహుడు రామకృష్ణులవలె చేతనుడే. కనుక నరసింహశరీరము చేతనమే. అందు ఈశ్వరుడు కలడు. అచేతనము నందు కాదు. అనగా స్థంభమునందు కాదు.

ప్ర॥వా॥ : **ఈశ్వరస్య పరోక్షత్వాత్ అచేతనే తస్య అనుపలబ్ధిః** - ఈశ్వరుడు పరోక్షమయిన వాడు కనుక అచేతనమునందు ఆయన దొఱకడు.

వా॥ : **చేతనేఽ పి తస్య అనుపలబ్ధిరేవ** - చేతనమునందు గూడా ఆయన దొఱకడు.

ప్ర॥వా॥ : **బాఢమ్** - అవును

వా॥ : **యది అనుపలభ్యమానోపి ఈశ్వరః అచేతనేస్తి తర్హి జీవోపి అస్త్యేవ** - దొఱకకపోయినప్పటికి అచేతనము నందు ఈశ్వరుడు కలడు అన్నచో జీవుడు గూడా ఉన్నట్టే గదా!.

ప్ర॥వా॥ : **న** - లేదు

వా॥ : **కుతః?**- ఎందువలన?

ప్ర॥వా॥ : **జీవస్య అచేతనే మృదాదౌ 'అహ' మిత్యనుపలంభాత్ ప్రత్యక్షో హి జీవః స్వస్య స్వయమ్, నహి కోపి జీవః మృదాదౌ 'అహం వర్తే' ఇతి మన్యతే దేహవత్** - అచేతనమయిన మట్టి మొ॥ వానియందు నేను అను జీవుడు లేడు గదా. దేహమునందు నేను అను జీవుడు కలడు కదా! అట్లు అచేతనములందు లేడు. కనుక అచేతనములందు జీవుడు లేడు.

వా॥ : **దేవదత్త జీవవత్, రామః ఈశ్వరోపి భార్యావియోగదుఃఖ మను భూతవాన్ ఇతి కథం వ్యాపిత్వం రామస్య? నహి వ్యాపకస్య కేనచిత్**

**క్వచిదపి వియోగః ?** - దేవదత్తుడనే సాధారణ బద్ధ జీవుని వలె, రాముడు ఈశ్వరుడైనను భార్యావియోగదుఃఖమును అనుభవించెను. అట్టిచో రాముడు వ్యాపించిన ఈశ్వరుడు కాడని చెప్పవలెను. సర్వవ్యాపి అయినచో భార్యతో వియోగమే ఉండదు కదా! భార్య ఉన్న చోట తాను వ్యాపించియున్నట్లే కదా!. కనుక రాముడు ఈశ్వరుడు కాడు.

ప్ర॥వా॥ : **లీలావశాత్, "స్త్రీ సంగినాం గతిరితి ప్రథయన్ చచార" ఇతి ఉక్తం భాగవతే. "రామో న గచ్ఛతి న తిష్ఠతి నానుశోచతి" ఇతి ఉక్తం అధ్యాత్మరామాయణే చ** - వియోగదుఃఖము మొదలగునది అభినయ లీలమాత్రమే. స్రీ సంగము గలవారి గతి యిట్లుండును అని అభినయించెనని భాగవతములో చెప్పబడినది. "రాముడు క్రియా రహితుడు నడచుట లేదు. నిలుచుట లేదు, ఏడ్చుట లేదు" అని అధ్యాత్మ రామాయణమునందున్ను గలదు.

వా॥ : **జీవస్యాపి లీలయైవ వియోగః** - జీవునకు గూడా ఈ వియోగము లీలా వినోదమే.

ప్ర॥వా॥ : **న, కర్మణైవ** - లేదు. జీవునకు పుణ్యపాపాదికర్మ ఫలితముగా వియోగము కలుగును.

వా॥ : **ఈశ్వరస్యాపి రామస్య లీలయా జీవవత్, భార్యా వియోగః ఇత్యస్య కోర్థః?** - ఈశ్వరుడైనను రామునకు జీవునకు వలె భార్యతో వియోగము విలాసముగా ఏర్పడినది. అనగా ఏమి భావము?

ప్ర॥వా॥ : **సర్వవ్యాపీ నారాయణః లీలయా మానుషం దేహ మాశ్రిత్య భార్యా వియోగం అనుభవతీతి**- సర్వవ్యాపి అయిన నారాయణుడు జీవునివలె మనుష్యదేహమునాశ్రయించి భార్యావియోగమును అనుభవించెనని తాత్పర్యము.

వా॥ : **కథం లీలయాపి వ్యాపకస్య వియోగః?** - వ్యాపకుడు అనగా సర్వవ్యాపి అయిన ఈశ్వరునికి వినోదమునకైనను వియోగము ఎట్లు తటస్థించును? (సీత ఉన్నచోట గూడా వ్యాపించియే యున్నాడు కదా)

ప్ర॥వా॥ : **ఈశ్వరలీలా హి నాతి శంకనీయా** - ఈశ్వరుని క్రీడ కదా. మరీ అంతలోతుగా శంకింపలసిన అవసరము లేదు.

వా॥ : **హంత! తర్హి, యద్య పరిచ్ఛిన్నోపి లీలయా పరిచ్ఛిన్నః భవతి, ఆనందమయోపి దుఃఖీ, తర్హి ఈశ్వరోపి లీలయా జీవో భవత్యేవ** - అఖండస్వరూపుడై సర్వవ్యాపి అయిన ఈశ్వరుడు "లీల" కొఱకై ఖండ స్వరూపుడై, ఆనందమయుడైనను దుఃఖమును స్వీకరించెను గదా!. అట్టి ఈశ్వరుడు అదే లీలగా జీవుడు కూడా కావచ్చును గదా!.

ప్ర॥వా॥ : **జీవో న భవతి. కింతు జీవవత్ భవతి. యథా నటః రాజవత్, యథా వా రాజా రక్షక పురుషవత్** - ఈశ్వరుడు జీవుడు కాడు. జీవుని వలెనే నటించును. నటుడు రాజువలె, రాజు పోలీసు వలె నటించునట్లు. అంతే.

వా॥ : **వత్ శబ్దస్య కః అర్థః?** - "వలె" అనగా అర్థమేమి?

ప్ర॥వా॥ : **వస్తుతో న భవతి. కింతు తథా నటవమేవేతి**- 'వలె' అనగా 'అసలు' కాదు అలా నటించాడు అని అర్థం. (జీవుడు నిజంగా కాదు జీవుని వలె నటించాడు)

వా॥ : **తర్హి ఈశ్వరః రామకృష్ణాది దేహానివ దేవమనుష్యాది దేహానపి స్వీకృత్య సంసరన్నివ నటతి ఇతి అభ్యుపగమ్య, ఈశ్వరాతిరిక్త జీవాభ్యుపగమ వాదః త్యజ్యతామ్** - అట్లయితే ఈశ్వరుడే రామ కృష్ణాది దేహములను ధరించినట్లు దేవమనుష్య మొదలగు దేహములను గూడా ధరించి "సంసారి" వలె నటించుచున్నాడు. అని అంగీకరించుము. తద్వారా ఈశ్వరుడు తప్ప వేఱే జీవులు లేరని అంగీకరింపుము. కనుక ఈశ్వర భిన్నంగా జీవులు కలరు అను వాదమును వదలుము.

ప్ర॥వా॥ : **దేవాది దేహేషు 'అహం' ఇతి అభిమన్యమానస్య ప్రత్యక్షస్య జీవస్య దురపలాపత్వాత్** - దేవ, మొదలగు దేహములందు 'నేను' అని అభిమానము కల జీవుడు ప్రత్యక్షముగా కనబడుచున్నాడు కదా! వానిని లేడనుటయెట్లు?

వా॥ : **సోఽభిమానీ ఈశ్వర ఏవ** - అతడు వేఱే జీవుడు కాడు. దేహాభిమానిగా ఉన్న ఈశ్వరుడే.

ప్ర॥వా॥ : న - కాదు.

వా॥ : **కుతః?** - ఎందుకని?

ప్ర॥వా॥ : **సంసార్యహం జీవః నేశ్వరః ఇతి అనుభవాత్** - నేను సంసారి అయిన జీవుడను, ఈశ్వరుడును కాను అనుభవము కలదు కదా!

వా॥ : **రామస్యాపి తాదృశ ఏవ అనుభవః అస్తి** - రామునకును అట్టి అనుభవము కలదు కదా!

ప్ర॥వా॥ : **నాస్తి** - లేదు

వా॥ : **కుతః?** - ఎందువలన?

ప్ర॥వా॥ : **పరహృదయస్య అప్రత్యక్షత్వేన త్వయా రామానుభవస్య దుర్జ్ఞేయత్వాత్** - ఇతరుల మనస్సు మనకు తెలియదు కదా! కనుక రాముని అనుభవము మనము ఎట్లు చెప్పగలము?

వా॥ : **'ఆత్మానం మానుషం మన్యే' ఇతి రామవాక్యాదేవ తదనుభవమనుమినోమి** - రాముడే రామాయణములో చెప్పెను కదా!. తాను దశరథపుత్రుడు అని, మనిషి అని. దానిని బట్టి రాముని అనుభవము మనము ఊహించెదము.

ప్ర॥వా॥ : **తద్వాక్యస్య లీలా ప్రయుక్తత్వాత్** - రాముడు ఆ మాటను 'లీల'గా చెప్పెను. కనుక అది రాముని వాస్తవ అనుభవము కాదు.

వా॥ : **పరిచ్ఛిన్నః సంసార్యపి రామః కృష్ణశ్చ ఈశ్వరః బ్రహ్మ రుద్రాదయస్తు జీవాః ఇత్యత్ర కిం వినిగమకమ్?** - అయ్యా, ఖండుడై అవతరించిన సంసారిగానున్న రాముడు గాని కృష్ణుడు గాని ఈశ్వరుడేయని, మఱి అట్లురాని ప్రత్యక్ష దేవతలయిన బ్రహ్మ రుద్రాదులు జీవులని ఏమిటి ప్రమాణము?

ప్ర॥వా॥ : **స్వాభావిక జ్ఞానబల క్రియాశక్త్యతిశయవత్త్వమ్** - సహజమైన జ్ఞానబల క్రియాశక్తులు అధికముగా కలిగియుండుట కారణముగా రాముడు కృష్ణుడు ఈశ్వరులు.

వా॥ : **కుతః పరిచ్ఛిన్నస్య సంసారిణః తద్వత్త్వమ్?** - పరిమితుడై సంసారిగా నున్న వానికి అట్టి శక్తులు ఎట్లు అధికముగా గలవు?

ప్ర॥వా॥ : **రామగతపరిచ్ఛేదసంసారయోః లీలామయత్వాత్ వస్తుతః అపరిచ్ఛిన్నః అసంసార్యేవ రామః** - ఈశ్వరుడు రామునిగా అవతరించుట లీల. ఆయన ఖండ స్వరూపము. సంసారము= లీలలే. నిజమునకు రాముడు అఖండుడు, సంసార రహితుడున్ను. కనుక ఈశ్వరుడే.

వా॥ : **తర్హి ఈశ్వరస్య రామత్వాదికం మిథ్యైవ**-అయినచో, ఈశ్వరుని 'రామ' దశ మిథ్యయే

ప్ర॥వా॥ : **న మిథ్యా, కింతు లీలా**-మిథ్య కాదు. విలాసము

వా॥ : **కస్మాత్ ?** - ఎందువలన?

ప్ర॥వా॥ : **అర్థక్రియాకారిత్వాత్. అర్థక్రియాశూన్యం శుక్తిరజతాదికం హి మిథ్యా. రామకృష్ణాదయస్తు సేతుబంధన గోవర్ధనోద్ధరణాద్యర్థ క్రియాకారిణ ఏవేతి సత్యా ఏవ** - ప్రయోజనశూన్యమయినవి మిథ్యలు. ప్రయోజన సహితమయినవి మిథ్యలు కావు. తగరం చూసి వెండి అనుకోవటం మిథ్య. ప్రయోజనం లేదు కనుక. రామకృష్ణాదులు మిథ్యలు కారు. వారు సేతుబంధము, గోవర్ధనోద్ధరణము మొ॥ ప్రయోజన క్రియలు చేసిరి కనుక వారి దశలు సత్యములే.

వా॥ : **కథం ఆనందమయేశ్వరస్య దుఃఖిత్వమ్ సత్యమ్?** - వారి లీలలు సత్యము అంటివి గదా. ఆనందమయుడైన ఈశ్వరుడు సీతా వియోగాది దుఃఖమయుడుగా కనబడుట కూడా సత్యమేనా?

ప్ర॥వా॥ : **లీలయా సర్వసంభవాత్** - క్రీడలో అన్నియు సంభవమే

వా॥ : **యది ఈశ్వరః పరోక్షః తర్హి రామాదయః ప్రత్యక్షత్వాత్ నేశ్వరాః**- ఈశ్వరుడు పరోక్షము కదా! రాముడు మొ॥వారు ప్రత్యక్ష శరీరులు కదా. వారెట్లు ఈశ్వరులు కాగలరు?

ప్ర॥వా॥ : **రామాది దేహ ప్రత్యక్షేపి తదంతర్గతేశ్వరచైతన్యస్య అప్రత్యక్షత్వాత్ ఈశ్వరత్వమ్** - రామాదుల శరీరములే ప్రత్యక్షములు. కాని ఆ

శరీరములందలి ఈశ్వర చైతన్యము ప్రత్యక్షము కాదు కనుక వారు ఈశ్వరులే.

వా॥ : తర్హి దేవాది దేహాంతర చైతన్యస్య అప్రత్యక్షత్వాత్ ఈశ్వరత్వమ్ - అదే విధముగా దేవతలు మొ॥ ఇతర దేహములలోని చైతన్యము గూడా ప్రత్యక్షముగా కనబడదు కనుక వారు గూడా ఈశ్వరులే కావచ్చు గదా!

ప్ర॥వా॥ : న, పరోక్షాపరిచ్ఛిన్న చైతన్యస్యైవ, ఈశ్వరత్వాత్, ప్రత్యక్షం అప్రత్యక్షం వా చైతన్యం పరిచ్ఛిన్నం జీవ ఏవ-అలాకాదు. పరోక్షము అఖండము అయిన చైతన్యమే ఈశ్వరుడు. ప్రత్యక్ష మయినను కాకున్నను ఖండమయిన చైతన్యము జీవుడే

వా॥ : లీలయైన జీవస్యాపి పరిచ్ఛిన్నత్వమ్-జీవుడు గూడా 'లీల'గానే ఖండ చైతన్యము అయినాడు.

ప్ర॥వా॥ : న, స్వత ఏవ-కాదు. జీవుడు లీలతో గాక, సహజముగానే ఖండ స్వరూపుడు.

వా॥ : కుతః? - ఎందువలన?

ప్ర॥వా॥ : సర్వవ్యాప్త్యక్షమత్వాత్ - జీవునకు సర్వవ్యాపిత్వము సాధ్యము కాదు కదా!

వా॥ : కథ మిదం జ్ఞాయతే? - జీవుడు సర్వవ్యాపి కాడని ఎట్లు తెలియును?

ప్ర॥వా॥ : జీవస్య స్వానుభవాదేవ. నహి జీవః దేశాంతరస్థం కాలాంతరస్థం వా వేద, వ్యాపిత్వాభావాత్-స్వానుభవమే. తాను సర్వవ్యాపి అయినచో '3' కాలములందు, ఇతర దేశములందు జరుగు విషయములు తెలియును కదా. కాని తెలియుట లేదు.

వా॥ : ఈశ్వరస్యాపి నాస్తి సర్వానుభవః-ఈశ్వరునకు కూడా అన్ని అనుభవములు లేవు.

ప్ర॥వా॥ : అస్తి-ఉన్నవి.

వా॥ : కుతః?-ఎందువలన?

ప్ర॥వా॥ : వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున. 'భవిష్యాణి చ భూతాని

మాం తు వేద న కశ్చన' ఇతి గీతావచనాత్-'అర్జునా! జరిగినవి నాకు తెలియును. కాని నేను ఎవరికిని తెలియను' అని కృష్ణుడు చెప్పిన గీతావచనము వలన ఈశ్వరునకు సర్వానుభవములు గలవని తేలును.

వా॥ : యది పరిచ్ఛిన్నః కృష్ణో బ్రహ్మ తర్హి అహమపి బ్రహ్మైవ- ఖండ స్వరూపుడైన కృష్ణుడు బ్రహ్మమయినచో నేనును బ్రహ్మనే.

ప్ర॥వా॥ : నత్వం బ్రహ్మాసి. కృష్ణ ఏవ బ్రహ్మ-నీవు బ్రహ్మము కావు. కృష్ణుడే బ్రహ్మము.

వా॥ : కుతః?-ఎందుకని?

ప్ర॥వా॥ : అపరిచ్ఛిన్నత్వాత్ కృష్ణస్య-కృష్ణుడు అఖండస్వరూపుడు కనుక

వా॥ : కథం తత్ జ్ఞాయతే?-ఎట్లు తెలిసినది?

ప్ర॥వా॥ : విశ్వరూప ప్రదర్శనాత్ కృష్ణస్య-కృష్ణుడు విశ్వరూపప్రదర్శనము చేయుట వలన

వా॥ : తద్ధి దేహవ్యాప్తిం గమయతి-అది ఈశ్వరుని దేహము యొక్క వ్యాప్తిని తెలుపును. ఈశ్వరుని వ్యాప్తిని తెలుపదు.

ప్ర॥వా॥ : చైతన్య వ్యాప్తి పూర్వికైవ దేహవత్వ్యాప్తిః-చైతన్య వ్యాప్తితో కలసియే దేహ వ్యాప్తి జరుగును. కనుక విశ్వరూప ప్రదర్శనలో చైతన్య వ్యాప్తి జరిగినది.

వా॥ : తర్హి హనూమానపి అపరిచ్ఛిన్న ఏవ. వ్యాపిదేహత్వాత్ -అయితే హనుమంతుడు కూడా అఖండస్వరూపుడే. ఆయన దేహము కూడా వ్యాపక శక్తి కలది కదా!.

ప్ర॥వా॥ : న, హనూమద్దేహస్య విశ్వాత్మకత్వాభావాత్. సర్వం హి విశ్వం ఈశ్వరస్య ఏకస్యైవ శరీరమ్-హనుమంతుని దేహము విశ్వ రూపమయినది కాదు. విశ్వమంతయు ఒక్క ఈశ్వరునికి మాత్రమే శరీరము.

వా॥ : కస్మాత్?-ఎందువలన?

ప్ర॥వా॥ : సహస్ర శీర్షా పురుషః- ఇత్యాది శ్రుతేః 'విష్టభ్యాహమిదం కృత్స్నం

ఏకాంశేన స్థితో జగత్ ఇతి గీతావచనాచ్చ-అందుకు 2 ప్రమాణములు గలవు. 1. శ్రుతి-పురుషుడు సహస్రశిరస్సులు గలవాడు మొ॥. 2. గీత-ఈ ప్రపంచమునంతను నేనొక్కడనే వ్యాపించియుంటిని" అని

వా॥ : చైతన్య మేక మేవ భేదకాభావాత్- చైతన్యము ఒక్కటే. దానికి భేదము కలిగించు అంశములు లేవు. (కనుక జీవ చైతన్యము ఈశ్వర చైతన్యము అను భేదము లేదు)

ప్ర॥వా॥ : న, భేదక సద్భావాత్-కాదు. భేదము కలదు. భేదము కలిగించు అంశము కలదు.

వా॥ : కిం తత్ భేదకమ్?-ఏమిటి అది?

ప్ర॥వా॥ : ప్రకృతి రేవ-ప్రకృతియే చైతన్యమునందు భేదము కలిగించును.

వా॥ : కథమ్?-ఎట్లు?

ప్ర॥వా॥ : యత్ప్రకృతిం సర్వాం అభివ్యాప్య స్థితం, తదీశ్వర చైతన్యమ్ యత్ ప్రకృత్యేకదేశస్థం తత్ జీవ చైతన్యమితి -ప్రకృతి నంతటిని వ్యాపించి నిలచినది ఈశ్వర చైతన్యము. ప్రకృతిలో కొంత మేఱకు వ్యాపించినది జీవ చైతన్యము.

వా॥ : యత్ర జీవ చైతన్యం తత్ర ప్రకృతిదేశే న ఈశ్వరవ్యాప్తిః ఇతి కథం సర్వవ్యాపిత్వం ఈశ్వరస్య?- ప్రకృతిలో జీవ చైతన్యము ఎంత మేఱకు వ్యాపించినదో అంత మేఱకు ఈశ్వర చైతన్యము లేనట్లే కదా!. మఱి ఈశ్వర చైతన్యము సర్వవ్యాపి ఎట్లగును?

ప్ర॥వా॥ : జీవేఽపి ఈశ్వర సత్త్వాత్ జీవవ్యాప్తః ప్రకృత్యేక దేశోపి ఈశ్వర వ్యాప్త ఏవ - జీవునియందున్ను ఈశ్వరుడు ఉన్నందున జీవుడు వ్యాపించిన ప్రకృతి భాగములందున్ను ఈశ్వరుడు వ్యాపించి యుండును.

వా॥ : సర్వగతత్వాత్ అనంతస్య 'స ఏవాహమవస్థితః' ఇతి ప్రహ్లాద వచనాత్ జీవేశ్వరాభేదః- అనంతుడు అయిన ఈశ్వరుడు సర్వవ్యాప్తుడు కనుక, 'ఆయనయే నేను' అని ప్రహ్లాద వచనమును బట్టి 'జీవుడే ఈశ్వరుడు' అని ఏల చెప్పరాదు?

ప్ర॥వా॥ : **జీవగతత్వేన జీవశరీరకః ఈశ్వరః జీవ ఏవ. యథా మనుష్య శరీర గతత్వేన జీవః మనుష్యః ఇతి తదర్థాత్**- ఈశ్వరుడు జీవునియందు న్ను వ్యాపించియున్నాడు కనుక జీవ శరీరము గల ఈశ్వరుడు జీవుడే. ఎలాగంటే మనుష్యశరీరమును ధరించిన జీవుడు 'మనిషి' అయినట్లు.

వా॥ : **కా ప్రకృతిః?**-ప్రకృతి అనగానేమి?

ప్ర॥వా॥ : ప్రధానమ్-ప్రధానమను పేరు గలది

వా॥ : **తద్ధి 'ఈక్షతేర్నా శబ్దమ్" ఇతి సూత్రకారైః నిరాకృతమ్**-'ఈక్షతే - చూచుచున్నది అను మాటలో 'చూచు' అను క్రియకు జడ పదార్థము కర్త కాలేదు. కనుక ప్రపంచ కారణముగా అచేతనమయిన ప్రధానము అనగా ప్రకృతి నిరాకరింపబడినది. కనుక ఆ సూత్రమును బట్టి ప్రకృతి లేదు.

ప్ర॥వా॥ : **అబ్రహ్మాత్మక స్వతంత్ర ప్రధాన నిరాకరణ పరమ్ తత్ సూత్రమ్ బ్రహ్మాత్మికా తు ప్రకృతిః అస్త్యేవ, గీతాప్రామాణ్యాత్**-బ్రహ్మ చైతన్య సంబంధము లేక ప్రకృతి స్వతంత్రముగా జగత్కారణము కాలేదు అని చెప్పుటయే సూత్ర పరమార్థము. బ్రహ్మమయమయిన ప్రకృతి ఉన్నది. అందుకు 'గీత' ప్రమాణము.

వా॥ : **కథం ప్రకృతేః బ్రహ్మాత్మకత్వమ్?** -ప్రకృతి బ్రహ్మమయమా? అదెట్లు?

ప్ర॥వా॥ : **బ్రహ్మశరీరత్వాత్. శరీరస్య శరీరీ ఖలు ఆత్మా**-ప్రకృలి బ్రహ్మకు శరీరము. శరీరమునకు 'శరీరి' అనగా జీవుడు ఆత్మయే కదా! అట్లు ప్రకృతి శరీరమునకు బ్రహ్మయే ఆత్మ.

వా॥ : **ఆత్మా జీవ ఏవ** - ఆత్మ జీవుడే గదా!

ప్ర॥వా॥ : **న, శరీరం ప్రతి జీవః ఆత్మా, జీవం ప్రతి ఈశ్వరః ఆత్మా, అత ఏవ ముఖ్యః ఆత్మా ఈశ్వర ఏవ పరమాత్మా ఇతి ఉచ్యతే**-లేదు. శరీరమునకు జీవుడు ఆత్మ. జీవునకు ఈశ్వరుడు ఆత్మ. కనుకనే ముఖ్యమయిన ఆత్మ ఈశ్వరుడు. ఆయనయే 'పరమాత్మ'

వా॥ : **జీవ ఏవ పరమాత్మా. 'పరమాత్మేతి చాప్యుక్తః' ఇతి గీతావచనాత్** - జీవుడే పరమాత్మ. 'పరమాత్మ అనియు చెప్పబడెను' అను గీతావాక్యము ప్రమాణము.

ప్రా॥వా॥ : **దేహాత్మాద్యపేక్షయా తత్ర జీవస్య పరమాత్మత్వముక్తమ్ నిరపేక్షం తు పరమాత్మత్వం ఈశ్వరస్యైవ** -'దేహము-ఆత్మ' వీటి దృష్ట్యా జీవుని పరమాత్మగా చెప్పిరి అంతే. సహజముగా మాత్రము ఈశ్వరుడే పరమాత్మ.

వా॥ : **ఆత్మ పరమాత్మభేదే న ప్రమాణం పశ్యామః**-'ఆత్మ-పరమాత్మ' వీని మధ్య భేదమునకు ప్రమాణము ఏమి?

ప్రా॥వా॥ : **శృణు తత్త్వం ప్రవక్ష్యామి హ్యాత్మానాత్మ పరాత్మనామ్' ఇత్యాది వచనాన్యేవ ప్రమాణాని**-'ఆత్మ-అనాత్మ-పరమాత్మ'ల యొక్క తత్వమును చెప్పెదను వినుము' అను వాక్యములు మొ॥ ప్రమాణము.

వా॥ : **ఘటాకాశ మహాకాశవత్ ఆత్మ పరమాత్మాభేద ఏవ**-'కుండలోని ఆకాశము-అసలు ఆకాశము' వీని మధ్య భేదము లేనట్లు, ఆత్మ-పరమాత్మల మధ్య భేదము లేదు.

ప్రా॥వా॥ : **న, ఘటాకాశస్య సోపాధికత్వాత్ ఆత్మనః నిరుపాధికత్వాత్ చ ఉపాధ్య ప్రయుక్త ఏవ ఆత్మ పరమాత్మ భేదః**-భేదము కలదు. కుండలోని ఆకాశమునకు కుండ ఉపాధి. ఆత్మకు ఉపాధి లేదు. కనుక ఆత్మ పరమాత్మ భేదము కేవలము 'ఉపాధి' (ఆధారము) వలన వచ్చినది కాదు. (సర్వజ్ఞత్వాది ఇతర లక్షణముల వలన వచ్చినది)

వా॥ : **'తత్త్వమసి' ఇతి శ్రుత్యా కథం జీవేశ్వరాద్వైతం ప్రతిపాద్యతే**- 'ఆ బ్రహ్మము నీవు' అను వేదము జీవేశ్వరులకు అభేదమును అద్వైతమును చెప్పుచున్నది కదా. దానికి ఏమనెదవు?

ప్రా॥వా॥ : **శరీరశరీరిభావ విశిష్టాద్వైతమేవ ప్రతిపాద్యతే. నతు శుద్ధాద్వైతమ్**-శరీరశరీరిభావముతో గూడిన అద్వైతమే చెప్పబడినది. శుద్ధాద్వైతము కాదు. 'నేను శరీరమును - ఈశ్వరుడు శరీరి' అనుభావముతో

అద్వైతము, విశిష్టాద్వైతము, 'నేనే ఈశ్వరుడను' అను భావము శుద్ధాద్వైతము.

వా॥ : ***విశిష్టాద్వైతమితి పదం అశ్రౌతమ్***-'విశిష్టాద్వైతమ్' అను పదము వేదములో కనబడలేదు. వేదవిరుద్ధము కదా?

ప్ర॥వా॥ : ***పదస్య అశ్రౌతత్వేపి అర్థః శ్రౌత ఏవ*** - పదము వేదములో లేక పోయినను ఆ అర్థము వేదములోనున్నది కదా!

వా॥ : ***కస్మాత్?*** - దేనిని బట్టి ఆ అర్థము?

ప్ర॥వా॥ : ***యస్మాత్ "ద్వాసుపర్ణా-" ఇత్యాది శ్రుతిభిః భేదః 'తత్త్వమసి' ఇత్యాదిభిః అభేదః చ ప్రతిపాద్యతే, తస్మాత్*** - 'రెండు గరుడ పక్షులు-మొ॥వేదము వలన జీవాత్మ పరమాత్మల మధ్య భేదము, 'నీవే ఆ బ్రహ్మము' అను వేదవాక్యములచే జీవాత్మ పరమాత్మల మధ్య అభేదము చెప్పబడినది. అందువలన.

వా॥ : ***జీవేశ్వరయోః శరీరశరీరిభావ విశిష్టాద్వైతమితి జ్ఞానేవ కిం ఫలమ్?*** -జీవ ఈశ్వరులకు అనగా జీవాత్మ పరమాత్మలకు 'శరీరశరీరిభావ విశిష్టాద్వైతము కలదు'-అను జ్ఞానము వలన ప్రయోజనము ఏమి గలదు?

ప్ర॥వా॥ : ***ఈశ్వర శరీరత్వాత్ జీవః ఈశ్వర పరతంత్రః, ఈశ్వర నియామ్యః ఈశ్వరశేషః ఇతి జ్ఞానేవ జీవస్య స్వాతంత్ర్యాభిమాననివృత్తిః. స్వరక్షా భరస్య సర్వస్య ఈశ్వరాయత్తత్వేవ స్వస్య స్వరక్షా ప్రయాసా భావః ఈశ్వరానుగ్రహార్థం ఈశ్వరకైంకర్యకరణం తదనుగ్రహాత్ సర్వసంసారనివృత్తిః, పరమపద ప్రపత్తిశ్చ ఇతి*** - ఎవరి శరీరము వారికి అధీనము, వారి చెప్పుచేతలలో ఉండును. జీవుడు ఈశ్వరుని శరీరము. కనుక ఈశ్వరుని 'అదుపు-ఆజ్ఞ'లలో నుండును. అది ఈశ్వర శేషము--ఈ విషయము తెలియుట వలన జీవులకు అహంకారము తొలగును. తాను స్వతంత్రుడను కాను అని అర్థమగును. తన రక్షణ అంతయు ఈశ్వరుని పైనున్నదని గ్రహించును. అందువలన తన రక్షణ కొఱకు తను శ్రమపడవలసిన అవసరము తప్పిపోవును. ఈశ్వరానుగ్రహము కొఱకు ఈశ్వర

కైంకర్యము చేయును. ఈశ్వరానుగ్రహము చేత సంసారబంధములు తొలగును. అనంతరము దివ్యధామము చేరును.

వా॥ : భిన్నేశ్వర జ్ఞానాత్ భవతి భయమధికమ్-'ఈశ్వరుడు వేఱు- తాను వేఱు' అను భావము వలన భయము ఏర్పడును గదా!.

ప్ర॥వా॥ : న, తదననుసరణాదేవ భయమ్, నతు తత్సేవనాత్. భిన్నం హి రాజానం సంసేవ్య సేవకః ప్రాప్నోతి ధనమ్ - అనుసరింపక పోవుట వలన భయము కలదు కాని ఆయనను సేవించుటవ వలన కాదు. భిన్నముగ నున్నను రాజును సేవించిన సేవకునకు ధనము లభించును గదా!

వా॥ : పరోక్షః ఈశ్వరస్సేవాయా అవిషయః - ప్రత్యక్షముగా దొఱకని ఈశ్వరుని సేవించుట ఎట్లు సాధ్యము?

ప్ర॥వా॥ : అత ఏవ శ్రీరంగనాయకాద్యర్చారూప స్వీకారః ఈశ్వరస్య భక్తానుకంపార్థమ్ - కనుకనే, భగవంతుడు భక్తులపై జీవులపై దయతో 'శ్రీరంగనాయక స్వామి' మొదలైన అర్చామూర్తులుగా వెలసినాడు.

వా॥ : 'యో మాం సర్వేషు భూతేషు సంతమాత్మాన మీశ్వరమ్. హిత్వార్చాం భజతే మౌఢ్యాత్ భస్మన్యేవ జుహోతి సః' ఇతి భాగవతాత్ అర్చార్చనం వ్యర్థమేవ - 'సమస్త భూతములయందు అంతర్యామిగా నున్న నన్ను వదలి 'అర్చావిగ్రహములను పూజించుట, బూడిదలో హోమము చేయుటయే' అను భాగవత వాక్యమును బట్టి అర్చామూర్తుల అర్చన వ్యర్థము కదా!

ప్ర॥వా॥ : న, 'సర్వవ్యాపీ ఈశ్వరః' ఇతి జ్ఞానాభావ ప్రయుక్తస్యైవ అర్చా భజనస్య వైయర్థ్యమ్, కథ మన్యథా సర్వవ్యాపీశ్వరస్య హానం సంభవతి, యేన తద్వారణాయ 'ఈశ్వరం హిత్వా' ఇతి ఉచ్యేత - 'ఈశ్వరుడు సర్వవ్యాపి' అను భావము లేకుండగ చేయు విగ్రహారాధన వ్యర్థమని చెప్పుటయే ఆ మాటల తాత్పర్యము. లేనిచో సర్వవ్యాపి అయిన భగవంతుని 'వదలి' పూజించుట సాధ్యముకాదు గదా! కనుక 'వదలుట' అనగా 'సర్వవ్యాపి' అను భావమును వదలుటయే. అది నిషిద్ధము. విగ్రహారాధన వ్యర్థము కాదు.

వా॥ : **కథం కృత్రిమ పాషాణాది విగ్రహాణాం ఈశ్వరత్వమ్?** - తయారు చేయబడిన శిలావిగ్రము మొదలైన వానికి ఈశ్వరత్వము ఎట్లు సాధ్యము.

ప్ర॥వా॥ : **ఈశ్వరాధిష్ఠితత్వాత్** - ఈశ్వరుడు వానియందు ఉండుట వలన,

వా॥ : **సర్వమపి తర్హి పూజ్యమేవ** - అప్పుడు అన్నియు పూజ్యములే అంతట ఈశ్వరుడు ఉన్నాడు కదా!

ప్ర॥వా॥ : **'న' ఇతి కో వదేత్? అత ఏవ హి 'వాసుదేవస్సర్వమితి' స మహాత్మా సుదుర్లభః' ఇతి గీతాసూక్తమ్** - 'కాదు' అని ఎవరు అనెదరు. కనుకనే కదా 'సమస్తము వాసుదేవుడే' అను వాక్యము. అట్లు భగవంతుని సర్వత్ర చూడగల మహాత్ములు అఱుదుగా నుండెదరని గీతలో గలదు.

వా॥ : **తర్హి వ్యర్థా ఏవ అర్చాః** - అయినచో విగ్రహములు వ్యర్థములే.

ప్ర॥వా॥ : **న, సుందరే భగవద్విగ్రహే భగవద్బుద్ధేః సుకరత్వాత్. నహి ఆదావేవ కేవల పాషాణే 'భగవానితి' బుద్ధిః కస్యాపి ఉదీయాత్**-వ్యర్థము కావు. సుందరమయిన ఈశ్వర విగ్రహమునందు 'భగవంతుడు' అను భావన తేలికగా కలుగును. అట్టి భావన మామూలు రాయి మీద అంత తేలికగా మొదటనే కలుగదు గదా!

వా॥ : **అర్చాయామపి నోదేత్యేవ** - విగ్రహమునందు గూడా కలుగదు.

ప్ర॥వా॥ : **ఉదేత్యేవ, నటే రామాది బుద్ధివత్** - కలుగును. నటుని చూచి నాటకములో 'రాముడు' అని భావించినట్లే ఇదియును.

వా॥ : **నహి సాకార ఈశ్వరః** - ఈశ్వరునకు ఆకారము లేదు గదా!

ప్ర॥వా॥ : **లీలయా సాకార ఏవ** -క్రీడ కోసమై ఆయన ఆకారమును ధరించును.

వా॥ : **ఆకారే కథం ఈశ్వరబుద్ధిః?** - మఱి ఆకారము మీద 'ఈశ్వరు'డనే భావన ఎట్లు ఏర్పడును?

ప్ర॥వా॥ : **ఆకారవతి ఈశ్వర ఏవ ఈశ్వర బుద్ధిః** -ఆకారముతోనున్న ఈశ్వరుని యందే 'ఈశ్వరుడు' అను భావన కలుగును.

వా॥ : **కస్మాత్?** - ఎందువలన?

ప్రా॥వా॥ : **సాక్షాత్ భగవానేవ శ్రీరామః భద్రాదౌ ఇహ అస్మదనుగ్రహార్థం వ్యక్తః సన్ తిష్ఠతీతి భక్తాశయాత్** - భగవంతుడైన శ్రీరాముడు మనపై కరుణతో భద్రాద్రి మీద విగ్రహరూపమున వేంచేసి యున్నాడు అని భక్తులు భావించుచున్నారు కదా. అందువలన

వా॥ : **అమీ భక్తాః దేహాంతే కిం యాంతి?** - మరణానంతరము ఈ భక్తులు ఎచ్చటకు చేరెదరు?

ప్రా॥వా॥ : **పరమపదమ్** - దివ్యధామమునకు

వా॥ : **కిం తత్?** - ఏమిటి అది?

ప్రా॥వా॥ : **వైకుంఠలోకః** - వైకుంఠ లోకము.

వా॥ : **సః క్వాస్తే?** - అది ఎచ్చటనున్నది?

ప్రా॥వా॥ : **బ్రహ్మాండాదుపరి** - బ్రహ్మాండముకన్న పైన.

వా॥ : **కిం సత్యలోకః?** - అది సత్యలోకమా?

ప్రా॥వా॥ : **న, సహి హిరణ్యగర్భస్థానమ్** - అది హిరణ్యగర్భుని లోకము

వా॥ : **కిం తద్గతా న ముక్తాః?** - ఆ లోకమునందున్న వారు ముక్తులు కారా?

ప్రా॥వా॥ : **తద్గతాః హిరణ్యగర్భాయుష్యాంతే హిరణ్యగర్భేణ సమం ముచ్యంతే** - సత్యలోకస్థులు హిరణ్యగర్భుని, అవసానమున ఆయనతో బాటు మోక్షము పొందెదరు.

వా॥ : **కా ముక్తిః?** - ఆ మోక్షము ఎటువంటిది?

ప్రా॥వా॥ : **పరమపదప్రాప్తిః** - అదియును వైకుంఠప్రాప్తియే.

వా॥ : **కథం యాతి జీవో ముక్తిమ్?** - జీవుడు మోక్షమును ఎట్లు పొందును?

ప్రా॥వా॥ : **సుషుమ్నామార్గేణ నిర్గత్య రశ్మ్యనుసారీ సన్ అర్చిరాదిమార్గేణ సూర్యమండలం భిత్వా బ్రహ్మలోకం గచ్ఛతి** - సుషుమ్నా నాడి గుండా కదలి రశ్మిలలో ప్రవేశించి 'జ్యోతిర్మార్గము' ద్వారా సూర్య మండలమును భేదించికొని బ్రహ్మలోకమును చేరును.

వా॥ : **కిం బ్రహ్మ?** - ఏ బ్రహ్మ?

ప్రా॥వా॥ : **పరం బ్రహ్మ** - పరబ్రహ్మమే

వా॥ : **తద్ధి సర్వవ్యాపి** - అది సర్వవ్యాపి గదా

ప్రా॥వా॥ : **సత్యమ్** - నిజమే

వా॥ : **తర్హి బ్రహ్మప్రాప్త్యర్థం పరమపదగమనం వ్యర్థమ్**-అయితే 'బ్రహ్మము' కొఱకు పరమపదము దాకా వెళ్ళుట వ్యర్థము.

ప్రా॥వా॥ : **న వ్యర్థమ్** - వ్యర్థము కాదు.

వా॥ : **కుతః?** - ఎందువలన?

ప్రా॥వా॥ : **ప్రకృతి వియుక్తస్యైవ జీవస్య బ్రహ్మప్రాప్తిః సా తు ప్రకృతిః పరమపదస్థ విరజానదీతరణ సమయ ఏవ జీవం ముంచతి. నతు తతఃప్రాక్** - ప్రకృతి విడివడిన తరువాతనే జీవునకు 'బ్రహ్మము' లభించును. అయితే ప్రకృతి అతనిని విడిచిపెట్టుట మాత్రము పరమపదము నందున్న 'విరజానదిని' 'జీవుడు' దాటు సమయమునందు జరుగును. అంతకు ముందు జరుగదు. కనుక మోక్షముకొఱకు బ్రహ్మపదముదాకా వెళ్ల వలసియున్నది.

వా॥ : **కా సా ప్రకృతిః?** - ఎవరా ప్రకృతి?

ప్రా॥వా॥ : **మనష్షష్ఠేంద్రియ ప్రాణరూపా**-'ఇంద్రియములు 5, మనస్సు ప్రాణమును' వీని సమూహమే.

వా॥ : **ఇంద్రియాణి దశ హి?** - అదేమిటి? ఇంద్రియములు 10 కదా!

ప్రా॥వా॥ : **కర్మేంద్రియాణి దేహేన సహైవ జాయంతే, మ్రియంతే చ** - కర్మేంద్రియములు దేహముతో కలిసిపుట్టును. కలసి చచ్చును.

వా॥ : **'తత్త్వవిదః ప్రాణాః నోత్క్రామంతి' ఇతి శ్రుతేః అజ్ఞస్యైవ ప్రాణోత్క్రమణమ్** - పరమపదము దాకా ప్రాణములతో కూడిన ప్రకృతి పోవు నంటివి. కాని ఆ స్థితి ఒక్క అజ్ఞానికే. తత్త్వవేత్తకు ఆ స్థితి లేదు. అతని ప్రాణములు పైకి పోవు. ఇచ్చటనే పంచభూతములలో కలిసి పోవును. కనుక విరజానది దాటిన దాకా ప్రాణములతో గూడిన ప్రకృతి వెంబడించుననుట యెట్లు సరిపోవును.

ప్రా॥వా॥ : **పరమపదం ప్రాప్తస్య తత్త్వవిద ఏవ ప్రాణోత్క్రమణాభావః, ప్రాణావా**

**మేవ అభావాత్ తస్య** - పరమపదమును పొందిన తత్త్వవేత్తకు ప్రాణములే ఉండవు. కనుక ఆయనకు ప్రాణము పైకి పోవుట యుండదు. వేదవాక్యమునకు అర్థము అదియే.

వా॥ : **'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' ఇతి శ్రుతేః విదుషో న గమనమ్** - 'బ్రహ్మవేత్త బ్రహ్మయే అగును' అను వేదమును బట్టి ఆలోచించినచో బ్రహ్మవేత్తకు ఊర్ధ్వలోకగమనము లేనట్లు తోచుచున్నది కదా!

ప్ర॥వా॥ : **బ్రహ్మైవ బ్రహ్మవిద్భవతి. బ్రహ్మ జానాతి. నతు జీవః శ్రుత్యర్థాత్ 'స ఏనాన్ బ్రహ్మ గమయతి' ఇతి శ్రుత్యంతరాచ్చ** - ఆ శ్రుతికి అర్థము వాక్యక్రమము మార్చి చెప్పవలెను. బ్రహ్మయే బ్రహ్మవేత్త కాగలదు. బ్రహ్మము గూర్చి బ్రహ్మమునకే తెలియును. జీవునకు తెలియదు. అని అర్థము. 'అతడు వీరిని బ్రహ్మము వద్దకు జేర్చును'. అను వేద భాగము వలన తత్త్వవేత్తలకు బ్రహ్మము దాకా పోవుట కలదు.

వా॥ : **యది జీవో బ్రహ్మ న జానాతి, తర్హి కథం ముక్తస్య బ్రహ్మప్రాప్తిః?** - జీవునకు బ్రహ్మజ్ఞానములేని పక్షమున ముక్త జీవునకు 'బ్రహ్మప్రాప్తి' ఎలా జరుగును?

ప్ర॥వా॥ : **ముక్త జీవో జానాత్యేవ, యద్వా ముక్తజీవః బద్ధజీవో వా న అంతర్యామిణం జానాతి, తస్య అదృశ్యత్వాత్. బద్ధజీవస్తు బహిర్భవం బ్రహ్మాపి న జానాతి, అసర్వజ్ఞత్వాత్. ముక్తస్తు తజ్జానాతి, సర్వజ్ఞత్వాత్** -ముక్త జీవునకు బ్రహ్మజ్ఞానము కలుగును. లేదా ముక్త జీవునకయిన బద్ధ జీవునకయినను అంతర్యము అనగా 'లోపల వ్యాపించిన' ఈశ్వరుని స్వరూపము కనబడదు. అది అదృశ్యమే కనుక. అయితే తేడా ఏమి అనగా, ముక్తజీవుడు వెలుపల వ్యాపించిన బ్రహ్మ తత్త్వమును ఎఱుగును. బద్ధజీవునకు అదియును తెలియదు. అదే 'బద్ధజీవుని అజ్ఞత, ముక్తజీవుని సర్వజ్ఞత'

వా॥ : **యదేవ బహిస్థం తదేవాంతస్థం చ**-బయట వ్యాపించినదే కదా లోపల వ్యాపించినది గూడా. ఎందుకని లోపలది తెలియదు?

ప్ర॥వా॥ : **సత్యం తథాహి అంతస్థత్వ రూపేణ బ్రహ్మ జ్ఞాతుం న శక్యతే**

**జీవేన, అత ఏవ అంతర్యామీ ఈశ్వరః దుష్ప్రాప ఏవ జీవస్య-** నిజమే. కాని లోపల ఉన్న బ్రహ్మము జీవునకు కనబడదు. . కనుక అంతర్యామి అయిన ఈశ్వరుడు జీవునకు దుర్లభమే.

వా॥ : **కతివిధః ఈశ్వరః?** - అయ్యా, ఈశ్వరుడు ఎన్ని విధములు?

ప్రా॥వా॥ : **పంచవిధః** - 5 విధములు.

వా॥ : **కాః తాః విధాః?** - అవి ఏవి?

ప్రా॥వా॥ : **పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చా స్వరూపాః**-'పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా' అను స్వరూపములు గలవాడు.

వా॥ : **బ్రూహి తద్వివేకమ్?** - వివరింపుము?

ప్రా॥వా॥ : **వచ్మి శృణు! పరఃముక్తప్రాప్యం సర్వవ్యాపి చైతన్యమ్. వ్యూహః -వాసుదేవసంరక్షణ ప్రద్యుమ్నానిరుద్ధాః. విభవాః రామకృష్ణాదయః. అంతర్యామీ = జీవాంతర్గతః. అర్చాః శ్రీరంగనాయక వేంకటేశ్వరా దయః తత్ర విభవః ద్వివిధః నిత్యవిభూతిః లీలా విభూతిశ్చేతి. నిత్యవిభూతిః వైకుంఠే వర్తమానః శంఖచక్రాది ధరః శ్రీనివాసో మహా విష్ణుః. లీలా విభూతిః రామకృష్ణాదిరూపా - ఇతి వివేకః** - వినుము. పరుడు-ముక్త జీవులు మాత్రమే పొందు సర్వవ్యాపి చైతన్యము. వ్యూహము- వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ-అను 4. విభవము-రామకృష్ణ మొదలగు అవతారములు అంతర్యామి - జీవుల యందు వ్యాపించిన చైతన్యము. అర్చ- శ్రీరంగనాయక, శ్రీ వేంకటేశ్వర మొదలగు విగ్రహములు. పైన చెప్పిన వానిలో విభవ మూర్తులు 2 విధములు.

1. నిత్య విభూతి- నిత్యము ఉండు ఆకారము. వైకుంఠమున శంఖ చక్రాదులు ధరించియుండు శ్రీమహావిష్ణువు.
2. లీలావిభూతి-రామ,కృష్ణ మొదలగు అవతారములు

వా॥ : **సర్వం జగదపి ఈశ్వర విభూతిః ఈశ్వరవ్యూహశ్చ** - ప్రపంచ మంతయు ఈశ్వరవైభవమే, ఈశ్వరవ్యూహమే కదా.

ప్రా॥వా॥ : **సత్యం. తథాపి ప్రాధాన్యేనోక్తం తథా 'ఆదిత్యానామహం విష్ణుః' ఇత్యాదివత్** - నిజమే అయినను ప్రాధాన్యమును బట్టి చెప్పబడెను.

అనగా ప్రపంచమంతయు తన విభూతి అయినను భగవంతుడు గీతలో ప్రత్యేకముగా 'ఆదిత్యులలో నేను విష్ణువును' అని చెప్పెను కదా! (అంటే ఆదిత్యులందరు (12) తన విభూతి అయినను అందులో 'విష్ణువు' అను వానిలో తన 'కళ' ప్రధానముగానున్నదని అర్థము)

వా॥ : **కిమర్థం తథోక్తమ్?** - ఎందుకట్లు చెప్పబడినది? (అనగా ప్రధాన స్థానము దేనికి చెప్పినట్లు)

ప్ర॥వా॥ : **ఉపాసనార్థమ్**-ఆరాధన కొరకు

వా॥ : **రామ ఇవ జీవోపి బ్రహ్మబుద్ధ్యా ఉపాస్య ఏవ**- రాముని వలె జీవుడెవ డైనను 'బ్రహ్మము' అను భావముతో ఆరాధింపదగిన వాడే కదా!.

ప్ర॥వా॥ : **సత్యమ్**-నిజమే

వా॥ : **తథా సతి జీవవత్ రామోఽపి నైవ బ్రహ్మ**- అట్లయినచో జీవుడు బ్రహ్మము కానట్లే రాముడున్నూ బ్రహ్మము కాడు.

ప్ర॥వా॥ : **యది రామశబ్దేన శరీరం వివక్షితం, తర్హి రామోపి జీవవత్ ఈశ్వర శరీరత్వేన నైవ బ్రహ్మ. యది తదంతర్గతం చైతన్యం వివక్షితం తర్హి రామో బ్రహ్మైవ** - రాముడు అని ఒక శరీరమునకు పేరు అనుకున్న పక్షమున 'రాముడు' గూడా జీవుని వలె ఈశ్వరునికి శరీరమే కనుక బ్రహ్మము-కాడు. అట్లుకాక రాముడు అనునది జీవునిలోని చైతన్యమునకు పేరు అనుకున్నచో 'రాముడు' బ్రహ్మయే.

వా॥ : **తర్హి జీవశబ్దేనాపి చైతన్యవివక్షణే జీవః బ్రహ్మైవ**-అట్లయినచో 'జీవుడు' అను పదమునకు గూడా 'జీవునిలోని చైతన్యము' అని అర్థము చెప్పినచో జీవుడును బ్రహ్మయే కదా!.

ప్ర॥వా॥ : **సత్యం. యది జీవాంతర చైతన్యం వివక్షితం జీవశబ్దేన, తర్హి జీవః బ్రహ్మైవ, యది తు ప్రత్యక్ చైతన్యం వివక్షితమ్ తర్హి జీవః నైవ బ్రహ్మ కింతు బ్రహ్మశరీరమేవ** - నిజమే. జీవ అనుపదముచే జీవుని లోని చైతన్యమును చెప్పదలచినచో జీవుడు బ్రహ్మయే. కాని జీవశబ్దముచే ఈశ్వరభిన్నమయిన దేహగతమయిన చైతన్యము

చెప్పబడినచో జీవుడు బ్రహ్మ కాదు. బ్రహ్మయొక్క శరీరము మాత్రమే.

వా॥ : 'రామో బ్రహ్మ, కృష్ణోబ్రహ్మ, జీవో బ్రహ్మ, ఇతివత్ శ్వా బ్రహ్మ, శ్వపచః బ్రహ్మ ఇత్యపి వక్తుం యుక్తమ్, రామాదిష్వివ శ్వాదిష్వపి సత్త్వాత్ ఈశ్వరస్య-రాముడు బ్రహ్మము, కృష్ణుడు బ్రహ్మము. జీవుడు బ్రహ్మము. అన్నట్లు 'కుక్క బ్రహ్మ, కుక్కను తినువాడు బ్రహ్మ' -అనియు చెప్పవచ్చును గదా!. ఏమంటే ఈశ్వరుడు శునకము మొ॥ వానియందును కలడు కదా!

ప్ర॥వా॥ : సత్యం. తథైవ వదంతి విద్వాంసః 'సర్వం బ్రహ్మేతి'. అత ఏవ సర్వ శబ్దవాచ్యత్వమపి ఈశ్వరస్య సంగచ్ఛతే. ఈశ్వరస్య సర్వశరీరకత్వేవ శరీరవాచి సర్వశబ్దానాం శరీరిపర్యంతత్వ నియమాత్-నిజమే. విద్వాంసులు అట్లే చెప్పుచున్నారు. సర్వము బ్రహ్మయే. కనుకనే ఈశ్వరునకు 'సర్వః' అను పేరు గూడా సరిపోవును. ఈశ్వరునకు 'సర్వము' శరీరమే కనుక శరీరములను చెప్పు పదములు అన్నియు (కుక్క మొ॥) శరీరి అయిన ఈశ్వరుని చేరును. శరీరమును చెప్పు పదములు శరీరధారి అయిన జీవును చెప్పును కదా!.

వా॥ : తర్హి రామాదివత్ శ్వాదయోపి పూజ్యా ఏవ, రామాది నామవత్ దేవదత్తాది నామాన్యపి జప్యాన్యేవ -అయినచో, రాముడు మొ॥ వాని వలె శునకము మొ॥ పూజనీయములు. 'రామ' నామము వలె 'దేవదత్త' నామము గూడా జపించదగినదే కదా!.

ప్ర॥వా॥ : మైవమ్! శ్వాదిదేహాః జీవేశ్వర సాధారణాః, ఈశ్వరవత్ జీవస్యాపి శ్వాది దేహేషు సత్త్వాత్. రామకృష్ణాది దేహాస్తు ఈశ్వరస్యైవ అసాధారణాః, తేషు జీవస్య అసత్త్వాత్. తథా రామకృష్ణాది నామాని ఈశ్వరస్యైవ అసాధారణాని. దేవదత్తాదీని తు జీవేశ్వరోభయ సాధారణాని ఇతి కృత్వా ఈశ్వర సాధారణ దేహనామాదయ ఏవ పూజాజపాద్యుచితాః - అలాకాదు "కుక్క" మొదలైన దేహములు అటు జీవునకు ఇటు ఈశ్వరునకు సమానములు. ఎందుకనగా ఈశ్వరుని వలె జీవుడు గూడా ఆ దేహములందు ఉన్నాడు కనుక.

రామ, కృష్ణ మొదలైన దేహములందు ఈశ్వరుడు ఉన్నాడు. వానియందు జీవులు లేరు. కనుక రామ, కృష్ణాది నామములు ఈశ్వరునికి మాత్రమే చెందును. దేవదత్త మొదలైన నామములు "కుక్క" వలె జీవ+ ఈశ్వరులకు చెందును. కాగా, ఈశ్వరునికి మాత్రమే చెందు దేహము యొక్క నామములే పూజలకు జపములకు తగును.

వా॥ : బ్రహ్మ రుద్రాదయోఽపి పూజ్యా ఏవ-బ్రహ్మ,రుద్రుడు మొదలగు వారు పూజ్యులే కదా!

ప్ర॥వా॥ : పూజ్యా ఏవ తే, జీవత్వేపి ఉత్కృష్టత్వాత్, భగవద్భక్తత్వాచ్చ-వారు పూజ్యులే. జీవులయినను వారు మన కన్న గొప్ప జీవులు అనగా జీవోత్తములు కనుక, భగవంతునకు భక్తులు కనుక.

వా॥ : బ్రహ్మ రుద్రాదయో న జీవాః - బ్రహ్మరుద్రాదులు జీవులు కారు.

ప్ర॥వా॥ : జీవా ఏవ - జీవులే.

వా॥ : కుతః? - ఎందుకని?

ప్ర॥వా॥ : వత్సాపహార బాణాసుర యుద్ధాదిషు బ్రహ్మరుద్రాదీనాం శ్రీ కృష్ణేన పరిభూతత్వాత్ - భాగవతములో చెప్పబడిన 'వత్సాపహరణము' లో బ్రహ్మయు బాణాసురయుద్ధమున రుద్రుడున్ను కృష్ణుని ముందఱ పరాభవింపబడిరి కనుక.

వా॥ : అతీతః కృష్ణః కథ మస్మాకం ముపేవః? - అంతటి అతీతుడైన కృష్ణుని మనమెట్లు సులభముగా అందికొని ఆరాధింపగలము?

ప్ర॥వా॥ : నాతీతః జగన్నాథక్షేత్రే జగన్నాథరూపేణ వర్తత ఏవ. యద్వా సర్వా స్వపి అర్చాసు సాలగ్రామాదిషు చ చైతన్యరూపేణ వర్తత ఏవ - అతీతుడు కాడు. జగన్నాథక్షేత్రమున జగన్నాథ రూపముతో ఉన్నాడు. లేదా అన్ని అర్చామూర్తులయందు సాలగ్రామములందు చైతన్యముగా ఆయన వ్యాపించెను గదా!

వా॥ : కిం సాలగ్రామం పరం బ్రహ్మ? - సాలగ్రామము పరబ్రహ్మయా?

ప్ర॥వా॥ : ఓమ్ - అవును.

వా॥ : **కథమ్? - ఎట్లు?**

ప్ర॥వా॥ : **గండక్యాం నద్యాం పరమేశ్వరేణ సాలగ్రామాత్మనా అవతీర్ణత్వాత్** - గండకనదిలో 'సాలగ్రామముగా', 'పరమాత్మ' అవతరించెను కనుక.

వా॥ : **కథమిదం జ్ఞాయతే?** - అట్లని ఎట్లు తెలిసినది?

ప్ర॥వా॥ : **స్వాభావిక చక్ర చిహ్నేన. చక్రం హి భగవత సాధారణచిహ్నమ్** - సహజము అయిన 'చక్రము' దానియందు ఉండుటచేత. చక్రము భగవంతునికి ప్రత్యేకమయిన సొంత 'గుర్తు' కదా?

వా॥ : **తర్హి కులాలోపి భగవానేవ, చక్రిత్వాత్** - అయినచో 'చక్రము' ఉన్నది కనుక 'కుమ్మరి' యును భగవంతుడే.

ప్ర॥వా॥ : **న, కృత్రిమత్వాత్ కులాల చక్రస్య**-కాదు. కుమ్మరి చక్రము సహజము కాదు. తయారు చేసి తగిలించికొన్నది.

వా॥ : **తర్హి కృత్రిమా అర్చాః అపూజ్యా ఏవ**-అయినచో తయారు చేయబడిన అర్చా విగ్రహములు గూడా పూజింపదగినవి కావు.

ప్ర॥వా॥ : **న, కృత్రిమత్వేపి అర్చానాం బ్రాహ్మణప్రయుక్త మంత్ర యంత్రాదిభిః ఈశ్వరత్వాత్. మంత్రాధీనం హి దైవతమ్** - అట్లు కాదు. పూజింప దగినవే. అర్చన విగ్రహములు తయారుచేయబడినవయినను, వేదవేత్తలు మంత్రయంత్రతంత్రములతో ఈశ్వరకలను వాని యందు ఆవాహన చేయుదురు. దైవకళ మంత్రాధీనము కదా!

వా॥ : **కథం ఈశ్వరస్య పరతంత్రతా ?** - ఏమి? ఈశ్వరుడు పరాధీనుడా, మంత్రములకు వశమయిపోవునా?

ప్ర॥వా॥ : **మంత్రాణాం ఈశ్వరేణైవ తాదృశ సామర్థ్యస్య దత్తత్వాత్. యద్వా సర్వవ్యాపి చైతన్య మేవ అపరతంత్రమ్. రామకృష్ణాది విభవాస్తు మంత్రాది పరతంత్రాః ఏవ. త ఏవ విభవాః అర్చాసు ఆవాహ్య స్థాప్యంతే భాగవతైః అథవా మంత్రపూతాన్యర్చాసు భగవాన్ స్వయమేవ భక్తానుగ్రహార్థం వర్తతే.** - మంత్రములకు ఈశ్వరుడే అటువంటి సామర్థ్యమును ఇచ్చెను. (అందువలన ఈశ్వరుడు తన ఇచ్ఛవలననే మంత్రములకు వశమగును 'కనుక పరతంత్రుడు కాడు)

లేదా,

సర్వవ్యాపి అయిన చైతన్యము ఎన్నటికి దేనికీ పరతంత్రము కాదు. రామకృష్ణాది అవతారములు మాత్రము మంత్రము మొదలైన వానికి పరతంత్రములే. కనుక ఆ అవతారదేవతలను భక్తులు అర్చా విగ్రహములందు ఆవాహన చేసి కొలిచెదరు. లేదా మంత్రములవలన పవిత్రములయిన అర్చామూర్తులయందు భగవంతుడు స్వయముగనే అవతరించి భక్తులను అనుగ్రహించును.

వా॥ : **కేన రూపేణ?** - ఏ రూపముతో అవతరించును?

ప్ర॥వా॥ : **భక్తరక్షణోపయోగినా యేన కేనాపి రూపేణ** - భక్త రక్షణకు ఉపయోగించు నటువంటి-ఏ రూపముతోనయినను అవతరించును.

వా॥ : **తర్హి బహిర్ముఖా ఏవ ధన్యాః** - అయినచో ధ్యానయోగులకన్న (అంతర్ముఖ) బహిర్ముఖులయిన వారు అనగా భగవంతుని బయటనుండి కొలుచు సాధారణ భక్తులే మిన్న.

ప్ర॥వా॥ : **న, బహిర్ముఖా అపి ధన్యాః** - లేదు, బహిర్ముఖులు గూడా ధన్యులు.

వా॥ : **కథం అంతర్ముఖానాం ఈశ్వర సేవా, పరోక్షత్వాదీశ్వర చైతన్యస్య?** - అంతర్ముఖులకు ఈశ్వర సేవకు అవకాశము లేదు గదా. ఏమంటే అంతర్యామి అయిన ఈశ్వర చైతన్యము ఎవరికిని కనిపించదు గదా!

ప్ర॥వా॥ : **హృది అంగుష్ఠ పరిమితరూపేణ ఈశ్వరస్యసత్త్వాత్. తస్య చ అపరోక్షత్వాత్** - హృదయమునందు గూడా ఈశ్వరుడు అంగుష్ఠ (బొటనవ్రేలు) ప్రమాణమున అవతరించి యుండెను. కనుక ఆ ఈశ్వరుడు ప్రత్యక్షముకాగలడు. కనుక అంతర్ముఖులు అట్టి ఈశ్వరుని సేవించెదరు.

వా॥ : **కథం అపరిచ్ఛిన్నస్య ఈశ్వరస్య అంగుష్ఠ పరిమితత్వమ్?** - అఖండుడయిన ఈశ్వరుడు 'బొటనవ్రేలంత' కొలతలో ఎట్లు ఇముడును?

ప్ర॥వా॥ : **ఉపాసకానుగ్రహార్థం ఈశ్వరేణ తాదృశరూపస్య స్వీకృతత్వాత్ లీలయా రామకృష్ణాది మూర్తివత్** - ఉపాసన చేయు వారిని అనుగ్రహించుటకు ఈశ్వరుడు అట్టి రూపమును స్వీకరించెను. రామకృష్ణాది రూపములను లీలగా స్వీకరించినవానికి ఇది సాధ్యమే.

వా॥ : నః పురుషః నైవ దృశ్యతే - ఆ పురుషుడు కన్నులకు కనబడడు కదా (హృదయములోకి కన్నులు పోవు కనుక)

ప్రా॥వా॥ : చక్షురవిషయః నః మనసా దృశ్యతే - కన్నుకు కనబడుట సాధ్యము కాదు. కాని మనస్సునకు కనబడును.

వా॥ : కిం మనోమయః? - ఆతడు మనోరూపుడా?

ప్రా॥వా॥ : బాఢమ్ - అవును.

వా॥ : మనసా కల్పిత ఏవ? - అంటే మనస్సు స్వయముగా కల్పించికొనిన రూపమా?

ప్రా॥వా॥ : న, ఈశ్వరేణ గృహీతం తద్రూపం స్వయమేవ - లేదు, ఈశ్వరుడు అట్టి మనోమయమయిన రూపమును స్వీకరించెను.

వా॥ : కుతః సర్వేషాం తత్ న ప్రత్యక్షమ్? - మఱి, ఆ రూపము అందఱికి ఏల ప్రత్యక్షము కాదు?

ప్రా॥వా॥ : మనశ్శుద్ధ్యభావాత్ - 'చిత్తశుద్ధి' లేక పోవుట వలన.

వా॥ : కిమేవ మంతర్ముఖానాం బహిర్ముఖానాం వా సాకార ఏవ ఈశ్వరః నంసేవ్యః? - అంతర్ముఖులకు గాని, బహిర్ముఖులకు గాని ఈశ్వరుడు సాకారుడుగానే సేవింపదగినవాడా యేమి?

ప్రా॥వా॥ : సత్యమ్. నిరాకారస్య సేవితు మశక్యత్వాత్ - అవును అంతే? నిరాకారుని సేవించుట సాధ్యము కాదు కనుక.

వా॥ : సాకారేశ్వర సేవయా న నిరాకార బ్రహ్మప్రాప్తిః - సాకారుడయిన ఈశ్వరుని సేవించినచో నిరాకారమయిన బ్రహ్మము ఎట్లు లభించును.

ప్రా॥వా॥ : యస్సాకారః సేవ్యతే, తస్య నిరాకారత్వాత్ అస్త్యేవ నిరాకార బ్రహ్మ ప్రాప్తిః సాకారేశ్వర సేవినః-సాకారుడైన ఈశ్వరుని సేవించు చున్నాము. ఆయన అసలు నిరాకారుడు. అయినను పదార్థము ఒక్కటి కనుక సాకారుడైన ఈశ్వరుని సేవించటానికి నిరాకారుడైన యీశ్వరుడు లభించును.

వా॥ : తర్హి వ్యర్థః జ్ఞానమార్గః-అయినచో 'పరమాత్మ' తత్వజ్ఞానరూప

మయిన మోక్షమార్గము వ్యర్థమేనా?

ప్రా॥వా॥ : *న వ్యర్థః. యః ఏవం జ్ఞానపూర్వకం సాకారం ఈశ్వరం సేవతే తస్యైవ నిరాకార బ్రహ్మప్రాప్తిః న అన్యస్య ఇతి* -వ్యర్థము కాదు. జ్ఞాన పూర్వకముగా సాకారుడైన ఈశ్వరుని సేవించువారికి నిరాకార బ్రహ్మప్రాప్తి కలదు. ఇతరులకు లేదు.

వా॥ : *'నాన్యః పంథా విద్యతేఽ యనాయ' ఇతి శ్రుతి విరోధః*- మోక్షమునకు జ్ఞానము తప్ప మఱొక మార్గము లేదు' అను వేదవాక్య తాత్పర్యము నకు ఇది విరుద్ధము కదా!.

ప్రా॥వా॥ : *న. జ్ఞాన పూర్వకేశ్వర సేవా మార్గస్యాపి జ్ఞానమార్గత్వాత్*- జ్ఞాన పూర్వకమయిన ఈశ్వర సేవ కూడా జ్ఞాన మార్గమే కనుక ఇందులో వేద వాక్య విరోధము లేదు. (అనగా ఈశ్వర జ్ఞానమే మోక్ష మార్గము) అని వేదము చెప్పినది. ఈశ్వర జ్ఞాన పూర్వక సేవ మోక్ష మార్గమని చెప్పిన వేదమునకు విరుద్ధముగా నున్నట్లు కనబడుచున్నది. 'సేవ' గూడా ఒక మార్గము అని చెప్పినట్లు అయినది కనుక. అందువలన 'జ్ఞానము, జ్ఞాన పూర్వక సేవ' ఈ రెండును జ్ఞాన మార్గములే కనుక వేదవాక్య విరోధము లేదు అని సమాధానము)

వా॥ : *కథం ఈశ్వరసేవా కార్యా?*- ఈశ్వర సేవ ఎట్లు చేయవలయును?

ప్రా॥వా॥ : *'పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః త్రాహి మాం కృపయా దేవ శరణాగత వత్సల' ఇతి అనుసంధానపూర్వకమ్*- నేను పాపిని, మొ॥ నన్ను దయుతో కాపాడుము. శరణుగోరిన వారియందు నీకు వాత్సల్యము కదా!' అని రోజూ అనుసంధానము అనగా వందనము చేయుచుండవలయును.

వా॥ : *కేనోక్తమ్?* - ఎవరు చెప్పిరి?

ప్రా॥వా॥ : *శ్రీకృష్ణేనైవ* - శ్రీకృష్ణుడే

వా॥ : *క్వ?* - ఎచ్చట?

ప్రా॥వా॥ : *గీతాయామ్*-భగవద్గీతలో

వా॥ : *కిం తద్వాక్యమ్?* - ఏది ఆ మాట?

ప్ర॥వా॥ : **'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వ పాపేభ్యః మోక్షయిష్యామి మా శుచః'. శ్రీరామేణాపి ఉక్తమ్ 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే. అభయం సర్వ భూతేభ్యః దదామ్యేతత్ వ్రతం మమ' ఇతి-**

1. కృష్ణుడు గీతలో చెప్పిన వాక్యము : 'సర్వ ధర్మములను పరిత్యజించి నన్ను ఒక్కడినే శరణువేడుము. నేను నిన్ను సర్వపాపముల నుండి విడిపించెదను. దుఃఖింపకుము.

2. రాముడు రామాయణములో చెప్పిన వాక్యము - 'ఒక్కసారి నన్ను చేరి, నేను నీ వాడను అని యాచించిన వారికి ఎవని కయినను అభయమిచ్చెదను'.

వా॥ : **కిం అభేదేన ఈశ్వరః శరణీ కరణీయః? ఉత భేదేన?** - శరణాగతి ఎట్లు చేయవలెను? ఈశ్వరుడు - తాను ఒకటి అనియూ, లేక ఇద్దఱును వేఱు వేఱును అనియా?

ప్ర॥వా॥ : **అభేదేనైవ** - ఒక్కటి అనియే

వా॥ : కథం అభేదే శరణాగతిః? - ఒక్కటే అయినచో శరణాగతి ఎట్లు? ఎవరు ఎవరికి శరణు. ఇద్దఱు లేరు గదా! ఇద్దఱున్ను ఒక్కటే కదా!

ప్ర॥వా॥ : **ఈశ్వర శరీరత్వాత్ ఈశ్వర ఏవాహం ఇతి నిశ్చయేన ఈశ్వరః శరణీకరణీయః** - 'తాను ఈశ్వరునకు శరీరము కనుక ఈశ్వరుడనే' అను నిశ్చయభావనతో ఈశ్వరుని శరణు కోరవలెను.

వా॥ : **కుతః న భేదేన?** - వేఱు వేఱు అను భావనతో ఏల కొలవ రాదు?

ప్ర॥వా॥ : **"యోన్యాం దేవతాముపాస్తే అన్యోసావన్యోహమస్మీతి, న స వేద యథా పశుః ఏవం స దేవానాం" ఇతి శ్రుత్యా భేదస్య నిందితత్వాత్**- 'దేవత వేఱు తాను వేఱు' అని దేవతోపాసన చేయువాడు పశువు, అని వేదము 'భేదోపాసనను' నిందించెను కదా!.

వా॥ : **తర్హి శుద్ధాభేద ఏవాస్తు జీవేశ్వరయోః** -అయినచో ఈ విశిష్టాద్వైత మేల? పూర్తిగా 'జీవుడే ఈశ్వరుడు' అను శుద్ధమైన అద్వైతమే మంచిది కదా?

ప్ర॥వా॥ : వ-కాదు.

వా॥ : **కుతః?**-ఎందుకని?

ప్ర॥వా॥ : ***పరిచ్ఛిన్నాపరిచ్ఛిన్నయోః బాహ్యాంతరయోశ్చ జీవేశ్వరయోః శుద్ధాభేదా సంభవాత్*** - పూర్తి అభేదము కుదరదు. భేదము కలదు కనుక. జీవుడు-పరిచ్ఛిన్నుడు అనగా ఖండస్వరూపుడు, దేహగతుడు, బాహ్యస్వరూపుడు. ఈశ్వరుడు-అఖండుడు, సర్వవ్యాపి, అంతర్యామి.

వా॥ : ***యది జీవః పరిచ్ఛిన్నః, యది చ జీవస్య ఈశ్వరః అంతరః, తర్హి నాహం బ్రహ్మాస్మి***- జీవుడు ఖండస్వరూపుడైనచో జీవునకు ఈశ్వరుడు అంతర్యామి అయినచో నేను 'బ్రహ్మమును అనగా, ఈశ్వరుడను కాను'.

ఇతి బెల్లంకొండోపనామక 'రామకవి కృతిషు' అద్వైత విజయే, వాది ప్రతివాది సంవాదః. సాధారణ మార్గశిరశుద్ధ నవమీ. -ఇది శ్రీ బెల్లంకొండ రామరాయకవి కృతులలో 'అద్వైత విజయము' అను గ్రంథమున 'వాది ప్రతివాది సంవాదము' అను భాగము.

సాధారణ నామ సంవత్సర మార్గశిర శుద్ధ నవమి నాటికి సమాప్తము.

శ్రీ హయగ్రీవాయనమః

# సిద్ధాంతః

1. *ప్రకృతిః పురుషః ఈశ్వరశ్చేతి త్రయః పదార్థాః తత్ర ప్రకృతిః అచేతనా, సత్యా నిత్యా దృశ్యా. ఈశ్వరశరీరతయా ఈశ్వరాత్మికా, ఈశ్వర శేషభూతా అస్వతంత్రా విభ్వీ* - ప్రకృతి, పురుషుడు(జీవుడు), ఈశ్వరుడు అని పదార్థములు 3 గలవు. ప్రకృతి జడపదార్థము. దానిలో చేతన-జ్ఞానము లేదు. ప్రకృతి సత్యమయినది అనగా నిజమయినది అనగా మిథ్య కాదు. నిత్యమయినది, దృశ్యమయినది. అది ఈశ్వరుని శరీరము కనుక ఈశ్వరస్వరూపమయినది. ఈశ్వరునికి 'శేష'మయినది. ఈశ్వరునికి అధీనమయినది. వ్యాపించినది.

2. *సా ద్వివిధా సూక్ష్మా స్థూలా చేతి. ప్రలయదశాయాం అవస్థితా సూక్ష్మా, ఇయమేవ మూల ప్రకృతిరితి, ఈశ్వర శక్తిరితి చ వ్యపదిశ్యతే. ప్రపంచ దశాయాం అవస్థితా స్థూలా ఇయమేవ భూతభౌతికాకారేణ అద్య దృశ్యతే* - ప్రకృతి 2 విధములు. (1) సూక్ష్మ ప్రకృతి (2) స్థూల ప్రకృతి. ప్రలయ కాలమున (విత్తనము వలె) సూక్ష్మరూపమున నుండును. ఈ ప్రకృతినే మూల ప్రకృతి అని, ఈశ్వరుని శక్తి అని అందురు. ఇదే ప్రకృతి సృష్టిదశలో ప్రపంచముగా మారిన స్థితిలో స్థూలదశ కనుక స్థూల ప్రకృతి అనబడును. పంచభూతములుగను వానినుంచి ఏర్పడిన పదార్థములుగను మనకు కనబడునది ఇదే.

3. *ఈశ్వరాధిష్ఠితా సూక్ష్మప్రకృతిరేవ స్థూల జగదాకారేణ పరిణతా ఇతి స్థూల ప్రకృతేః పరిణామ్యుపాదానం సూక్ష్మప్రకృతిః* - ఈశ్వర శరీరమయిన యీ సూక్ష్మప్రకృతి తనయందున్న ఈశ్వరప్రభావమువలన, స్థూల జగత్తుగా పరిణమించినది. కనుక (కుండకు మట్టి వలె) స్థూల ప్రకృతికి సూక్ష్మ ప్రకృతి ఇలా పరిణమించిన ఉపాదాన కారణము.

4. *ప్రకృతేః సత్త్వం రజః తమః ఇతి త్రయోగుణాః సంతి. తేన గుణ త్రయేణ ప్రకృతిః పురుషం సంసారయతి* - ప్రకృతికి 3 గుణములు కలవు. (1) సత్త్వము (2) రజస్సు (3) తమస్సు. ఈ 3 గుణములతో ప్రకృతి

పురుషుని అనగా జీవుని బంధించి సంసారమున పడవేసి నడుపుచుండును.

5. **పురుషః చేతనః సత్యః నిత్యః ద్రష్టా, దృశ్యశ్చ. పురుషస్య ప్రకృతిం స్వం చ ప్రతి ద్రష్టృత్వం, ఈశ్వరం ప్రతి తు దృశ్యత్వమితి వివేకః** - పురుషుడు జీవుడు. జ్ఞానము గలవాడు (చేతనుడు) సత్యమయినవాడు (మిథ్య కాడు) ద్రష్ట - తనను ప్రపంచమును తెలిసికొనగలవాడు. దృశ్యుడు - ఈశ్వరుని చేత తెలిసికొనబడినవాడు.

6. **ఈశ్వర శరీరకతయా ఈశ్వరాత్మకః, ఈశ్వరశేషభూతః అస్వతంత్రః కర్తా, భోక్తా, అణుః, పరిచ్ఛిన్న జ్ఞానానందగుణకః** - ఈ పురుషుడు (జీవుడు) ఈశ్వరునికి శరీరము. ఈశ్వరస్వరూపుడు. ఈశ్వరునకు శేషము. ఈశ్వరునివలె ఇతడు స్వతంత్రుడు గాడు. కర్త-అనగా కర్మాధికారము గలవాడు. భోక్తా-కర్మ ఫలములను అనుభవించు వాడు. అణువు-అనగా ప్రతి దేహమున పరిమితముగా నున్న ఖండ (ముక్క) స్వరూపుడు. ఈతని జ్ఞానముగాని ఆనందముగాని పరిమితమయినవి. అఖండములు, శాశ్వతములు కావు.

7. **'స త్రివిధః. బద్ధః ముక్తః నిత్యః చేతి'. ప్రకృతిస్థః బద్ధః, ప్రకృతి వియుక్తో ముక్తః, ప్రకృత్యా అసంస్పృష్టస్తు నిత్యః, త్రయోఽప్యమీ ప్రత్యేక మనంతాః** ఏవ - జీవుడు 3 రకములు. 1. బద్ధుడు-అనగా ప్రకృతిలో ఉన్నవాడు. 2. ముక్తుడు-ప్రకృతి నుండి విడివడినవాడు 3. నిత్యుడు-ప్రకృతితో కలియని వాడు. వీరందరును ఎవరికి వారు అనేక సంఖ్యలో నుండెదరు.

8. **జీవస్య స్థూలం సూక్ష్మం చేతి అస్తి శరీరద్వయమ్. తత్ర స్థూలం కర చరణాదిమత్, పాంచభౌతిక పిండః, సూక్ష్మంతు సూక్ష్మభూతపంచక ప్రాణ-పంచక జ్ఞానేంద్రియపంచక మనోబుద్ధి ద్వయాత్మక సప్తదశ తత్త్వ సమష్టిః సూక్ష్మశరీర సహిత ఏవ జీవః లోకాంతర గమనాగమనాదికమ్ కరోతి** - జీవునకు స్థూలమని సూక్ష్మమని '2' శరీరములు కలవు. స్థూలమనగా కాలుసేతులు గల మన మామూలు శరీరము. సూక్ష్మమనగా దీనియందు సూక్ష్మ రూపమున 17 తత్త్వములుండును. అవి ఇవి. (1) పంచభూతములు -5 (2) పంచ ప్రాణములు-5 (3) పంచ జ్ఞానేంద్రియములు-5 (4) మనస్సు-1 (5) బుద్ధి-1.

ఈ సూక్ష్మ శరీరముతోనే జీవుడు పరలోక గమనము మొ॥ చేయును.

9. ఇదం చ సూక్ష్మశరీరమణు, తద్గత మన ఇంద్రియాదీనాం అణుత్వాత్ అత ఏవ సూక్ష్మశరీరీ దేహాత్ ఉత్క్రామన్ జీవః పార్శ్వ స్థైః నోపలభ్యతే. ప్రవిశతి చ మశకాదపి అతిసూక్ష్మం దేహమ్. ఏవం అతిసూక్ష్మత్వాదేవ జీవః అచ్ఛేద్యః అదాహ్యః అశోష్యః అమర్త్యశ్చ. ప్రాకృతం చేదం సూక్ష్మ శరీరం ముక్తికాలే నశ్యతి - ఈ సూక్ష్మ శరీరము అణుస్వరూపము. దానియందలి మనస్సు ఇంద్రియములు మొదలైనవి కూడా అత్యంత సూక్ష్మములు. కనుకనే జీవుడు ఇంత సూక్ష్మ శరీరముతో శరీరము నుండి బయటకు పోవునపుడు (మరణకాలమున) ప్రక్కనున్న వారికి కనబడడు. దోమ కన్నా చిన్న దేహమునందు కూడా ప్రవేశించగలడు. ఇంత సూక్ష్మ రూపము గనుకనే జీవుని ఛేదించలేము. దహింపలేము. ఎండించలేము. వానికి చావులేదు. ఈశరీరము ముక్తి కాలమున నశించును.

10. స్థూలశరీరం తు ప్రారబ్ధావసానే నశ్యతి. ముక్తనిత్యయోస్తు స్వేచ్ఛయా ఈశ్వరేచ్ఛయా వా అప్రాకృత స్థూల సూక్ష్మ శరీరే స్తః నస్తశ్చ - మామూలు శరీరము మాత్రము ప్రారబ్ధము తీరిన తర్వాత నశించును. ముక్త నిత్యుల శరీరములు ప్రకృతిబద్ధములు కావు. ఆ శరీరములు వారి ఇష్టము వచ్చినపుడు వదలగలరు. లేదా ఈశ్వరేచ్ఛ ప్రకారము వదలగలరు.

11. అస్య చ జీవస్య కామసంకల్పాదయో గుణాః సంతిః. జ్ఞాతృత్వాత్ చేతన ధర్మా హి తే. చేతనశ్చ జ్ఞాతా, మనస్తు జీవస్య కరణమేవ. చక్షురాదివత్. యథా దర్శనశ్రవణాదయః న చక్షుశ్శ్రోత్రాదికరణధర్మాః కింతు ద్రష్టుః శ్రోతుఃచ జీవస్యైవ తద్వత్ కామాదయో న మనోధర్మాః. అత ఏవ 'శాంతో దాంతః ఉపరతః' ఇతి శ్రుత్యా ముముక్షోః జీవస్య శమాదయో గుణాః విధీయంతే - ఈ జీవునకు కామము సంకల్పము మొ॥ గుణములు కలవు. అవి చేతన (జ్ఞానము గలవాని) ధర్మములు. జీవుడు జ్ఞాత (జ్ఞానము గలవాడు) కనుక. చేతనుడు - మనస్సు జీవునకు జ్ఞాన సాధనము మాత్రమే. నేత్రము ఎట్లు సాధనమో మనస్సున్ను అట్టి (లోపల నున్న) సాధనము. చూచుట, వినుట మొ॥ కన్ను, చెవి, మొ॥ వాని ధర్మములు కావు కదా! అవి ద్రష్ట శ్రోత అయిన జీవుని ధర్మములు. అదే విధముగా కామము, సంకల్పము మొ॥ మనస్సు యొక్క ధర్మములు కావు. జీవుని

గుణములే. కనుకనే 'శాంతుడు దాంతుడు మొ॥ విశేషణములతో వేదము మోక్షవాంఛగల జీవునకు శమము దమము మొ॥ గుణములను చెప్పినది. కనుక కామము శమము దమము మొ॥ జీవధర్మములు.

12. అణురప్యయం జీవ: దేహే హృది తిష్ఠన్ స్వప్రభయా సర్వం దేహ మభివ్యాప్య స్థిత:, యథా సూక్ష్మోపి దీప: సర్వం గృహం ప్రభయా. అత ఏవాస్య సర్వదేహస్థ శైత్యాద్యుపలంభ: ఇయమేవ జీవప్రభా ధర్మభూతం జ్ఞాన మిత్యుచ్యతే - దేహమున హృదయభాగమున ఈ జీవుడు అణు స్వరూపముతో నివసించును. అణుస్వరూపమయినను ఇతడు జ్ఞాన రూపుడు. దీపము వంటివాడు. దీపమెంత చిన్నదైనను ఇల్లంతట తన వెలుతురును ప్రసరింపజేయును. అట్లే యీతడు దేహమంతయు తన జ్ఞానకాంతిని ప్రసరింపజేయును. అందువలననే హృదయమునందున్నను సమస్త దేహములో ఎక్కడ ఏమిజరిగినను తాను తెలిసికొనగలడు. జీవుని యొక్క యీ జ్ఞానకాంతియే జీవుని ధర్మముగానున్న 'జ్ఞానము' అందుము.

13. 'జ్ఞానమేవ జీవ:' ఇతి అద్వైతిన:. తదసత్. 'అహమిదం జానామి' ఇతి అనుభవాత్ జ్ఞాతురేవ జీవత్వాత్, జ్ఞానవానేవ జ్ఞాతా, నతు జ్ఞానం జ్ఞాతా, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయానాం పరస్పరం భేదాత్ - అద్వైతులు 'జ్ఞానమే జీవుడని' చెప్పుచున్నారు. అది సరికాదు. 'నేను ఇది ఎఱుగుదును' అను లోకానుభవ వాక్యమున ఎఱుగుట, అను జ్ఞానమునకు జీవుడు కర్తగా నున్నాడు. కనుక జీవుడు ధర్మి. జ్ఞానము వాని ధర్మము. జ్ఞానము కలవాడు జ్ఞాత. జీవుడు జ్ఞాత. అంతేకాని జీవుడే జ్ఞానము కాదు. జ్ఞానమే జ్ఞాత కాదు గదా! (కన్నే చూపు కాదు గదా. కన్ను = చూపు గలది అలా) జ్ఞాత - జ్ఞానము - జ్ఞేయము అనగా తెలిసికొనువాడు - తెలిసికొనుట - తెలిసికొనదగిన విషయము = ఈ '3' భిన్నములుగానుండుట సహజము కనుక.

14. జ్ఞాతాపి జీవ: సర్వం న జానాతీతి కించిత్‌జ్ఞ ఏవ. నిత్యముక్త జీవా తు సర్వజ్ఞా, తయో: జ్ఞానస్య ఈశ్వరానుగ్రహేణ అపరిచ్ఛిన్నత్వలాభాత్. నిత్యముక్తౌ పరమపదే వైకుంఠే వర్తమానౌ నిర్ధూత నిఖిలోపాధిక నిరతిశయ బ్రహ్మానందమనుభవత: ఈశ్వరవత్ అత ఏవ తయో: ఈశ్వరసామ్యం శ్రూయతే. బద్ధస్తు సంసారీ సుఖం దు:ఖం చ అనుభవతి పరిచ్ఛిన్నమేవ

**తత్తజ్జన్మను కర్మప్రయుక్తేషు దేవమనుష్యాదిషు. తత్తచ్ఛరీర సంయోగ వియోగాత్మక జన్మమరణే చ అనుభవతి** - జీవుడు 'జ్ఞాత' అన్నంత మాత్రమున అతడు సర్వజ్ఞుడు కాడు. 'కించిద్‌జ్ఞుడు - అనగా కొంచెము పరిమితముగా జ్ఞానము కలవాడు. నిత్యజీవ ముక్తజీవులు మాత్రము సర్వజ్ఞులు. వారికి అటువంటి జ్ఞానమును ఈశ్వరుడు అనుగ్రహించెను. అందువలన వారి జ్ఞానము అపరిమితము. ఈ నిత్యముక్తులు వైకుంఠమున నివసించి అఖండ బ్రహ్మానందమును అనుభవించుచుందురు. అందువలనే వీరికి ఈశ్వరునికి సామ్యము చెప్పబడినది. బద్ధజీవుడు మాత్రము కర్మఫలముగా దొరికిన ఆయా దేహములకు పరిమితమై లభించిన సుఖమునో దుఃఖమునో అనుభవించును. (కట్టి వేసిన దూడ అందిన వఱకు గడ్డి మేయును. వదిలిన దూడ స్వేచ్ఛగా తిరుగును - అది స్థితి) ఈ జీవునకు శరీరము వచ్చిన జననము, శరీరము పోయినచో మరణము అను భావనలు ఉండును.

15. **స్వతస్తు జన్మాది షడ్భావవికారశూన్య ఏవ పురుషః, అత ఏవ 'అజోనిత్యః శాశ్వతః' ఇతి శ్రూయతే. యద్యపి ప్రకృతిరప్యజైవ. 'అజామేకాం ఇతి శ్రుతేః తథాపి సూక్ష్మప్రకృతిరేవ అజా, స్థూలా తు దేహేంద్రియ రూపా పృథివ్యాది రూపా చ సాదిరేవ. అత ఏవ అనిత్యా చ ఇయం చ స్థూలప్రకృతిః సృష్టేః ప్రాక్ సూక్ష్మప్రకృతిరూపేణ వర్తతే ఇతి న అసత్కార్యవాద ప్రసంగః**- నిజమునకు జీవునకు 'పుట్టుట, పెరుగుట మొదలైన '6' భావవికారములు లేవు వేదము వీనిని 'పుట్టుట లేనివాడు నిత్యుడు' అని చెప్పుచున్నది. ప్రకృతి గూడా 'అజ' = అనగా పుట్టుకలేనిది అని వేదము చెప్పుచున్నది. అనగా జీవుడు = అజుడు, ప్రకృతి = అజ ప్రకృతి. 2 విధములు గదా (వెనుక చెప్పబడినది) అందు సూక్ష్మ ప్రకృతి మాత్రమే అజ అనగా పుట్టుకలేనిది. స్థూల ప్రకృతి (మనకు కనబడు ప్రపంచము అనగా భూమి మొదలైనవి, మన శరీరేంద్రియములు మొదలైనవి) మాత్రము పుట్టుక గలదే. కనుక అనిత్యము అనగా వీనికి సృష్టి ప్రళయములు, జనన మరణములు గలవు. అందుకని యీ సృష్టి అంతకుముందు అసలులేనిది కొత్తగా పుట్టినది అని అర్థము కాదు. చెట్టు బీజములోనున్నట్లు ఈ స్థూల ప్రకృతి 'సూక్ష్మప్రకృతి' లో లీనమయి యుండును. కనుక 'అసత్కార్య

వాదము(అనగా ప్రపంచము అంతకుముందు లేదు. క్రొత్తగా చేయబడినది కాదు. సత్కార్యవాదమే. (ఉన్నజగత్తు స్థూలముగా పరిణమించినది.)

16. **అయం చ జీవః స్వభావతః ప్రకృత్యసంస్పృష్టోపి ఈశ్వరమాయామోహితత్వాత్ ప్రకృతౌ అహం మమాభిమానవాన్ సన్ ప్రకృతి సంస్పృష్టో భవతి. ఏతత్ప్రకృతి సంసర్గకృత ఏవాయం జీవస్య సంసారః** - జీవునకు సహజముగా ప్రకృతిబంధము లేదు. కాని ఈశ్వరమాయవలన ప్రకృతి యందు 'నేను, నాది' అను బంధము ఏర్పడును. ఈ 'సంగము' వలననే జీవునికి 'సంసారము' ఏర్పడినది.

17. **ప్రకృతి సంసర్గశ్చ జీవస్య ద్వివిధః. స్థూలప్రకృతిసంసర్గః సూక్ష్మప్రకృతి సంసర్గశ్చేతి. దేహః స్థూలః స్థూల ప్రకృతిః, సూక్ష్మదేహః సూక్ష్మప్రకృతిః. ప్రలయేపి సూక్ష్మదేహసంసర్గః అస్త్యేవ ఇతి జీవస్య న తదా ముక్తిః. ఏవం సూక్ష్మదేహవంతః సర్వేపి జీవాః బద్ధాః, ప్రలయే అవ్యాకృత నామకేశ్వర శక్తి భూత సూక్ష్మ ప్రకృతౌ నిలీయ వర్తంతే, మధుపిష్టే స్వర్ణరేణువత్. తదానీం న తేషాం కిమపి జ్ఞానం, తమోభిభూతత్వాత్ సుషుప్తివత్** - జీవునకు '2' రకముల ప్రకృతితోను సంసర్గముండును. స్థూలప్రకృతి అనగా శరీరముతో సంబంధము కలదు. సూక్ష్మ ప్రకృతి అనగా ఇంతకు ముందు చెప్పిన సూక్ష్మశరీరముతోను సంబంధముండును. ప్రలయ కాలమునందు గూడ (మరణకాలమునందు స్థూలదేహ సంబంధము తొలగును) సూక్ష్మ దేహము తొలగదు. కనుక జీవునకు మరణముతో గాని ప్రలయముతో గాని ముక్తి కలుగదు. కనుక సూక్ష్మ దేహము తొలగనంతవఱకు జీవునకు బంధము ఉన్నట్లే. ఇటువంటి బద్ధ జీవులందఱును ప్రలయకాలమున, 'అవ్యాకృతుడు' (విస్తరింపని వాడు = విత్తనమువంటి వాడు) అయిన ఈశ్వరుని యందు అనగా ఆయన శక్తి అయిన సూక్ష్మ ప్రకృతియందు 'లీన' మయి యుందురు. మైనములో బంగారు రేణువలె అతికికొని యుందురు. ఆ దశలో వారికి ఏ జ్ఞానమున్ను ఉండదు. గాఢ నిద్రలో (సుషుప్తి) లాగున ఈ ప్రలయదశలోను వారికి చీకటి వంటి అజ్ఞానమే.

18. **ఏవం జీవస్య కదాచిత్ జ్ఞానముద్భవతి, కదాచిత్ నశ్యతి, కదాచిత్ సంకుచతి, కదాచిత్ వికసతి ఇతి హేతోః న జీవః జ్ఞానమ్, కింతు జ్ఞాతైవ**

- ఈవిధముగా జీవునకు సుషుప్తి యందు, ప్రలయకాలమునందు జ్ఞానము లేదు. కనుక జీవుడు స్వయముగా 'జ్ఞానమే' అని అద్వైతులు చెప్పినది కుదరదు. స్వయముగా జ్ఞానమే అయినచో ప్రలయదశలోను జ్ఞానముండవలెను గదా! జీవుడున్నపుడు జీవ స్వరూపమయిన జ్ఞానము ఉండి తీఅవలెను. (దీపము ఉన్నచో వెలుగు తప్పదు గదా కనుక జీవుడు, వత్తి వంటివాడు. అతని జ్ఞానమును వత్తికి వెలుగువలె 'ఉండుట, పోవుట' అను దశలు గలవు) లేదు కనుక జ్ఞానము అతని స్వరూపము కాదు. అతని గుణము మాత్రమే. అతడు జ్ఞాత అనగా జ్ఞానము కలవాడు.

19. ***ఈశ్వరస్తు చేతనః, నిత్యః, సత్యః, అజః, అనాదిః, ప్రకృతి పురుష విలక్షణః నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణైకతానః, అపరిచ్ఛిన్నః, అపరిచ్ఛిన్న జ్ఞానానందః, సర్వాంతర్యామీ, ప్రకృతి పురుషశరీరకః, ప్రకృతి పురుషయోరపి ఆత్మా ఇతి పరమాత్మా*** - ఈశ్వరుడు జీవుని కన్న భిన్నమయిన వైభవము కలవాడు. జ్ఞాత, నిత్యుడు, సత్యుడు, పుట్టుకలేనివాడు, ఆదిలేనివాడు ప్రకృతి కన్నను పురుషుని (జీవ) కన్నను భిన్నమయినవాడు మంగళ గుణములు గలవాడు, అఖండ వ్యాప్తి గలవాడు, అపరిమితమయిన జ్ఞానానందములు గలవాడు, సర్వాంతర్యామి, ప్రకృతి పురుషులే శరీరముగా వారికి ఆత్మగా నున్నవాడు, అందువలన 'పరమాత్మ' అని పేరు పొందిన వాడు.

20. ***సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వశక్తిత్వాదిభిః సర్వోత్కృష్ట ఇతి పురుషోత్తమః అదృశ్యః, సర్వద్రష్టా,*** - ఆయన సర్వజ్ఞుడు సర్వేశ్వరుడు, సర్వశక్తిమంతుడు సర్వోత్కృష్టుడు. కనుక పురుషోత్తముడు. ఆయన్ను ఎవరును చూడలేరు. ఆయన సర్వమును చూచును.

21. ***జీవవత్ కరణాధీనజ్ఞానః, జీవః యథా జ్ఞేయం మన ఆదికరణైః జానాతి నతు తథా ఈశ్వరః. కింతు 'అపాణిపాదో జవనో గ్రహీతా' ఇతి శ్రుతేః కరణరహిత ఏవ వేత్తి సర్వమ్*** - జీవుని జ్ఞానము సాధనములయిన మనస్సు ఇంద్రియముల మీద ఆధారపడినది. ఈశ్వరుని జ్ఞానము అట్లు అధీనము కాదు. 'కాలు సేతులు లేకుండగనే సంచరించ గలడు, స్వీకరింపగలడు' అని వేదవాక్యము. కనుక, కరణములు అనగా సాధ్యములు లేకుండగనే అన్నియూ గ్రహించును.

22. ప్రకృతిపురుషసంయోజనద్వారా సర్వజగదుదయ విభవ లయలీలః, సర్వశేషీ స్వానందానుభవశాలీ, సంకల్పధృత విరాడ్విష్ణు రామకృష్ణాది బహు రూపతయా దృశ్యః, ముక్తజీవోపభోగ్యః, సర్వశాసిత్వత్వేన సర్వభయహేతుః కార్యకరణ ప్రవర్తకత్వేన సర్వసుహృత్, ముక్తి ప్రదత్వేన భక్తానా మభయ హేతుః - ప్రకృతి పురుషులను కలుపుట ద్వారా సమస్త ప్రపంచమును కనిపెంచి త్రుంచువాడు, సర్వమునకు భోక్త (శేషి) అయిన వాడు స్వానందమును అనుభవించువాడు, సర్వలోకమును శాసించువాడు కనుక భయంకరుడు, కార్యకరణములను నడపించువాడు కనుక సర్వమిత్రుడు, మోక్షమును ప్రసాదించును కనుక అభయంకరుడు - ఈశ్వర లక్షణములు ఇవి.

23. జీవవదయమపి జ్ఞాతైవ. న జ్ఞానమాత్రమ్. నచ 'సత్యంజ్ఞానమనంతం' ఇతి శ్రుతివిరోధః. జ్ఞానస్య స్వరూప నిరూపక ధర్మత్వేన ఈశ్వరస్య 'జ్ఞానమ్' ఇతి వ్యపదేశః, జీవస్యచ. జ్ఞానవత్త్వస్య జీవేశ్వర లక్షణత్వాత్. ఈశ్వరస్య జ్ఞానంతు న సంకోచాది వికారాన్ భజతే తమ ఆద్యనభిభూత త్వాత్ - జీవునివలె ఈశ్వరుడున్ను జ్ఞాతయే. అనగా జ్ఞానశక్తి కలవాడే. కేవలము జ్ఞానము మాత్రమే కాదు (అనగా జ్ఞాన స్వరూపుడు, జ్ఞాన ధర్మము కలవాడు - దీపము. స్వయముగా కాంతి అట్లే వ్యాపించునట్టి కాంతి గలది అన్నట్లు) అయితే వేదము బ్రహ్మను 'సత్యంజ్ఞానం' అని జ్ఞానస్వరూపునిగా చెప్పుచున్నది. కనుక జ్ఞానస్వరూపమే అనవలెను. కాని జ్ఞానము జీవునకు గాని ఈశ్వరునికి గాని స్వరూపమును నిరూపించు ధర్మము కనుక జ్ఞానమునే స్వరూపముగా చెప్పుట జరిగినది. (బంగారపు రంగు వానిని బంగారమే అన్నట్లు) అందువలన వేదము ఆ విధముగా లక్షణగా చెప్పినది. కనుక జీవుడు కాని ఈశ్వరుడు గాని జ్ఞాతలే. అనగా జ్ఞానము ధర్మముగా గలవారే. అంతే తప్ప కేవల జ్ఞానస్వరూపులు కారు. అయితే ఈశ్వరజ్ఞానమునకు పరిమితి మొదలైన మార్పులు ఉండవు. దానికి అజ్ఞానము మొదలైన ఆవరణలు పనిచేయవు. (జీవుని జ్ఞానము పరిమితము. దానికి అహంకారమమకారములు మొదలైన ఆవరణములు గలవు)

24. కామసంకల్పాదయః ఈశ్వరస్యాపి స్వధర్మా ఏవ. 'తదైక్షత' ఇత్యాది శ్రుతేః

వతు ప్రకృతిధర్మాః, జడత్వాత్ తస్యాః, నాపి మాయాధర్మాః ప్రకృతేరేవ మాయాపదార్థత్వాత్. యద్వా ఈశ్వర సంకల్పస్యైవ మాయాత్వాత్. 'మాయా సాంకల్పిక జ్ఞానమ్' ఇతి నిఘంటు దర్శనాత్. అమోఘ సంకల్ప వత్వాదేవాయం 'మాయీ' ఇత్యుచ్యతే - 'తదైక్షత' అనగా ఆ బ్రహ్మము సృష్టి కావలయునని సంకల్పించెను. అను వేదవాక్యము వలన బ్రహ్మము నకు కామము, సంకల్పములు కలవని తెలియుచున్నది. సృష్టి కారణము 'ప్రకృతి' కనుక ఇవి ప్రకృతి ధర్మములని లేక మాయా ధర్మములని భ్రమపడరాదు. ప్రకృతియన్నను మాయ అన్నను ఒక్కటే. 'మాయ' అను పదమునకు సంకల్పమని నిఘంటువులో అర్థము గూడా కలదు. కనుక భగవంతుని సంకల్పమే మాయ. అదే ప్రకృతి. అమోఘమయిన ఆ సంకల్పము (మాయా) కలవాడు కనుకనే ఆయన 'మాయీ' లేదా 'మాయావి' అని చెప్పబడును. కనుక సృష్టి సంకల్పము సృష్టి కామము అనునవి ఈశ్వరుని సొంత ధర్మములు.

25. ప్రకృతి పురుష విశిష్టోపి నిత్యముక్తోయం జీవస్య ఆత్మభూతోపి పరోక్షః శాస్త్రానుమానాదినాగమ్యః. తచ్చ శాస్త్రం ఈశ్వరకృత మేవ. 'తస్య మహతో భూతస్య నిశ్వసితమేతత్ యదృగ్వేదః- ఇతి శ్రుతేః. 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః వేదాంతకృద్వేదవిదేవ చాహం-ఇతి గీతావచనాచ్చ - ఈశ్వరుడు ప్రకృతి పురుషులతో కల్సియుండును కనుక విశిష్టుడు. అయినను వారితో 'సంగము' బంధము లేక నిత్యముక్తుడుగా విలసిల్లును. జీవుడు ఈయనకు శరీరము. జీవునకు ఈయన ఆత్మ అయినను జీవునకు ప్రత్యక్షము కాడు, శాస్త్రమును బట్టి అనుమాన ప్రమాణమును బట్టి మాత్రమే జీవుడు ఈశ్వరుని ఊహింపగలడు. ఆ శాస్త్రమయినను ఈశ్వరుడు సృజించినదే. అందుకు వేదము ప్రమాణము 'ఆ మహాభూతము (బ్రహ్మము) యొక్క నిట్టూర్పుల వంటివే వేదములు'. గీతయు ప్రమాణమే. వేదములన్నియు నన్నే వర్ణించును. వేదాంతములను నేనే సృజించితిని. వేదవేత్తను గూడా నేనే.

26. అయం చ ఈశ్వరః హృది అర్చాయాం సూర్యేవా యః ఆత్మానం భక్త్యా సేవంతే తేభ్యః ముక్తిం దిశతీతి భక్తి మార్గ ఏవ సాక్షాత్ మోక్షదః. మోక్షః పరమపద ప్రాప్తిః. నచ పరమపదం గతః న పునరావర్తతే. బ్రహ్మరుద్రాది

**లోకాన్ గతాస్తు పునరావర్తంతే. ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున, మాముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే' ఇతి గీతావచనాత్ -** హృదయమునందున్నట్లు, విగ్రహమునందున్నట్లు, సూర్యబింబమునందున్నట్లుగను, ఈశ్వరుని ధ్యానించి పూజించుటయే భక్తి మార్గము. ఈ మార్గమునందున్న వారికి భగవంతుడు మోక్షమును ఈయగలడు. కనుక భక్తి మార్గమే మోక్షమార్గము. మోక్షమనగా పరమపదమయిన వైకుంఠమును చేరుటయే. అందుచేరిన వారికి తిరిగి జన్మము లేదు. బ్రహ్మరుద్రాది లోకములకు వెళ్లిన జీవులకు తిరిగి జన్మము గలదు. అందుకు గీతా వాక్యము ప్రమాణము. బ్రహ్మలోకము వఱకు ఉన్న లోకములు పునర్జన్మ లోకములు. కాని, అర్జునా! నన్ను చేరిన వారికి 'పునర్జన్మ' లేదు.

27. **జీవస్య ఈశ్వర సామ్యాపత్తిరేవ. నతు సాయుజ్యప్రాప్తిః. సతి సాయుజ్యే జీవస్య స్వరూపనాశ ప్రసంగేన సాయుజ్యస్య అపురుషార్థత్వాత్ నిత్యస్య జీవస్య నాశాయోగాచ్చ** - జీవునకు ఈశ్వరునితో సమానమయిన ఆనందానుభవమే మోక్షానందము. అంతేగాని (అస్తిత్వము లేకుండా జలబిందువు జలములో కల్సినట్లు) సాయుజ్య మోక్షము లేదు. ఎందువలన అనగా, సాయుజ్యము అంగీకరించిన పక్షమున జీవుడే లేడు. ఇంక అతనికి బ్రహ్మానందమును అనుభవించుట' అనుదశ ఎట్లు కలుగును? పురుషుడు అనుభవించునది పురుషార్థము. పురుషుడే లేని దశలో పురుషార్థము లేదు. కనుక సాయుజ్యములో మోక్షమును పురుషార్థము అని చెప్పుటకు వీలు లేదు. పైగా జీవుడు నిత్యుడు గదా. సాయుజ్యములో కఱిగిపోయినచో అతడు అనిత్యుడే అనవలసి వచ్చును. అది వేద విరుద్ధము

28. **పరమపదం ప్రవిష్టశ్చ ముక్తః అప్రాకృత దివ్యమంగళ విగ్రహః శంఖ చక్రాది ధారీ సన్ తథా విధైరేవ ముక్తైః నిత్యైశ్చ సూరిభిః సాకం లక్ష్మీ విశిష్టం శ్రీ మహావిష్ణుం సేవమానః పరబ్రహ్మానందం అనుభవన్ వర్తతే ఇతి ఏషః ప్రతివాది దర్శనసారసంగ్రహః** - పరమపదమును ప్రవేశించిననాడు ముక్తుడగును. వానికి దివ్యమంగళ శరీరము, శంఖ చక్రాది చిహ్నములు ఏర్పడును. తనవంటి ముక్త జీవులయిన జ్ఞానులతో కలసి లక్ష్మీ సహితుడైన శ్రీ మహావిష్ణువును సేవించును. పరబ్రహ్మానందమును అనుభవించును. ఇది ప్రతివాదుల (వైష్ణవుల) దర్శన సార సంగ్రహము.

29. *వాదిమతం తు మయా వేదాంతదీపికాదిషు స్ఫుటం ప్రదర్శితమేవ. అపరిచ్ఛిన్న సత్యజ్ఞానానందరూపః ఈశ్వర ఏవ జీవః ఇతి. అత్ర విచార్యతే* - వాది (అద్వైత) మతమును నేను (రామారావుగారు) వేదాంత దీపిక మొ॥ గ్రంథములందు స్పష్టముగా ప్రదర్శించితిని. 'అఖండ, సత్యజ్ఞాన, ఆనంద స్వరూపుడయిన ఈశ్వరుడు జీవుడే' అని వాది సిద్ధాంతము. ఈ విషయమే విచారణ చేయబడును.

30. *కిం జీవః పరిచ్ఛిన్నః ఉత అపరిచ్ఛిన్నః? కిం ఈశ్వర ఏవ జీవః? యద్వా ఈశ్వరస్య శరీరం జీవః? కిం జ్ఞాన మేవ ఈశ్వరః? జీవశ్చ? ఉత జ్ఞాతా కిం ముక్త జీవస్య బ్రహ్మసామ్యం? ఉత బ్రహ్మ సాయుజ్యమ్? కిం జ్ఞానాదేవ కైవల్యమ్? ఉత భక్తేః? కిం అవన్య శేషః సర్వ శేషీచ జీవః? యద్వా బ్రహ్మణఃశేషః?- ఇత్యాదిః*

విచారింపవలసిన అంశములు ఇవి.

1. జీవుడు ఖండ రూపమా? అఖండ రూపమా?
2. ఈశ్వరుడు జీవుడా? ఈశ్వరశరీరము మాత్రమే జీవుడా?
3. ఈశ్వరుడు మాత్రమే జ్ఞాన స్వరూపుడా? జీవుడున్నూ జ్ఞాన స్వరూపుడా? లేక వీరు జ్ఞానము ధర్మముగా గల జ్ఞాతలా?
4. ముక్త జీవుడు బ్రహ్మముతో సమానత్వమును మాత్రమే అనుభవించునా? లేక బ్రహ్మములో లీనమయిపోవునా?
5. కైవల్యము జ్ఞానమాత్రము చేతనా? లేక భక్తి వలననా?
6. జీవుడు బ్రహ్మకు శేషమా? లేక స్వయముగా శేషియా? మొ॥

31. *తథాహి! జీవః పరిచ్ఛిన్న ఏవ, అతిసూక్ష్మదేహేపి సత్వాత్. యద్యపి విభోరపి గగనస్యేవ సూక్ష్మేపి సత్వం భవితు మర్హతి. తథాపి విభుః దేహాత్ బహిరపి వర్తేత, నతు జీవః దేహాత్ బహిర్వర్తతే, గగనవత్ వ్యాపిత్వమీశ్వరస్యైవ. 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' ఇతి శ్రుతేః* - ముందు పూర్వ పక్ష సారాంశము : 'జీవుడు ఖండరూపుడే. అతి సూక్ష్మమయిన క్రిమి, కీటకాది శరీరములందును ఉన్నందువలన జీవుడు 'ఖండరూపుడు' అని చెప్పవచ్చును. అయితే సర్వవ్యాపి' అయిన ఆకాశము (ఖాళీ

ప్రదేశము) అతి సూక్ష్మ స్థలములందు ఉన్నట్లే 'జీవుడు' ఉన్నాడు. కనుక అంతమాత్రమున 'ఖండస్వరూపుడు' అని చెప్పుటలేదు. ఆకాశము లోపల బయట అంతట వ్యాపించినది. కాని జీవుడు 'శరీరముల బయట దొఱకుట లేదు. కనుక సర్వత్ర అనగా లోపల బయట ఆకాశము వలె వ్యాపించినవాడు ఈశ్వరుడు మాత్రమే' అంతః బహిశ్చ- అను వేదము ఇందుకు ప్రమాణము.

32. *నారాయణోహ్యంతర్యామీ, 'న లీయంతే, న క్షీయంత, ఇతి నరాః జీవాః తేషాం సమూహః నారం తస్య అయనం ప్రవృత్తిః యస్మాత్ సః నారాయణః ఇతి వ్యుత్పత్తేః అంతస్స్థిత్వా యమయతి జీవానితి 'అంతర్యామీతి' వ్యుత్పత్తేశ్చ-అంతర్యామిత్వం చ ఈశ్వరస్యైవ అసాధారణో ధర్మః. 'య ఆత్మని తిష్ఠ' ఇతి అంతర్యామి-బ్రహ్మణాత్. 'కేనాపి దేవేన హృది స్థితేవ యథా నియుక్తోస్మి తథా కరోమి ఇతి పురాణాత్. 'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి' ఇతి స్మరణాత్. జీవ పారతంత్ర్యస్య అనుభవసిద్ధత్వాత్ చ ఇతి పూర్వపక్షః* - నారాయణుడు 'అంతర్యామి' నారాయణ పదమునకు వ్యుత్పత్తి ఇది.

నర = లీనముకానివారు అనగా నాశము కానివారు = జీవులు

నార = వారి సమూహము = నారము

అయన = జీవ సమూహము యొక్క ప్రవృత్తికి కారణమయిన వాడు

నారాయణ = జీవ సమూహములకు వాని ప్రవృత్తికి కారణమయిన వాడు - అని అర్థము. మఱియు, 'అంతర్యామి' అనగా లోపల నుండి జీవులను నియమించువాడు' అను వ్యుత్పత్తి వలన, జీవులలో సర్వత్ర వ్యాపించి యుండుట. నారాయణుని అసాధారణ ధర్మము. ఈ విషయమునకు ప్రమాణము.

1. 'ఎవడు లోపల ఉండి అందఱిని నియమించునో'-అను అంతర్యామి బ్రాహ్మణము. (2) 'నా లోపల హృదయములో నున్న ఎవరో దేవుడు ఎట్లు నియమించునో అట్లు చేయుదును'-పురాణము (భారతము) (3) 'అర్జున' సర్వ జీవుల హృదయమున ఈశ్వరుడు కలడు'-అను గీతావాక్యము. (4) 'జీవుడు పరాధీనుడుగా నుండుట' అను లోకాను భవములు. ఇంతవఱకు పూర్వ పక్షము.

33. అద్వైత పక్షః
న జీవః పరిచ్ఛిన్నః, పరిచ్ఛిన్నత్వే జీవస్య ఘటాదివత్ అనిత్యత్వాపత్తేః జడత్వాపత్తేశ్చ. నచ పరిచ్ఛిన్నోపి జీవః నిరవయవత్వాత్ పరమాణువత్ నిత్య ఇతి వాచ్యమ్, నిత్య పరమాణు సద్భావే మానాభావాత్. బ్రహ్మాతిరిక్తస్య నిత్య వస్తున ఏవ అభావాత్. 'తత్సత్యమతోన్యదార్తం'- ఇతి శ్రుతేః సత్యస్యైవ నిత్యత్వాచ్చ -

'అద్వైత మతము'
జీవుడు ఖండరూపుడు కాడు. సర్వవ్యాపియే. ఖండరూపుడు అని అంగీకరించినచో 'కుండ' మొ॥ వాని వలె 'నిత్యము గానివాడు' అని కుండవలె 'జడపదార్థము' అని చెప్పవలసి వచ్చును. (ఎందుకంటే బ్రహ్మముకంటే భిన్నముగా శాశ్వత మయినది, చేతనమయినదియు లేదు. జీవుడు ఖండస్వరూపుడయినను అవయవ విభాగము లేని కారణముగా 'పరమాణువు' వలె నిత్యమయిన వాడు- అని చెప్పుటకు కూడా అవకాశము లేదు. 'పరమాణువు నిత్యమే' అని ప్రమాణములేదు. బ్రహ్మము తప్ప నిత్య వస్తువు లేదు. మిగిలినవి అన్నియూ అనిత్యములే. 'బ్రహ్మము సత్యము, దానికి భిన్నమయినది సత్యము కాదు' అని వేదము. సత్యమయినదే నిత్యము.

34. ఏవం జీవస్య నిత్యత్వాదేవ బ్రహ్మాభేదః తత ఏవ అపరిచ్ఛిన్నత్వం చ. బ్రహ్మ హి అపరిచ్ఛిన్నమ్. నచ దేహాత్ బహిః ఘటాదౌ జీవః నాస్తీతి వాచ్యమ్. తత్రాపి జీవ సత్త్వాత్ - జీవుడు నిత్యుడు కనుక బ్రహ్మముతో అభేదము. (అనగా బ్రహ్మము జీవుడు ఒక్కటే కనుక జీవుడున్నూ నిత్యుడే అని చెప్పుట) అందువలననే జీవుడు సర్వవ్యాపి, అఖండుడు. బ్రహ్మము సర్వవ్యాపి అఖండము కదా! అయినచో దేహమునందే కాక సర్వత్ర ఈశ్వరుని వలె జీవుడున్నూ ఉండవలె కదా. మఱి లేదేమి? అను ప్రశ్న వచ్చును. సమాధానము ఏమనగా దేహమునందే కాక బయట ఉన్న 'కుండ' మొ॥ వాని యందును జీవుడు కలడు-అనియే

35. నను తర్హి కుతో ఘటాదౌ జీవస్య అహంగ్రహోభావః ఇతి చేత్, తత్ర అంతఃకరణాభావాత్. యత్ర అంతఃకరణమస్తి తత్రాహమితి స్ఫురత్యాత్మా. అత ఏవ సుషుప్తౌ దేహే అంతఃకరణాభావాత్ అహం. ఇతి అస్ఫురణ

**మాత్మన:** - ఘటమునందు గూడా జీవుడు గలడు. అయినను అచ్చట 'మనిషికి' ఉన్నట్లు ఘటమునకు 'నేను' అను 'భావన' లేదు. 'అందుకు కారణము దానికి అంతఃకరణము లేకపోవుటయే. అంతఃకరణము ఉన్నచోట మాత్రమే 'అహం' అని ఆత్మస్ఫురణ కలుగును. కనుకనే సుషుప్తిలో (గాఢ నిద్రలో) దేహమునందు అంతఃకరణము లేకపోవుట వలన 'నేను' అను స్ఫురణ ఉండదు. అంతఃకరణమనగా జీవుని ఆలోచనా యంత్రాంగము, మనస్సు, బుద్ధి, అహంకారము మొ॥.

36. ***నను యది జీవః ఘటేపి స్యాత్ తర్హి దేహవత్ ఘటోపి చేతనః స్యాత్, దేహజన్మ మరణాభ్యామివ ఘటజన్మ నాశాభ్యామపి ఘటో జాతః మృతః ఇతి వ్యవహారః స్యాత్ ఇతి చేత్*** - అయితే ఇచ్చటనొక సందేహము వచ్చును. జీవుడు ఘటమునందు గూడ ఉన్నాడు గదా. అట్లే దేహమునందు గూడా ఉన్నాడు. దేహమునకు జీవసంపర్కము వలన జనన మరణములు గలవు. అట్లే ఘటమునకు గూడా జనన మరణములు (పుట్టినపుడు పగిలి నపుడు) అను లోకాచారము లేదు గదా! (కుండ పగిలింది అంటారు కాని కుండ చచ్చింది అనరు గదా!

37. ***మైవమ్. ఘటే జీవ సద్భావః తథాస్తామ్. వ్యాపినః చేతయితుః ఈశ్వరస్య ఘటేపి సత్వాత్ కుతః న ఘటస్య చైతన్య లాభః? కుతోవా ఘటోదయ నాశాభ్యాం ఈశ్వరస్య జన్మనాశవ్యవహారా భావః? తస్మాత్ దేహస్య సూక్ష్మ దేహసంబంధ ప్రయుక్త మేవ చేతనత్వమ్, న జీవేశ్వర సంబంధ ప్రయుక్తమ్*** - (ఇచ్చట అద్వైత మతమున, ఘటమున్ను జీవుడే ఆ జీవుడున్ను బ్రహ్మమే. అయితే ఘటమునకు అంతఃకరణము లేదు గనుక మనవలె దానికి జీవితము లేదు. విశిష్టాద్వైతమున, ఘటము జడము జడములందు ఈశ్వరుడు మాత్రము వ్యాపించియుండును. జీవుడు ఉండడు. జీవుడు వేఱు బ్రహ్మము (ఈశ్వరుడు)వేఱు అని వారి మతము. దీనిని దృష్టిలో పెట్టికొని యీ వాదము చదువవలయును) అట్లు కాదు. 'ఘటము చచ్చినది' అను వ్యవహారము ఎందుకు రాలేదు అనియు ఘటమునందు జీవుడు ఉన్నప్పుడు ఈ వ్యవహారము వచ్చి తీఱవలె కదా! అనియు నీ వాదము. సరే దానిని అవతల ఉంచుము. నీ వాదము ప్రకారము ఘటమునందు జీవుడు లేకపోయినను ఈశ్వరుడు కలడు కదా! మఱి

ఘటము తయారయినపుడు, పగిలినవుడు గాని ఈశ్వరునకు గూడా జనన మరణములు జరిగినట్లు ఎందుకు అనుకొనుట లేదు? కనుక దేహమునకు అంతఃకరణము ఉండుట వలననే చేతన ధర్మములు కలవు గాని దానియందు 'జీవుడు లేదా ఈశ్వరుడు' ఉండుట వలన కాదు. (కనుక అంతఃకరణము ఉన్నచోట జీవి అను వ్యవహారము, చావు పుట్టుకలు మొ॥ వ్యవహారము కలదు. అది లేని చోట ఈ వ్యవహారములున్ను లేవు. అదే 'కుండ' మొ॥ జడపదార్థముల విషయములో జరిగినది. అనగా కుండయందు అంతఃకరణము లేదు కనుక చావు పుట్టుకల వ్యవహారము లేదు-అద్వైతము. కుండయందు జీవుడు లేడు కనుక చావు పుట్టుకల వ్యవహారము లేదు-విశిష్టాద్వైతము.)

38. ***న చేతయితా జీవ ఏవ ఇతి వాచ్యమ్. అంతఃకరణస్యైవ చేతయితా జీవః తస్యైవ ఈశ్వర చైతన్య ప్రతిఫలన గ్రహణ సమర్థత్వాత్*** - జీవుడే గదా జ్ఞానదాత జ్ఞాని, అంతఃకరణమెట్లు జ్ఞానము కలిగించును? అని శంక. కాని అంతఃకరణమునకు మాత్రమే జీవుడు జ్ఞానదాత. జీవుడే ఈశ్వర చైతన్యమును తనలోనికి ప్రతిబింబించికొని తద్వారా అంతఃకరణమును చైతన్యపఱచును. అంతఃకరణము సుఖము,దుఃఖము మొ॥ గ్రహించును.

39. ***తస్మాత్ అంతఃకరణమ్ వస్తుతో జడమపి చైతన్యాభాసాత్ చేతనమివ భవతి. అత ఏవ అంతఃకరణస్య అహంగ్రహలాభః 'అహం సుఖీ' ఇత్యాది వ్యవహారాత్. దేహాదికం తు అచేతనమేవ*** - పైన చెప్పినట్లు స్వయముగా జడమయిన అంతఃకరణము చైతన్యాభాసుడు అయిన జీవుని వలన చైతన్యము గలిగినట్లు ప్రవర్తించును. దానివలన అంతఃకరణమునకు 'నేను' మొ॥ భావములు కలుగును. కనుకనే 'నేను సుఖపడుచున్నాను' మొ॥ వృత్తులు కలుగును. ఇక దేహము మొ॥ జడపదార్థములే.

40. ***'స్థూలోహం మనుష్యోహం'-ఇతి వ్యవహారస్తు దేహతాదాత్మ్యాధ్యాసాత్ అంతఃకరణస్యైవ, ఇదం సాభాసం అంతఃకరణం యత్రాస్తి స దేహః చేతన ఇతి, స జీవః ఇతి చ వ్యవహ్రియతే. యస్మాదిదముత్క్రాంతం స దేహస్తు నిర్జీవ ఇతి వ్యవహ్రియతే*** - ఈ అంతఃకరణము దేహముతో ఏకమయి 'నేను లావుగా వున్నాను. నేను మనుష్యుడను' మొ॥ ఆలోచనలు చేయు చున్నది. జీవ చైతన్యము ప్రతిబింబించుటకు సాధనమయిన యీ అంతః

కరణము ఉన్నచోట ఆ దేహము చేతనమని జీవుడని, అది లేచిపోయిన చోట ఆ దేహము 'శవమని' లోక వ్యవహారము కలదు.

41. *'అయం జీవః ఇదమంతఃకరణమ్' ఇతి వివేకాభావాత్ లోకస్య అంతః కరణ ధర్మాణాం సుఖాదీనాం జీవధర్మచైతన్యస్య చ పరస్పర మధ్యాసేవ జీవాంతఃకరణయోః అవివేకః జాతః* - అయితే 'వీడు జీవుడు, ఇది అంతః కరణము' అను విభాగము కంటికి కనబడకపోవుట వలన, లోకానికి అన్ని ఒకటిగానే అనిపించి అంతఃకరణధర్మములయిన సుఖాదులున్నూ జీవ ధర్మములుగా కనిపించుచున్నవి. దానితో 'జీవ అంతఃకరణములు' మధ్య తేడా లేకుండపోయినది. నిజానికి జీవధర్మము చైతన్యము. అంతః కరణ ధర్మములు సుఖదుఃఖములు మొ॥

42. *తత ఏవాహం సుఖీతి ప్రత్యేతి జీవోపి, అంతఃకరణతాదాత్మ్యాధ్యాసాత్. యథా దేహతాదాత్మ్యాధ్యాసాత్' అహం మనుష్యః' ఇతి. అత ఏవాస్య జీవస్య పరిచ్ఛిన్నోహం, న దేహాత్ బహిః వర్తే'. ఇతి అనుభవః. అంతః కరణం హి పరిచ్ఛిన్నం దేహాంతరం చ* - లోకమువలెనే జీవుడును 'తాను వేఱు తన అంతఃకరణము వేఱు' అని తెలిసికొనలేక 'తాను-అంతః కరణము' ఒక్కటియని భ్రమించును. అందువలన అంతఃకరణలో ఏర్పడిన సుఖ దుఃఖాది భావనలను తనకు జోడించికొని, నేను సుఖవంతుడను' మొ॥ భావించుచున్నాడు. అతను దేహముతో ఇట్లాగే 'తాను, దేహము ఒక్కటే' అని భావించి, నేను మనుష్యుడను' అని భావించుచున్నాడు. కనుకనే నేను ఈ దేహములోనున్నాను. దేహముకన్న బయట నాకు అస్తిత్వము లేదు' అను పరిచ్ఛిన్న (పరిమిత, ఖండ) భావన జీవునకు (మనిషికి) కలిగినది. ఏమనగా 'అంతఃకరణము' అనునది పరిమితమయిన ప్రత్యేక దేహము. అందువలన ఈ భావనలు.

43. *ఏమ కథం అపరిచ్ఛిన్నస్య ఈశ్వరస్యైవ జీవస్య అంతఃకరణాది తాదాత్మ్యాధ్యాస ఇతి చేత్ నైష దోషః. మాయయా తదుపపత్తేః. అత్యంత దుర్ఘటమపి ఘటయతి హి మాయా గగనాదేః నైల్యాదిక మివ* - అయితే మీ మతము ప్రకారము అఖండుడు సర్వవ్యాపి అయిన ఈశ్వరుడే జీవుడు గదా! అట్టి సర్వజ్ఞునకు అంతకరణముతోను దేహముతోను 'అవి తానే' అనే భ్రాంతి ఎట్లు కలుగును? అని ప్రశ్న. ఈ భ్రాంతికి కారణము 'మాయ'.

అసంభవములను సంభవము చేయునదియే మాయ. శూన్యమయిన ఆకాశము నీలముగా కనబడుట యిట్టిదే కదా. లేనిచో శూన్యమునకు రూపమే లేదు. ఇక రంగు ఎట్లు? కనుక మాయవలన జీవునకు భ్రాంతి.

44. ఏవ మేవం అపరిచిన్నేశ్వరం పరిచ్ఛిన్న జీవీకరోతి మాయా ఇతి మాయా పారతంత్ర్యం ఈశ్వరస్య ప్రాప్తం, ఈశ్వరాభావశ్చ ఇతి చేత్- అంటే అఖండుడు అయిన ఈశ్వరుని పట్టికొని మాయ ఖండముగా చేయుచున్నది. భ్రాంతిలో సంసారములో పడవేయుచ్నుది. కనుక ఈ లెక్కన 'మాయ' గొప్పది గాను, ఈశ్వరుడే మాయకు పరాధీనుడు గాను, కనబడును. పైగా ఇక ఈశ్వరుడెక్కడ? అని సందేహము కలుగును.

45. నైవమ్. మాయయా *గగనే నీలీకృతే పతి కిం గగనస్య నైల్యం ప్రాప్తమ్. కిం వా నీరూపగగనాభావః ప్రాప్తః? తస్మాత్ ఈశ్వరే మాయా జీవత్వం, జగద్వా నిర్మాతు, ఏ తావతాకోపి జీవత్వాదిః ఈశ్వరస్య భవేత్, నాపి ఈశ్వరత్వం అపేయాత్*-అట్లుకాదు. మాయవలన ఆకాశము నీలముగా కనబడును. అంతమాత్రము చేత ఆకాశమునకు రూపమున్నదని, ఆ రూపము నీలమని నిజముగానున్నదా? అట్లే ఆకాశమువంటి ఈశ్వరుని యందు మాయ ప్రపంచమును నిర్మింపవచ్చును. జీవులను నిర్మింప వచ్చును. అంతమాత్రమున ఆకాశము నీలము కానట్లు, ఈశ్వరుడు గూడా జీవుడుగా మాఱడు. తన ఈశ్వరత్వమును కోల్పోవడు.

46. *తస్మాత్ మాయాసృష్ట పరిచ్ఛిన్న నానాంతఃకరణ తాదాత్మ్య ధ్యాసాదేవ అపరిచ్ఛిన్నైకేశ్వరస్య పరిచ్ఛిన్న నానాజీవత్వ వ్యవహారః ఇతి మాయా మయమేవ జీవస్య పరిచ్ఛిన్నత్వం, నానాత్వం చ, వస్తుతస్తు అపరిచ్ఛిన్నేశ్వర ఏవ జీవః*-కనుక, అనేక అంతఃకరణములను సృజించెను. వాటితో ఐక్యము చెందిన ఈశ్వరునికి గూడా (అద్దములలో ప్రతిబింబించిన సూర్యునకు వలె) అనేక జీవులుగా వ్యవహారములో ప్రసిద్ధి వచ్చినది. ఈవిధముగా అసలు ఒక్కడే జీవుడైన ఈశ్వరుడు అనేక జీవులుగా అఖండుడైన ఈశ్వరుడు ఖండస్వరూప జీవులుగా భావింపబడుచుండెను. నిజానికి అఖండ, సర్వవ్యాపి అయిన ఈశ్వరుడే జీవుడు.

47. ఈశ్వర చైతన్య పరిచ్ఛేదకానాం అంతఃకరణానాం మాయాసృష్టత్వేవ

మాయామయత్వాత్ వస్తుతః తదభావాచ్చ. అత ఏవ హి 'ఏకమే వాద్వితీయం బ్రహ్మ' ఇతి శ్రూయతే. 'నేహ నానాస్తి కించన' ఇతి చ.- నిజమునకు ఈశ్వరుడే జీవుడు. ఈశ్వర చైతన్యమును పరిమితము చేయుచున్న అంతఃకరణములు వాస్తవములు కావు. కేవలము మాయా సృష్టి. మాయామయము. కనుకనే 'బ్రహ్మము ఒక్కటే, దానికి రెండవది లేదు' అని, 'ఇచ్చట అనేకములు లేవు, ఉన్నదొక్కటే బ్రహ్మము' అని వేదము చెప్పినది.

48. నచ మాయా సత్యైవ ఇతి వాచ్యమ్, 'యా మా సా మాయా' ఇతి నిరుక్త్యైవ తస్యాః అసత్యత్వ సిద్ధేః. నచ ఈశ్వరస్య సత్యత్వే కథం తచ్ఛక్తేః మిథ్యాత్వ మితి వాచ్యమ్. అగ్నేః సత్యత్వేపి తచ్ఛక్తేః మిథ్యాత్వాత్. సదసదనిర్వాచ్యా హి శక్తిః -మాయ సత్యమని చెప్పుట కూడా కుదరదు. ఏమంటే దాని పేరులోనే అది 'మిథ్య' అని తేలుచున్నది. యా-ఏది, మా-లేనిదో అది మాయా అని నిర్వచనము. ఈశ్వరుడు సత్యమే కదా. మఱి ఆయన శక్తి ఏల సత్యము కాదు అని సందేహము రావచ్చును. అగ్ని సత్యమయినను అగ్ని శక్తి 'మిథ్య' కదా! శక్తి సత్-ఉన్నది అని, అసత్-లేనిది అని నిర్వచింపశక్యము కానిది కదా. (అనగా సత్. అయినచో సర్వకాలము లందు ఉండవలెను. అట్టిది బ్రహ్మము మాత్రమే. 'మాయ' బ్రహ్మ జ్ఞానము కలిగిన తరువాత నశించును. కనుక అది 'సత్తు' కాదు. 'అసత్' అనగా అసలు లేనిది. కాని 'మాయ' జగత్తుగా కనబడుచున్నది. కనుక మాయను సత్తు అనలేము. అసత్తు అనలేము. కనుక 'మిథ్య' అందురు రజ్జుసర్పభ్రాంతిలో రజ్జువు సత్తు, సర్పము మిథ్య)

49. నన్వేవం ముక్తిదశాయాం మాయాభావేన సర్వద్వైతాభావాత్ తదానీం అపరిచ్ఛిన్నః భవతు జీవః, ఇదానీం తు సర్వసత్త్వాత్ పరిచ్ఛిన్నః ఏవ, ఇతి చేత్,- మోక్షము వచ్చిన దశలో 'మాయ' తొలగును కనుక, ఇక 'రెండవది' అనునది లేదు. ఆ సమయమున జీవుడు అఖండుడు, సర్వజ్ఞుడు కావచ్చును. కాని మాయా దశలో 'అనేకత్వము' ఉన్నది కనుక జీవుడు ఖండుడే గదా! అని శంక.

50. మైవమ్. జీవస్య అవికార్యత్వేన సదా ఏకరూపత్వాత్ సర్వదాపి- అపరిచ్ఛిన్న ఏవ జీవః, తస్య పరిచ్ఛిన్నత్వం తు భ్రాంతి సిద్ధమేవ. ఇతి-జీవునకు దశలను

బట్టి ఖండ, అఖండ అను స్థితులు రావు. జీవునకు మార్పులు లేవు. కేవలము ఒక్కడే. ఎప్పుడైనను అఖండ స్వరూపమే. అది అనేకమనుకొనుట భ్రాంతి. (కనుక 'శంక'లో చెప్పినట్లు ముక్తదశలో అఖండుడు బద్ధ దశలో అనేకులు అని లేదు).

51. *నను యదాంతరం తత్ జీవచైతన్యమ్, యత్ బాహ్యం తత్ ఈశ్వర చైతన్యం ఇతి భేద ఏవ జీవేశ్వరయోః ఇతి చేత్*- అయ్యా, శరీరములందు లోపలనుండనిది జీవ చైతన్యమని, బయట నుండునది ఈశ్వర చైతన్యమని జీవేశ్వరులకు భేదము చెప్పవచ్చు కదా!

52. *నైవమ్. చైతన్యం ఏకమేవ, గగనవత్, తస్య ఉపాధి కృత ఏవ ఆంతరత్వ బాహ్యత్వ భేదః, న స్వాభావికః ఇతి*- అట్లు కాదు. ఆకాశము వలె చైతన్యము (జ్ఞానము) ఒక్కటే. అది నివసించిన ఆధారములను (ఉపాధి)బట్టి మాత్రమే లోపలిదని, బయటిదని భేదము. (ఘటములోని ఆకాశము, ఘటము బయటి ఆకాశము అన్నట్లు) అంతేగాని చైతన్యములో సహజముగా భేదము లేదు.

53. *నను యద్యపరిచ్ఛిన్నః జీవః స్యాత్ తర్హి ఏక ఏవ స్యాత్, న చ ఇష్టాపత్తిః సుఖదుఃఖాద్యనుభవ వైచిత్ర్యస్య దురపలాపత్వాత్, ఇతి చేత్*- జీవుడు అఖండుడు అయినచో అతడు ఒక్కడే అని చెప్పవలసివచ్చును. కాని ఒక్కొక్క జీవునకు ఒక్కొక్క రకమయిన సుఖ-దుఃఖ అనుభవములు గలవు కదా! జీవుడు ఒక్కడే అయినచో అన్ని అనుభవములు ఒక్కనివే కావలయును కదా!

54. *నైవమ్. సుఖదుఃఖాదయః సర్వే అంతఃకరణధర్మా ఏవ, తే చ నానా ఇతి న దేవదత్తాంతఃకరణానుభూత సుఖాదేః యజ్ఞదత్తాంతఃకరణ స్మరణ ప్రసంగః*-కాదు. సుఖదుఃఖాదులు అంతఃకరణధర్మములు అని మేము ఇంతకు ముందే చెప్పినాము. వాని భేదమును బట్టి సుఖదుఃఖాదులు అనుభవానికి వచ్చును. ఈ అంతఃకరణములు అనేకములు, కనుక అనుభవములు అనేకములు. దేవదత్తుని అంతఃకరణానుభూతులు యజ్ఞదత్తాంతఃకరణమునకు తగలవు.

55. *నచ సుఖాదయో జీవధర్మాః ఏవ ఇతి వాచ్యమ్. సుషుప్తౌ అంతః*

కరణాభావేన జీవసత్త్వేపి జీవస్య సుఖాద్యుపలంభాభావాత్- సుఖాదులు అంతఃకరణ ధర్మములే తప్ప జీవ ధర్మములు కావు. ఏమనగా సుషుప్తిలో జీవుడున్నను అంతఃకరణము పనిచేయక పోవుట వలన సుఖదుఃఖముల అనుభవము లేదు కదా. కనుక ఇవి అంతఃకరణధర్మములే.

56. న చైవం సుఖాదీనాం కామాదీనాం చ మనోధర్మత్వే జ్ఞానస్యాపి మనోధర్మత్వాత్ జ్ఞానశూన్య ఏవ జీవః జడః స్యాదితి వాచ్యమ్. సుఖ కామాది వృత్తి జ్ఞానానాం మనోధర్మత్వేపి జీవః న జడః జ్ఞానరూపత్వాత్. తద్ధి జీవస్య స్వరూపభూతజ్ఞానం నిత్యం, స్వప్రభం, సర్వావభాసకం, సదైకరూపం సర్వవ్యాపి, సర్వాంతరం, సర్వోపాధి వినిర్ముక్తం చ- సుఖదుఃఖములు మొ॥ అంతఃకరణ ధర్మములయినచో జ్ఞానము గూడా అంతఃకరణ ధర్మము అనవచ్చు గదా! అన్నచో జీవునకు జ్ఞానధర్మము లేదు కనుక జీవుడు జడ పదార్థము అగును. కనుక సుఖదుఃఖములు మొ॥ జీవ ధర్మములే అనవలెను గదా! అని శంక. కాని సుఖకామాది జ్ఞానములు మనోవృత్తులు అనగా మనస్సు యొక్క ప్రవర్తనలే. అవి జ్ఞానము యొక్క కాలువలు. కాని జీవుడు జ్ఞానమే. అనగా జీవుని స్వరూపమే జ్ఞానము. (జీవుడు సూర్యునివంటి వాడు, మనోవృత్తులు కిరణముల వంటివి) ఈ జ్ఞానము నిత్యము. స్వయముగా వెలుగునది అందఱిని వెలిగించునది, ఏకరూప మయినది సర్వవ్యాపక మయినది సర్వజగత్తులో వ్యాపించినది, సర్వ ఆధారములకు (దేహం) అతీతమైనది.

57. ఏవం సర్వావభాసకత్వాదేవ జ్ఞానస్వరూపోఽపి జీవః సర్వజ్ఞః ఇతి జ్ఞాతృత్వేన వ్యపదిశ్యతే. జ్ఞాతుః ఏకత్వమ్ చ శ్రుత్యైవ ఉక్తమ్. 'నాన్యోతోస్తి ద్రష్టా' ఇతి-దీపమువలె సూర్యునివలె జీవుడు సమస్తమును వెలిగించును. ఆయన స్వయముగా జ్ఞానమే అయినను 'జ్ఞాత' అని అందువలననే చెప్పబడు చున్నది. ఈ జ్ఞాత ఒక్కడే అని వేదము చెప్పుచున్నది. 'ఆయన కన్న భిన్నమయిన వాడు మఱొకడు లేడు' అని వేదము.

58. నచ జ్ఞాతుః జీవస్య అంతరః కశ్చిత్ అంతర్యామీ జ్ఞాతా అస్తీతి వాచ్యమ్ తస్యాపి అంతః కశ్చిత్ జ్ఞాతా పునరస్తీతి అనవస్థాదోష ప్రాప్తేః- 'జ్ఞాత' అయిన జీవునికి లోపల మఱొక అంతర్యామి అయిన జ్ఞాత కలడని చెప్పినచో అప్పుడు అంతర్యామి లోపల మఱొక జ్ఞాత కలడు అని యిట్లు

ఎంతదూరము అయినను పోతూ ఉండవచ్చును కదా!

59. అంతర్యామిణః సర్వాంతరత్వేన తస్యాపి జ్ఞాతృత్వే జ్ఞాతృధర్మస్య జ్ఞానస్య జ్ఞాత్రంతర్గతత్వేన జ్ఞానస్యైవ సర్వాంతరత్వం స్యాత్, ఇష్టావత్త్వా అంతర్యామిణః సర్వాంతరత్వహానిః, జ్ఞాతృభూత జీవేశ్వరోభయామగత చైతన్యరూప జ్ఞానస్యైవ బ్రహ్మత్వమితి అద్వైతసిద్ధిశ్చ - పైగా ఒక అంతర్యామి జీవుని లోపల ఉండి తెలుసికొనుచున్నాడు అను పక్షమును అంగీక రించినచో, మఱియొక ఇబ్బంది కలదు. జ్ఞాత లోపల జ్ఞానము ఉండును కదా! కనుక జ్ఞానమే సర్వాంతర్యామి కావలసివచ్చును. 'అయితే కానిండు' అన్నచో 'అంతర్యామి' అయిన ఈశ్వరుని యొక్క వ్యాప్తి తగ్గును. ఆయనయందు గల ఒక స్థానములో జ్ఞానము అంతర్యామి అయినట్లే కదా! పైగా ఆ జ్ఞానమే జీవునియందు ఈశ్వరునియందు వ్యాపించినది కనుక 'అంతర్యామి' అను స్థితి జ్ఞానమునకే దక్కును. ఆ పక్షమున జ్ఞానమే బ్రహ్మము అను అద్వైతము సిద్ధించినట్లు.

60. తస్మాత్ జ్ఞాతుః ఆత్మనః స్వరూపమేవ జ్ఞానమ్. నతు ధర్మః. నచ స్వరూప జ్ఞానం న సర్వావభాసకమితి వాచ్యమ్. సుషుప్తి మూర్ఛాదిషు స్వరూప జ్ఞానస్య భావకత్వసిద్ధేః. కథ మన్యథా అసాక్షిక సుషుప్తి మూర్ఛా ద్యభ్యుపగమః- కనుక 'జ్ఞాత' అయిన ఆత్మయొక్క స్వరూపము జ్ఞానము. అది ఆత్మయొక్క ధర్మము. అయితే స్వరూపజ్ఞానము వల్ల అన్నీ తెలుస్తాయా అని, గాఢనిద్రలో గాని, మూర్ఛలో గాని జీవుడున్నను విషయములు తెలియుట లేదు గదా! అని ఒక శంక.

అయితే, స్వరూపమయిన జ్ఞానము వలన సర్వము తెలియును. గాఢ నిద్రలో గాని, మూర్ఛలో గాని సాక్షి లేనిచో (జ్ఞాత అయినవాడు లేనిచో) గాఢనిద్ర పోయినట్లు మూర్ఛలో పడినట్లు ఎట్లు అనుభూతి కలుగు చున్నది. కనుక స్వరూపమయిన జ్ఞానము వలననే (అంతఃకరణము పని చేయకపోయినను) ఈ అనుభూతి కలిగినది.

61. నచ సుషుప్త్యాదిషు జీవస్య జ్ఞానాభావ ఏవేతి వాచ్యమ్. కిం జీవః స్వస్య సుషుప్తౌ జ్ఞానాభావం స్వయం వేద? ఉత న వేద? అద్యే సిద్ధం జీవస్య జ్ఞానమ్. ద్వితీయే-కథం అసాక్షిక జ్ఞానాభావాభ్యుపగమః?- గాఢ నిద్రలో జీవునకు జ్ఞానము లేదని ఒప్పుకొన్నను కుదరదు. ఏమనగా, జీవునకు

తన గాఢ నిద్రలో జ్ఞానము లేదని, తెలిసినదా తెలియదా?-తెలియును అన్నచో జీవునకు జ్ఞానము ఉన్నట్లే. "తెలియదు" అన్నచో తెలియదు అని ఎట్లు తెలిసినది? ఏ జ్ఞానమునకయినను ఒక జ్ఞాత, ఒక సాక్షి కావలెను కదా! కనుక జీవునకు జ్ఞానము గలదని తేలును.

62. **అపి చ, సుషుప్త్యాదిషు వృత్తి జ్ఞానాభావ ఏవ అంతఃకరణా భావాత్. చైతన్యంతు అస్త్యేవ. తస్య నిత్యస్య అభావప్రతియోగిత్వా భావాత్-** అంతేగాక, గాఢనిద్ర మొ॥ వానిలో అంతఃకరణము లేకపోవుట వలన వృత్తి జ్ఞానము అనగా సుఖదుఃఖాది భావనలు లేవు. చైతన్యము అనగా జ్ఞానము మాత్రము గలదు. (అనగా చెఱువు ఉన్నది కాని తూములు కట్టివేయబడినట్లు) జ్ఞానము నిత్యము. ఎన్నడునూ అది అనిత్యము కాదు.

63. **నను యది జీవస్య సుషుప్తావపి జ్ఞానం అస్తు ఇతి, తర్హి జ్ఞానాశ్రయ ఏవ జీవః నతు జ్ఞానమ్ ఇతి చేత్-**అయ్యా, గాఢ నిద్రలో గూడా జీవునకు జ్ఞానము ఉండవచ్చు గదా! కాని అంతమాత్రమున జీవుడే జ్ఞానము అని ఏల చెప్పవలెను? జీవుని ధర్మమే జ్ఞానమని అది గాఢనిద్రయందును కలదని చెప్పవచ్చు కదా! అని శంక

64. **మైవమ్. జీవః సుషుప్తిం అవభాసయతి ఇతి మయా ఉచ్యతే. నతు జ్ఞానమస్తీతి. కస్మా అవభాసయతి? ఇతి చేత్తస్మా ఏవ ఇతి విద్ధి-** అట్లుకాదు. జీవుడు సుషుప్తిని అనగా గాఢనిద్రను తెలియునట్లు చేయును. అంతే తప్ప జీవునకు జ్ఞానమున్నదని చెప్పుట లేదు. జీవుడే జ్ఞానమని చెప్పినాము. ఈ జ్ఞాన స్వరూపుడైన జీవుడు తనకు తానే 'గాఢ నిద్ర' పోయితిని అని తెలిసికొనును.

65. **తర్హి 'అవభాసకః జ్ఞాతా, అవభాసనం జ్ఞానం అవభాస్యం జ్ఞేయం సుషుప్తిః చ' ఇతి సిద్ధైవ త్రిపుటీ సుషుప్తౌ. ఏవం ప్రలయాదిష్వపి ఇతి కథం అద్వైత సిద్ధిః?-** అయ్యా, అద్వైత మనగా ఒక్కటే తప్ప వేఱు ఏదియూ లేకుండుట గదా! గాని మీరు చెప్పినట్లు గాఢనిద్ర (సుషుప్తి)లో 'తెలియజేయువాడు లేదా తెలిసికొనువాడు, తెలిసికొనుట, తెలియబడునట్టి గాఢనిద్ర' అని గాఢనిద్రలోను త్రిపుటి (అనగా 3 విషయములు) కలదు కదా! అద్వైతము ఎట్లు? అట్లే ప్రలయదశయందును ఇట్టి త్రిపుటియుండును.

66. ఉచ్యతే. సుషుప్తి దశాయాం నాస్తి త్రిపుటీ. 'అహమిదం జానామి' ఇతి భేదానుభవాభావాత్. 'యత్ర సర్వం ఆత్మైవ అభూత్ తత్ర కేన కం పశ్యేత్' ఇత్యాది శ్రుతేశ్చ. కింతు నిర్వికల్పకానుభవ మాత్రమేవాస్తి యద్బలాత్ సుషుప్త్యభ్యుపగమః వచానుభవః జీవేవేతి- అద్వైతము ఎట్లు సిద్ధించును? అను విషయము చెప్పెదను. గాఢ నిద్రాదశలో త్రిపుటి లేదు 'నేను గాఢనిద్రను తెలిసికొనుచున్నాను' అని భేదములతో గూడిన అనుభవము లేదు. 'సమస్తము ఆత్మయే అయిన స్థితిలో దేనితో దేనిని చూచును' మొ॥ వేదము కూడా భేదము లేదని చెప్పుచున్నది. కనుక గాఢనిద్రలో ఉన్నది 'ఆత్మ' మాత్రమే. దానికి ఉన్న అనుభవము 'నిర్వికల్పకము' అనగా నేను, ఇది మొ॥ అఱలు లేని అఖండానుభవము. ఈ అనుభవబలము చేత తర్వాత సుషుప్తిని (గాఢనిద్రను) ఊహించుచున్నాము. అనుభవమే జీవుడు కాదు.

67. యద్వా సుషుప్తౌ అజ్ఞానానుభవసత్త్వాత్ అస్తు నామ త్రిపుటీ ముక్తౌ తు న త్రిపుటీ. ఆత్మాతిరేకేణ యస్య కస్యాపి వస్తునః అభావాత్- లేదా గాఢనిద్రలో 'ఏమి తెలియక పోవటము' అనే అజ్ఞానము కలదు. ఆ అజ్ఞానపు అనుభవము కలదు కనుక అజ్ఞానమును అనుభవించువాడు, అజ్ఞానము అను, అనుభవము, అజ్ఞానమునకు గుఱి అయిన విషయములు అను త్రిపుటి గలదు అని ఒప్పుకొందును. కాని మోక్షమునందు మాత్రము ఈ 'త్రిపుటి' లేదు 'ఆత్మ' తప్ప మఱొక వస్తువు లేదు కనుక అది అజ్ఞానము కాదు.

68. నచ ముక్తౌ ఆత్మా బ్రహ్మానందమనుభవతీతి త్రిపుటీ అస్త్యేవ ఇతి వాచ్యమ్. బ్రహ్మ తదానందః తద్భోగః తద్భోక్తా చ ఇతి నాస్తి వివిచ్య పదార్థ చతుష్టయం తు ముక్తౌ. కింతు జీవః బ్రహ్మరూపేణ అస్తి ఇత్యేవ ఉచ్యతే. తచ్చ 'బ్రహ్మైవ ఆనంద' మితి, అనుభవరూపమితి చ సిద్ధాంతాత్ న ద్వైత ప్రసంగః- మోక్షమునందు గూడా 'ఆత్మ' బ్రహ్మానందమును అనుభవించును కనుక 'అనుభవించువాడు, అనుభవింపబడినది, అనుభవించుట' అను త్రిపుటికి అవకాశము కలదు కదా! అద్వైతము పోయినట్లే గదా! అని ప్రశ్న. కాని అద్వైతమున, మోక్షములో 'బ్రహ్మ, ఆనందము, అనుభవించుట, అనుభవించువాడు' అని 4 అంశములు లేవు. జీవుడే బ్రహ్మము అని తెలియుట, బ్రహ్మయే ఆనందము ఇవన్నియు

వేరుకాదు. కనుక ఏకత్వమే. ద్వైతము లేదు.

69. న చైవ మేకస్యైవ భోక్తృత్వం భోగ్యత్వం చేతి కర్మకర్తృభావ విరోధః ఇతి వాచ్యమ్. యథా తవ మతే బ్రహ్మైవ స్వానందమనుభవతీత్యత్ర కర్మ కర్తృ భావ విరోధస్య పరిహారః తథైవ మమ మతేఽపీతి-అట్లయినచో 'జీవుడే భోక్త జీవుడే భోగము' అన్నపుడు 'కర్మకర్తృ-భావ సంబంధము' ఎట్లు నిలుచును? కర్త విడిగా కర్మ విడిగా ఉన్నచో ఆ సంబధము కుదురును గదా? అని శంక. సమాధానము ఏమనగా అయ్యా, మీ మతములో 'బ్రహ్మ' తన ఆనందమునే తాను అనుభవించును అన్నారు గదా! అచ్చట గూడా బ్రహ్మయే కర్త బ్రహ్మయే కర్మ గదా! మఱి మీ మతములో కర్మ, కర్త ఒక్కటే అయినపుడు కర్మ, కర్తృ భావ విరోధము వచ్చినది గదా! అదియెట్లు పరిహారమగునో అట్లే మా మతములోను పరిహారము అగును.

70. అస్తు మమ మతే సఃదోషః తవ మతే కథం తత్పరిహారః ఇతి చేత్ ఉచ్యతే - 'ముక్తః బ్రహ్మానంద మనుభవతి' ఇత్యస్య ముక్తః జ్ఞానానంద బ్రహ్మ స్వరూపేణ తిష్ఠతి' ఇత్యేవ అర్థః ఇతి. అత్ర ప్రమాణం తు 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' ఇతి శ్రుతిరేవ-సరే! నా మతములో ఆ దోషము ఉన్నది. ఒప్పుకొందును. కాని నీ మతములో నయిన దానికి పరిహారమున్నదా? లేదా? అని ప్రశ్న. సమాధానము.

"మోక్షము పొందినవాడు బ్రహ్మానందమును అనుభవించును' అనగా అర్థము ముక్తజీవుడు జ్ఞానానందస్వరూపమయిన బ్రహ్మముగా ఉండును' అని. దీనికి ప్రమాణము బ్రహ్మవేత్త బ్రహ్మమే అగును' అని వేదము.

71. నను జీవేశ్వరభేదకయోః అల్పజ్ఞత్వ సర్వజ్ఞత్వయోః, పరిచ్ఛిన్నత్వ అపరిచ్ఛిన్నత్వయోః, సంసారిత్వ అసంసారిత్వయోః, దుఃఖిత్వ-ఆనందమయత్వయోః, ప్రత్యక్షత్వ పరోక్షత్వయోః, జగదహేతుత్వ-హేతుత్వయోః, పారతంత్ర్య స్వాతంత్ర్యయోశ్చ సర్వానుభవసిద్ధయోః కథం అపలాపః శక్యతే కర్తుమ్ ఇతి చేత్-

| జీవుడు | ఈశ్వరుడు |
|---|---|
| అల్పజ్ఞుడు | సర్వజ్ఞుడు |
| ఖండ స్వరూపుడు | అఖండుడు |
| సంసారి | అసంసారి |

| | |
|---|---|
| దుఃఖి | ఆనందమయుడు |
| ప్రత్యక్షుడు | పరోక్షుడు |
| ప్రపంచ స్రష్ట కాదు | ప్రపంచ స్రష్ట |
| పరతంత్రుడు | స్వతంత్రుడు |

ఇట్లు అనుభవములో భేదములు ఉన్నవి కదా! ఈ భేదములను కాదని జీవేశ్వరులు ఒక్కటే అనియు చెప్పుట ఏమి న్యాయము?

72. *ఉచ్యతే. యస్య అంతఃకరణ తాదాత్మ్యాభిమానః తస్య అజ్ఞస్యైవ అనుభవ సిద్ధ మిదం భేదక జాతమ్. నతు ప్రాజ్ఞస్య. ప్రాజ్ఞో హి సర్వజ్ఞం అపరిచ్ఛిన్నం అసంసారిణం ఆనందం ప్రత్యక్షం జగద్ధేతుం స్వతంత్రం ఈశ్వరమేవ ఆత్మానం మన్యతే*- చెప్పుచున్నాము. అంతఃకరణముతో 'ఏకం' అయిన అజ్ఞానికి ఈ భేదములు అనుభవములోనికి వచ్చును. ప్రాజ్ఞుని అనుభవములో ఇట్టి భేదములు తగలవు. అతని దృష్టిలో ఆత్మ ఎవరో కాదు-సర్వజ్ఞుడు, అఖండుడు, సంసారరహితుడు, ఆనందస్వరూపుడు, ప్రత్యక్షలభ్యుడు, జగత్కారణము, స్వతంత్రుడు అయిన ఈశ్వరుడే తప్ప వేఱు కాడు.

73. *నచ కథం పరోక్షేశ్వరస్య ప్రత్యక్షత్వమితి వాచ్యమ్. యావజ్జీవస్య ఆత్మని సంసారిబుద్ధిః తావదేవ జీవస్య పరోక్షః ఈశ్వరః. యదా తు జీవస్య స్వస్వరూపజ్ఞానం తదా ప్రత్యక్ష ఏవేశ్వరః, జీవస్యైవ ఈశ్వరత్వాత్. 'యత్సాక్షాదపరోక్షాత్ బ్రహ్మ' ఇతి శ్రుతేః, 'స ఆత్మా తత్త్వమసి' ఇతి శ్రుతేశ్చ.* -అయ్యా, తమరు ఈశ్వరుడు ప్రత్యక్షలభ్యుడని ప్రాజ్ఞులు గ్రహించెద రన్నారు. అదెట్లు? అని శంక.

సమాధానము : జీవునకు తనయందు 'సంసారి' అనెడు బుద్ధి ఉన్నంత కాలము జీవునకు ఈశ్వరుడు ప్రత్యక్షము కాడు. ఎపుడయితే జీవునకు తన స్వరూపము తెలియునో అప్పుడే జీవునకు 'ఈశ్వర ప్రత్యక్షము జరుగును. అనగా తానే ఈశ్వరుడని తెలియును. కనుకనే వేదము 'బ్రహ్మము ప్రత్యక్షము అనియు, 'ఆ ఆత్మ నీవే' అనియు చెప్పుచున్నది.

74. *నచ జీవస్య శరీరస్య ఆత్మా శరీర్యేవ ఈశ్వర ఇతి వాచ్యమ్. జీవస్య నిరవయవస్య ఈశ్వర శరీరత్వాయోగాత్. సావయవం హి శరీరం. నచ గగనాదయో నిరవయవాః ఈశ్వర శరీర మేవ-ఇతి వాచ్యమ్. గగనాదీనాం*

*సర్వేషామపి పాదివస్తూనాం సావయవత్వాత్. నచ ప్రకృతిః నిరవయవా-ఇతి వాచ్యమ్. తస్యాః సావయవత్వ నిరవయవత్వాభ్యాం దుర్నిరూపత్వాత్. నచ ఈశ్వర భోగ్యత్వాత్ జీవః ఈశ్వర శేష ఏవ, నేశ్వర ఇతి వాచ్యమ్. జీవభోగ్యత్వాత్ ఈశ్వరస్యాపి జీవశేషత్వప్రసంగాత్. ముక్తైః ఈశ్వరో భుజ్యతే, తవ మతేనాపి-* 'జీవుడు' అను శరీరమునకు ఆత్మ అయిన శరీరియే ఈశ్వరుడు అని చెప్పరాదు. జీవుడు అనాది వస్తువు. ఆయన యందు అవయవములు లేవు. ఏక పదార్థము. కనుక ఈశ్వరునికి శరీరము గల అవకాశము లేదు. శరీరము అన్న తరువాత అవయవములు ఉండవలెను గదా! అయితే, ఆకాశం నిరవయవంగా ఉన్నప్పటికి ఈశ్వర శరీరము కదా! అట్లా జీవుడు గూడా ఈశ్వరశరీరము కావచ్చును కదా అని ప్రశ్న. కాని ఆకాశము మొ॥ సృష్టింపబడిన వస్తువులు. వాటికి 'ఆది' కలదు కనుక అవి సావయవములు కనుక అవి ఈశ్వరశరీరము కాగలవు. అయితే ప్రకృతి నిరవయవము కదా! అది ఈశ్వరశరీరము కదా! అట్లే జీవుడు ఈశ్వరశరీరము కావచ్చును అని మఱల శంక. అయితే ప్రకృతి సావయవమో నిరవయవమో చెప్పుటకు సాధ్యము కాదు.

ఈశ్వరునిచే అనుభవింపబడువాడు కనుక జీవుడే 'ఈశ్వర శేషుడు' అని చెప్పవచ్చు కదా! అని శంక. అప్పుడు ఈశ్వరుని జీవుడు గూడా అనుభవించును కనుక ఈశ్వరుడు గూడా 'జీవశేషుడు' కాగలడు. ముక్త జీవులు ఈశ్వరానందమును పొందుచున్నారు కదా! మఱి.

75. *నచ ఈశ్వర పరతంత్రః జీవః ఇతి వాచ్యమ్. దేహేంద్రియ సంఘాతస్యైవ పారతంత్ర్యమ్, నతు జీవస్య కేవలస్యేతి, నచ జీవాన్ ఈశ్వరో యమ యతీతి వాచ్యమ్. అంతఃకరణతాదాత్మ్యాభిమానినః ఏవ అజ్ఞాన్ ఈశ్వరో యమయతి. నతు ప్రాజ్ఞ మాత్మానమ్*-జీవుడు ఈశ్వర పరాధీనుడు కాడు. దేహేంద్రియాది సమూహమే. పరాధీనము. కేవలం జీవుడు పరాధీనుడు కాడు. ఈశ్వరుడు హృదయమున చేరి జీవులను నియమించును కనుక జీవులు పరతంత్రులు అనవచ్చును. కాని అపుడు గూడా అంతఃకరణముతో ఏకమయి 'అదే తాము' అనుకొనే అజ్ఞానజీవులనే నియమించును గాని-ప్రాజ్ఞుడయిన ఆత్మను కాదు.

76. *నచ అంతఃకరణస్య జడస్య కథం ఈశ్వర నియమనమితి వాచ్యమ్.*

**పాభాసత్వేన అజడత్వాత్ తస్య. నచ ఈశ్వరాత్ జీవాః బిభ్యతి ఇతి వాచ్యమ్. అజ్ఞా ఏవ బిభ్యతి, నతు ప్రాజ్ఞః. నహి సుషుప్తి మూర్ఛాదిషు ప్రాజ్ఞస్య నతః జీవస్య కాపి ఈశ్వరాత్ భీతిః, కిమపి నియమనం, పారతంత్ర్యం వా విద్యతే. ఏవం తత్త్వవిదపి న బిభేతి** - అంతఃకరణము జడపదార్థము కదా. దానిని ఈశ్వరుడెట్లు నియమించును? అనగా, దానియందు జీవుడు అధ్యాస (తనే అది) జెందును కనుక అది చేతన మగును. అందువలన దానిని ఈశ్వరుడు నియమింపగలడు. అట్లే ఈశ్వరునికి అజ్ఞాన జీవులు మాత్రమే భయపడెదరు. ప్రాజ్ఞ జీవుడు భయపడడు. గాఢనిద్ర, మూర్ఛ మొ॥ వానియందు అంతఃకరణబంధము నుండి విడివడిన జీవునకు ఎవరి భయమున్ను లేదు కదా! పరాధీనత లేదు కదా! నియమములు లేవు కదా! అట్లే తత్త్వవేత్త అయిన జీవన్ముక్తుడును అంతే.

77. **నచ ప్రాజ్ఞస్య మూఢత్వాత్ అభీతిః ఇతి వాచ్యమ్. 'ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః' ఇతి వ్యుత్పత్త్యా ప్రాజ్ఞస్య సర్వజ్ఞత్వాత్. నచ యః కించిదపి, న వేద సః సుషుప్తిస్థః ప్రాజ్ఞః కథం సర్వజ్ఞః? ఇతి వాచ్యమ్. యస్మాత్ ప్రాజ్ఞః కించిన్న వేద తస్మాదేవం సర్వం వేదేతి**-ప్రాజ్ఞుడు అను పేరు గాఢ నిద్రలోనున్న జీవునకు గాదా! ఒళ్లెరగని స్థితిలో నుండుటవలన ఆ ప్రాజ్ఞ జీవునకు సర్వజ్ఞత ఎట్లు వచ్చును? ఈశ్వరుని నుండి భయము లేకుండుటకు అదియెట్లు కారణము? అన్నచో, ప్రజ్ఞ (దీనిమీద స్వార్థములో 'ణ' ప్రత్యయము వచ్చును. అందువలన ప్రాజ్ఞ అగును) అను పదమే ప్రాజ్ఞగా మాఱినది. కనుక సర్వజ్ఞుడు అని అర్థము. తనను తప్ప మఱి దేనినీ గుర్తించడు కనుక, ఆత్మజ్ఞానము కలదని అతడు ప్రాజ్ఞుడు.

78. **నచైవం ఘటోపి సర్వజ్ఞ ఏవ ఇతి వాచ్యమ్. ఇష్టాపత్తేః ఘటావచ్ఛిన్నం చైతన్యం హి సర్వజ్ఞమ్. ఘటః కిమితి న సర్వజ్ఞః? ఇతి చేత్ జ్ఞాన స్వరూప త్వాభావా దితి జానీహి**- అయినచో ఘటము గూడా సర్వజ్ఞుడా? అవును సర్వజ్ఞుడే. ఏమనగా, ఘటమునందు వ్యాపించినది ఈశ్వర చైతన్యము గదా. అది సర్వజ్ఞత కలది కదా! అయితే అట్టి చైతన్యము గల ఘటమునకు జ్ఞానము ఏల అనుభవములో లేదు? అని శంక. దానికి సమాధానము ఏమనగా ఘటము జ్ఞాన స్వరూపము కాదు కదా! అది జడ స్వరూపము గదా!.

79. ప్రాజ్ఞః జ్ఞానస్వరూపః ఘటస్తు జడస్వరూపః ఇత్యత్ర కిం మానమ్? ఘటస్య దృశ్యత్వాత్ ప్రాజ్ఞస్య ద్రష్టృత్వాచ్చ ఇతి హేతుః కథం ప్రాజ్ఞస్య ద్రష్టృత్వమ్? సుషుప్తి సాక్షిత్వాత్ ప్రాజ్ఞోపి దృశ్యత ఏవ. న, యేవ ప్రాజ్ఞః దృశ్యతే తస్య ద్రష్టురేవ ప్రాజ్ఞత్వాత్- ప్రాజ్ఞుడు జ్ఞాన స్వరూపుడు అనియు ఘటము జడ స్వరూపమని ఏమిటి ప్రమాణము? అంటే, ఘటము దృశ్యము, ప్రాజ్ఞుడు ద్రష్ట కనుక. అనగా 'ప్రాజ్ఞుడు చూచేవాడు, ఘటము చూచేది' కనుక ప్రాజ్ఞుడు జ్ఞానరూపుడు. కాని గాఢనిద్రలో సుషుప్తికి సాక్షిగా ప్రాజ్ఞుడున్నాడని తెలియుచున్నది కనుక ప్రాజ్ఞుడు, గూడా దృశ్యుడే గదా! ద్రష్ట ఎలా అగును? అని సందేహము రావచ్చును. కాని ప్రాజ్ఞుని అస్తిత్వమును గమనించినవాడు మఱెవ్వరో కాదు. ప్రాజ్ఞుడే. కనుక అతడు ద్రష్టయే అనగా జ్ఞాన స్వరూపుడే.

80. అంతర్యామిణా ప్రాజ్ఞః దృశ్యతే. న, అంతర్యామిణః ఏవ ప్రాజ్ఞత్వాత్. తస్మాత్ ద్రష్టా స్వయంప్రకాశః ఆత్మా జీవః ఈశ్వరః ఏక ఏవ సత్యః. దృశ్యం అన్యత్ సర్వం అసత్యమేవ. దృశ్యత్వాదేవ- అంతర్యామి అయిన ఈశ్వరుడు ప్రాజ్ఞుని చూచుచున్నాడనవచ్చును. కాని అంతర్యామి ఎవరు? ఆయన ప్రాజ్ఞుడే. కనుక ద్రష్ట, స్వయంప్రకాశ మానుడు, ఆత్మ, జీవుడు, ఈశ్వరుడు-అంతా ఒకరే. సత్య స్వరూపుడే. కనబడేది అంతయు అసత్యమే. చూచువాడు ఒక్కడే సత్యము.

81. నను యది అదృశ్యం బ్రహ్మ తర్హి కథం తద్ జ్ఞానే ముముక్షూణాం ప్రవృత్తిః? కథం వా తత్సాక్షాత్కారః? 'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా-' ఇతి కథం శ్రుత్యుప పత్తిః ఇతి చేత్- బ్రహ్మము కేవలము 'ద్రష్ట' అయినచో, దృశ్యము కానిచో అదృశ్యమయిన ఆ బ్రహ్మమును ఎట్లు పొందగలము? పొందరాని దానికొఱకై మోక్షకాములు ఎందుకు సిద్ధపడుతున్నారు? పైగా 'నిశితమయిన బుద్ధితో ఆయనను చూడగలము' అని చెప్పిన వేదవాక్యమునకు అర్థమేమి? బ్రహ్మము దృశ్యమని గదా! మఱి మీరు అదృశ్యమనుట ఎట్లు?

82. ఉచ్యతే దృశ్యత ఏవ బ్రహ్మాస్వేన, స్వప్రకాశత్వాత్ అన్యేన తు న దృశ్యతే. జీవస్య తు బ్రహ్మానన్యత్వాత్ జీవేన బ్రహ్మ దృశ్యత ఏవ. స్వస్య స్వయం హి సదాపి అపరోక్షః. బుద్ధ్యా దృశ్యత, ఇతి శ్రుతిస్తు బుద్ధ్యుపహితేన జీవేన దృశ్యత ఇతి అభిప్రాయగర్భా- బ్రహ్మము తనను తాను దర్శించును.

తాను మాత్రమే ప్రకాశించునది కనుక ఇతరులకు అది కనబడదు. జీవుడు బ్రహ్మము, వేఱు కాదు కనుక జీవునకు బ్రహ్మ ప్రత్యక్షము కలదు. ఎవడయినను తనకు తాను ప్రత్యక్షమే కదా! వేదములో బుద్ధికి కనబడునని ఉన్నది కదా! అంటే బుద్ధి గల జీవునికి లేదా బుద్ధిలో లీనమయిన జీవునకు దర్శనమగును అని అర్థము. అనగా తనకు తాను బ్రహ్మము దృశ్యము.

83. **యద్వా, బుద్ధౌ ఏకాగ్రాయాం సత్యాం జీవః ఆత్మానం సాక్షాత్కురుత ఇతి. నచ స్వ సాక్షాత్కారం ప్రతి కుతః జీవస్య బుద్ధ్యపేక్షా ఇతి వాచ్యమ్. ఇతః ప్రాక్ బుద్ధి విక్షేపవశాత్ జీవః ఆత్మానం సంసారిణం అజ్ఞం ఈశ్వర భిన్నం చ జ్ఞాత్వా ఖిన్నః ఇతి ఇదానీం బుద్ధి శుద్ధిః అపేక్షితా జీవేన. బుద్ధి నైర్మల్యాత్ జీవస్య అనాత్మతాదాత్మ్యాభిమాననాశే సతి స్వస్వరూప సాక్షాత్కారో భవతీత్యర్థః-** లేదా, బుద్ధి ఏకాగ్రముగానున్నచో జీవుడు బ్రహ్మ సాక్షాత్కారమును పొందునని అర్థము. బ్రహ్మము అనగా ఆత్మయే కదా! తనను తాను తెలిసికొనుటకు జీవునకు బుద్ధి సహాయమేల? అందున నిశితమయిన ఏకాగ్రత ఏల? ఏలనంటే, ఇంతకు ముందు బుద్ధి కలుషత్వము వలన ఏకాగ్రత లేకపోవుట వలన, జీవుడు తన స్వరూప జ్ఞానము లేక, తాను సంసారినని అజ్ఞానినని, ఈశ్వరుడు కానని భావించి బాధపడుచున్నాడు. కనుక ఆత్మ జ్ఞానమునకు నిర్మల ఏకాగ్రబుద్ధి అవసరముయినది. నిర్మలబుద్ధి వలన దేహాది భ్రాంతి వదలిన జీవునకు ఆత్మ సాక్షాత్కారము కలుగును.

84. **తస్మాత్ యేన బ్రహ్మ దృశ్యతే, స ఏవ బ్రహ్మేతి. ద్రష్టు ఏవ బ్రహ్మ. న తు దృశ్యమ్. తచ్చ జీవ ఏవ, జీవస్యైవ బ్రహ్మద్రష్టృత్వాత్. ఘటాదికం తు దృశ్యమేవ. నతు ద్రష్టృ. దృశ్యం ద్రష్టృ చ ఇతి పదార్థ ద్వయమేవ మాయా. తత్కార్యం సర్వం జగత్ దృశ్యమ్. ద్రష్టు తు బ్రహ్మ. తచ్చ దృగ్రూపం. జీవః ఈశ్వరశ్చ బ్రహ్మైవ. దృగ్రూపత్వాత్ జీవస్య ఈశ్వరస్యచ. దృక్చ జ్ఞానం చైతన్యం ఇతి అర్థాంతరమ్-** కనుక బ్రహ్మను దర్శించువాడు బ్రహ్మమే. బ్రహ్మయేద్రష్ట దృశ్యము బ్రహ్మము కాదు. జీవుడు బ్రహ్మమును దర్శించును. జీవుడు బ్రహ్మమే కదా! 'కుండ' మొదలైనవి దృశ్యములే. ద్రష్టలు కావు. 'చూచువాడు-చూడదగినది' అను '2' పదార్థములు మాయ మాత్రమే. 'మాయ' వలన వచ్చిన జగత్తు అంతయు దృశ్యమే. ద్రష్ట

మాత్రము బ్రహ్మమే. ఆ 'దృక్' అనగా జ్ఞానము లేదా చైతన్యము యొక్క రూపము, జీవుడు, ఈశ్వరుడు-అన్నియు బ్రహ్మమే. దృక్కు యొక్క రూపము = జీవుడు ఈశ్వరుడు. 'దృక్' అనగా జ్ఞానము చైతన్యము.

85. **జ్ఞానం చ అపరిచ్ఛిన్నమేవ. జ్ఞానేన జ్ఞేయస్యైవ పరిచ్ఛిద్యమానత్వాత్. జ్ఞానస్య జ్ఞానాంతరేణ పరిచ్ఛేదవాదే అనవస్థా దోషాత్. జ్ఞానస్యాపి జ్ఞేయత్వా పత్తేశ్చ**- జ్ఞానము అఖండమయినదే. జ్ఞానము జ్ఞేయములను (తెలిసికొనబడు విషయములను) పరిచ్ఛేదించును. అనగా పరిమితము చేయును. ఒక జ్ఞానమును మఱొక జ్ఞానము పరిమితము చేయునన్నచో మఱల ఆ జ్ఞానమును పరిమితము చేయుటకు అనగా తెలిసికొనుటకు మఱొక జ్ఞానము కావలయును. ఇలా దీనికి అంతు ఉండదు. పైగా జ్ఞానము గూడా 'జ్ఞేయము' గా మాఱును.

86. **అత ఏవ జ్ఞానమేకం, ఘటపటాది విషయభేదేపి జ్ఞానాభేదాత్. అత ఏవ 'సత్యం నిత్యం చేతి కథం జ్ఞానస్వరూపస్య జీవస్య పరిచ్ఛిన్నత్వం నానాత్వం వా?**- కనుక జ్ఞానము ఒక్కటే. కాక పోతే ఘటజ్ఞానము పట జ్ఞానము అను విషయభేదము ఉన్నను 'జ్ఞానము' లో భేదము లేదు కదా! (జొన్న అయినా బియ్యం అయినా సజ్జ అయినా 'ఆహారం' అవుతుంది గదా! అలా) కనుక జ్ఞానము సత్యము. నిత్యము. జీవుడు జ్ఞానస్వరూపుడు. అట్టి జీవునకు 'పరిమితి' ఎట్లుండును? ఒక్కటే అయిన జ్ఞానము రూపముగా గల జీవునకు అనేక భేదములు ఎట్లుండును?

87. **తస్మాత్ అపరిచ్ఛిన్నః ఈశ్వరః ఏవ జీవః, ఈశ్వరస్యాపి తస్య జీవత్వం భ్రాంతి సిద్ధమేవ. రజ్జోః సర్పత్వమివ**- కనుక అఖండ స్వరూపుడైన ఈశ్వరుడే జీవుడు. ఈశ్వరుడైనను 'జీవునిగా' భావించికొనుట భ్రాంతి వలన వచ్చినది. త్రాడు మీద 'పాము' అనుభ్రాంతి కలుగును కదా!

88. **భ్రాంతిహేతుస్తు మాయైవ. సాచ ఆత్మతత్వ సాక్షాత్కారాత్ నశ్యతి. సతి తు మాయానాశే సర్వద్వైత నివృత్తిః ఇతి శిష్యత? ఏక మేవ బ్రహ్మ**- ఈ భ్రాంతికి కారణము మాయయే. ఆత్మతత్వము దర్శించిన పిదప 'మాయ' తొలగును. (త్రాడు అని తెలిసిన తర్వాత 'పాము' అను భ్రాంతి తొలగినట్లు) మాయ తొలగిన తర్వాత ద్వైతము పూర్తిగా తొలగును. కాగా 'బ్రహ్మము' ఒక్కటే మిగులును.

89. **తచ్ఛాశేషం సత్యేవమద్వైతే కథం ముక్తస్య ఈశ్వర సామ్యాపత్తిః వ కథ మపీతి, ముక్తస్య బ్రహ్మ సాయుజ్యమేవ**- ఆ బ్రహ్మయే సమస్తము. దానికి శేషములేదు. ఇట్లు 'అద్వైతము' నిశ్చయమయిన పిదప ముక్తజీవునకు ఈశ్వరసామ్యము (అనగా విష్ణువుతో సమానభోగము) అనునది అసంబద్ధము. ముక్త జీవుడు బ్రహ్మయే కనుక 'బ్రహ్మ సాయుజ్యమే' మోక్షము. అనగా బ్రహ్మములో లీనమగుటయే.

ఇది బెల్లంకొండ రామరాయకవి గ్రంథములలో
'అద్వైత విజయము' లో "సిద్ధాంత భాగము'
(సాధారణ మార్గశిర శుద్ధదశమి)

132

శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

# త్వరలో

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచిత

## శ్రీమద్ధయవదన శతకమ్

హేషావ్యాఖ్యా

(ఆంధ్రప్రతిపదార్థవివరణమ్)

**డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి**
రీడర్, శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృతాంధ్ర కళాశాలా,
తిమ్మసముద్రః